

# 'కక్ష'పై సమీక్షలు

**నవంబర్‌నెల 'చతుర'లో ప్రచురితమైన ముద్దంశెట్టి హనుమంతరావు గారి 'కక్ష' నవలపై మాకు అందిన చతుర సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**

## అక్షరసత్యాలు

*(ప్రథమబహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

కావ్యరచన కేవలం కవియశస్సుకే కాదు. ఉపదేశాత్మకంగా కూడా ఉండాలనే పూర్వోక్తికి ప్రాధాన్యతనిస్తూ రచించే రచయితలకి స్ఫూర్తినిచ్చే ''చతుర'' నిజంగా మాసపత్రికలలోనే ఒక కలికితురాయి. 'చతుర' ఈ నెల ప్రచురించిన ముద్దంశెట్టి హనుమంతరావుగారి 'కక్ష' నవల ఈనాడు సమాజంలో ఎందరో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యకి అద్దంపట్టేదిగా ఉంది. ఆడదాన్ని చూడగానే వక్రమైన ఆలోచనలకు మెలికలుతిరిగిపోయి, తమ పైశాచిక వాంఛలను తీర్చుకోడానికి ప్రయత్నించి అవి నెరవేరనప్పుడు కక్షతో కాలిపోయి, ఎదుటివ్యక్తి జీవితాన్ని నాశనంచేయడానికి కూడా సిద్ధమయ్యే వ్యక్తులు తక్కువేంలేరు. వాళ్ళు పన్నినవలల్లో చిక్కి సంసారజీవితానికి దూరమై విలపించే అబలలు; భార్యమాటలకి, అభిప్రాయాలకి విలువనివ్వక భర్తననే అభిజాత్యంతో మంచి చెడు అవగాహన చేసుకోక తమ సంసారాలని చీకటిమయంచేసుకునే పురుషులు కోకొల్లలు.

ఈ సమస్యని రచయిత వివరించినతీరులో బాగంగా సృష్టించిన పాత్రలు - దురాలోచనల భైరవమూర్తి, అతని ఆలోచనల కారణంగా బాధపడిన దీప్తి, సంసారజీవితాన్ని నాశనంచేసుకున్న రామరాజు. ఈ ముగ్గురి మధ్య ప్రధానంగా నడిచింది 'కక్ష'. రామరాజు స్వతహాగా మొహమాటస్థుడు కావడంతో తను చేస్తున్నది ఒప్పు కాదేమోనని అంతరంగం హెచ్చరిస్తున్నా, నాటక సమాజంలో తనకు అత్యంత ప్రాధాన్యతనిస్తున్నట్లు కన్పిస్తున్న స్నేహితుడు భైరవమూర్తిని కాదనలేని బలహీనుడు. తనకిష్టమైన నాటకరంగంలో వృద్ధిలోకి రావాలనే తపన రామ్మరాజుని భైరవమూర్తి పన్నిన వలలోకి నెట్టాయి. రామరాజు బలహీనతలు భైరవమూర్తికి స్నేహమనే ముసుగులో దీప్తి పైన కక్ష సాధించడానికి వీలు కల్పించాయి. విజ్ఞతతో సరైన సమయంలో శమంత కల్పించుకోకపోయివుంటే ఆ కక్షకి దీప్తి జీవితం బలైపోయి రామరాజు వచ్చని సంసారం విచ్ఛిన్నమయిపోయివుండేది. సరైన సమయంలో ఈ విధంగా శమంత పాత్ర ప్రవేశంతో నవలను చక్కని మలుపుతిప్పిన రచయిత ప్రశంసనీయుడు.

రచనకి ఎన్నుకున్న ఇతివృత్తం, సన్నివేశకల్పన, పాత్రచిత్రణ సహజంగా వుండి, అనుభవజ్ఞుడైన రచయిత నుండి వెలువడిన రచన అని తెలియజేస్తున్నాయి.

శమంత చెప్పినట్లు మంచీ చెడు గ్రహించగలిగే వివక్షత, ఎవరు మిత్రులో ఎవరు శత్రు




వులు తెలుసుకోగలిగే విజ్ఞత లోపించినప్పుడు ఇటువంటి అవకతవకలే జరుగుతాయి. మగవాడికి అందరికంటే సన్నిహితవ్యక్తి, శ్రేయోభిలాషి భార్యే కనుక, భార్య అభిప్రాయాలకి విలువనివ్వాలి, అప్పుడే సంసారం స్వర్గతుల్యం అవుతుంది.

నవలలోని కొన్ని వాక్యాలు "కక్ష - మనిషిలోని మానవత్వాన్ని నిర్దాక్షిణ్యంగా చంపేస్తుంది. మంచి - చెడు అన్న విచక్షణాజ్ఞానాన్ని మంటగలుపుతుంది" అన్నది వదిలంగా భద్రపరుచుకోదగ్గ అక్షరసత్యాలు.

—పి.రామానుజమ్మ, హైదరాబాదు

## సజీవ రూపకల్పన

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

కళాకారుల జీవితం ఎప్పుడూ తెరమీదే బాగుంటుందిగానీ మనం కొంచెం తెరవెనక్కి వెళ్ళిచూడగలిగితే కనిపించే మరో జీవితమే ఈ "కక్ష".

ఏ అలవాటూలేని రామరాజుని నాటకరంగంపట్ల అతనికిగల అభిరుచిని ఆలంబనగా చేసుకుని దారితప్పించాడు భైరవమూర్తి. ప్రతిమనిషికీ తానేదో గొప్పవాణ్ణయిపోవాలనే తపనే ఒక్కోసారి ఇటువంటి అడ్డదార్లుతొక్కిస్తుంది. ఒకవైపునుండి ఎదగడానికి ప్రయత్నిస్తున్నామనే అనుకుంటారుగానీ, ఇంకోవైపునుండి దిగజారుతున్నామని తెలుసుకోరు.

ఒకరకంగా కళారంగాన్ని భ్రష్టుపట్టించేది దారితప్పే ఇలాంటి కళాకారులే. వారి ప్రవర్తన వల్ల వారికి సంబంధించిన చాలా మందికి, కళారంగంమీద చెడు అభిప్రాయం కలుగుతుంటుంది. భైరవమూర్తి ఎంతస్నేహితుడయినా రామగాజు దీప్తి మాటలు లెఖ్ఖ చేయకపోవడమూ, అన్ని సంవత్సరాలనుండీ పరిచయమైన భైరవమూర్తి స్వభావం రామరాజుకి అసలు తెలీదనడం కొంచెం అసహజంగా ఉంది. స్నేహితుల స్వభావం కొంత తెలుసున్నా తమలో కూడా బలహీనత ఉండటంవల్లే దిగజారుతారు రామరాజులాంటి వ్యక్తులు.

భైరవమూర్తి స్వభావం తెలుసుండీ దీప్తి, భైరవమూర్తిని రెచ్చగొట్టడం అంతబాగాలేదు.

[illegible]

ష్కారం చూపించడం చాలా బాగుంది. కొన్నికొన్ని సమస్యలు అప్పులకు వెల్లడి చేసుకుంటే కానీ తీరవు. దీప్తి తన సమస్యకి కంగారుపడి, అల్లరిచేసి, తల్లితండ్రులకి మనస్తాపం కలిగించకుండా తానే పరిష్కారానికి ప్రయత్నించడం ఈ కాలపు అమ్మాయిలకి మార్గదర్శకం. ప్రేమ పాత్రపరిష్కారంలేని సమస్యలున్న ఎన్నోజీవితాలకి ప్రతిబింబం. మొత్తానికి ఈ నవల నేటిసమాజానికి సజీవరూపకల్పన అని చెప్పాలి.

—లంక సూర్యకాంతం హైదరాబాద్

## సాగలాగిన 'కక్ష'

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

ఒక తెలివైన స్త్రీ జీవితంలోని ఒక చిన్న ఘటనను ఆమె ఏకైక జీవితసమస్యగా మలచిన తీరు- కథగా చెప్పే బదులు నవలగా వంద పేజీలకు సాగలాగినట్లు ఉంది నవంబర్ నెల 'చతుర' నవల "కక్ష".

రామరాజు, భైరవమూర్తిల స్నేహం విచిత్రంగా ఉంది. ఇద్దరివీ భిన్నమైన వ్యక్తిత్వాలూ, అలవాట్లూ. ఇద్దరి స్నేహాలను కలిపింది-నాటకాలూ, ఒకే ఆఫీసూ.

"స్నేహితుల మాటలకు మైమరచి వాళ్ళ ఒత్తిడికి తలవొగ్గి ఒక దురలవాటుకి దాసోహమయ్యే మీ వంటివారి మనస్సు ఎంత దుర్బలమైనదో అర్థమవుతోంది. నిజానికి క్షమించమని అర్ధాంగిని అర్థించడంకంటే, చెడు అలవాట్లను ప్రోత్సహించే మీ స్నేహితుల్నే క్షమించమని కోరుతూ తప్పించుకోవచ్చు కదండీ?..." భర్తతో దీప్తి అన్న ఈ మాటలు దురలవాట్లను 'కంపెనీ' పేరుతో సమర్థించుకునేవారికి చెంపపెట్టుగా వున్నాయి. భర్త రామరాజుతో దీప్తి ఘర్షణపడిన వివిధ సందర్భాలలో ఆమెను చాలా తెలివైన స్త్రీగా మలిచారు. కానీ, పెళ్ళికాకముందు భైరవమూర్తితో జరిగిన ఘటనను ముందుగానే తన భర్తతో చెప్పి పరిష్కరించుకునే బదులు, అదే తన జీవితసమస్యగా తయారయేలా ప్రవర్తించటం అసహజంగా వుంది. దీప్తి పాత్రకు రచయిత ఎంతో సహనం

ముఖచిత్రం: లక్ష్మణ్

అందించేది గృహలక్ష్మే! వారిలో అంతులేని ఓర్పు, సహనం వుండాలి. ఎందుకిలా రాస్తున్నానో నువ్వు గ్రహించుకోగలవు" ఈ నీతులు స్త్రీలను- వంటింటి కుందేళ్ళుగా, పిల్లలుకనే యంత్రంగా, భర్తకు పడకింటి భోగినిగా చేసే ప్రయత్నాలే.

—వి. రాధ, విజయవాడ

## సహజత్వానికి దూరంగా...

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'కక్ష' కథావస్తువులో చిన్నలోపం వున్నట్లనిపిస్తుంది. నవల మొదట్లోనే నాయిక పాత్రధారి దీప్తి, ఆమె స్నేహితురాలు శమంత కలసి తమతో పరిచయంపెంచుకోబోయిన భైరవ మూర్తికి పనికిరాని పరిజ్ఞానానికి సంబంధించిన కొన్ని ప్రశ్నలువేసి సమాధానం చెప్పలేని అతన్ని అవమానించడం కొంత అసమంజసంగా వుంది. ఆ అవమానాన్ని పురస్కరించుకొని అతడు పెళ్ళి విడిదిలో వున్నట్లు మర్చిపోయి తన భార్య, ఇంకా ఎందరో ఇతరులు వున్నచోటు అని కూడా చూడకుండా మేడపైన ఒంటరిగా కన్పించిన దీప్తిపట్ల అసభ్యంగా ప్రవర్తించి ఆమె చెంపదెబ్బతినటం ఫలితంగా ఆమెపై కక్షకట్టడం జరుగుతుంది. ఇదికూడా అంత సహజంగా అన్పించదు. అయితే ఈ ఒక్కసంఘటనపైననే ఆధారపడి వున్న మిగిలిన కథ, సన్నివేశాలు సహజత్వాన్ని కోల్పోయినట్లు కన్పిస్తాయి. ఇవన్నీ కలసి కథను అసమంజసంగా తయారుచేశాయి.

ఆఫీసువర్కు, మిగిలిన ఏ విషయాలపట్లనైనా బాధ్యతారహితంగా వ్యవహరించే భైరవమూర్తి తన పగపట్ల మాత్రం సిన్సియర్‌గా వుండటం వింతగా తోస్తుంది.

తెలివయినది, చదువుకున్నది అయిన దీప్తి తన సమస్యను, భైరవమూర్తి కుటిలబుద్ధిని సమయస్ఫూర్తితో వ్యవహరించి భర్తకు తానే స్వయంగా చెప్పకుండా పిరికితనంతో పారిపోయి, స్నేహితురాలిని ఆశ్రయించి, ఆమె సహాయం కోరడం కూడా అంత సమంజ





...సంగా అనిపించదు.

నిజానిజాలు వెల్లడయిన తరువాత భైరవ మూర్తి నెలరోజులు సెలవుపెట్టి వెళ్ళిపోవటంతో అతడు తన తప్పును గ్రహించినట్లు భావించే అవకాశం లేదు.

అయితే నవల ఆద్యంతం విసుగులేకుండా చదివించిందనడంలో సందేహం లేదు. పైన వివరించిన లోపాలను రచయిత గ్రహించి వుంటే నవల ఇంకా చక్కగా వుండేది. శైలి సరళంగా వుండి పాఠకుల్ని ఆపకుండా చదివించింది.

—జి.రంగబాబు, అనకాపల్లి

## మూసకథ

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'స్వేచ్ఛ'లాంటి ఆణిముత్యాలను అందించిన 'చతుర' స్థాయికి 'కక్ష' కొంచెం తక్కువగానే వుంది. అంతా మూసపాత్రలు... మూసకథనంతో నడిచింది. ముగింపులో కొంత కొత్తదనం చూపించడానికి రచయిత ప్రయత్నించి విఫలమైనట్లున్నారు. "కుర్చీలు లేకపోతే కూర్చోడం మాననట్లు, కూర్చేశక్తి నశిస్తే కూర్చొదనింత చెత్త సిరిసిరిమువ్వా" అన్న శ్రీశ్రీ పద్యాలు గుర్తొస్తాయి.

దీప్తి, రామరాజు, భైరవమూర్తి పాత్రల చిత్రణ హీరోయిన్- హీరో- విలన్ అన్నట్లుగా సాగుతుంది "కక్ష". అలనాడు ద్రౌపది పరిహసించినందుకు దుర్యోధనుడు కక్ష వహించినట్లు, ఈ నవలలో భైరవమూర్తి దీప్తి కొట్టిన చెంపదెబ్బకు విచలితుడై కక్షబూనడం, హీరో రామరాజును "మందురాజు"గా పాడుచేయడం, ఆకారణంగా దీప్తి - రామరాజుల అన్యోన్య దాంపత్యం విభేదాలతో ముక్కలుచెక్కలవడం, చిట్టచివరికి శమంత సాయంతో వారి దాంపత్యం చక్కబడటం... సగటు తెలుగు సినిమా కథలాగే వుంది.

శమంత చెప్పినంతనే రామరాజు మనసు మారుతుందనుకుంటే ఆ విషయాన్ని దీప్తి రామరాజుకి ముందే చెప్పి వుండవచ్చును కదా? ఈవిధంగా రీజనింగ్‌కి దొరకని ఎన్నో విషయాలు ఈ నవలలో చోటుచేసుకున్నాయి. ఇంతకీ భైరవమూర్తి మారినట్టు కూడా లేదు. రామరాజు - దీప్తిల దాంపత్యంలో అపోహలు

తొలిగాయి. రామరాజు భైరవమూర్తి నిజస్వరూపం తెలుసుకున్నాడు. దీప్తిని అక్కున చేర్చుకున్నాడు... వగైరా సంఘటనలతో అంతా తెలుగు సినిమాలాగే వుంది.

—ఎస్.నాగరాజు, ఆదోని

## సందేశాత్మకం

*(రు: 25/- బహుమతిపొందిన సమీక్ష)*

“కక్ష”లో కుటుంబ కథావస్తువును ఒక సున్నితమైన కామెడీగా ముగిసిన ట్రాజెడీగా ఆసాంతం చక్కగా నడిపించి సుఖాంతం చేశారు రచయిత. ఇందులోని ఇతివృత్తం పాతదే అయినప్పటికి నిప్పులాంటి నిజం ఏనాటికైనా దుర్మార్గులను దహించి వేస్తుందనే సందేశాన్ని రచయిత సూటిగా ఇవ్వగలిగారు. ఈ ఫామిలీ డ్రామాలో కేంద్రబిందువు దీప్తి - కాలగమనంలోని ఒడిదుడుకులను ధైర్యంగా తట్టుకుని ఉన్నతంగా నెగ్గుకొచ్చింది.

భైరవమూర్తిలాంటి కాలభైరవులు సాంఘిక జీవనాన్ని స్వార్థంతో ఎలా ఛిన్నాభిన్నం చేస్తుంటారో మనకీ నవలద్వారా తెలుస్తుంది. అటువంటివారిని నమ్మేవారికిది చక్కని కనువిప్పు. తోటిస్త్రీ సంసారజీవితాన్ని కాపాడటానికి శమంతలాంటి స్నేహితురాళ్లు ముందుకురావలసిన అవసరాన్ని గుర్తింపజేస్తుందీ నవల. స్త్రీకి స్త్రీయే శత్రువనే నానుడి ఇంకా ప్రచారంలో ఉన్నరోజుల్లో ఇది హర్షించదగ్గది. సున్నితమైన, పవిత్రమైన భార్యాభర్తల అనుబంధాన్ని ఎలా కాపాడుకోవాలో దీప్తిలాంటి మధ్యతరగతి ఇల్లాండ్రకు సూచనగానన్నా తెలుపుతుంది ఈ నవల. ఈనాటి ఉద్యోగ సమాజాలు ప్రతివిషయానికి ‘పార్టీ’ అంటూ బయల్దేరి ఎలా పతనమౌతున్నారో రామరాజు పాత్రనుబట్టి తెలుసుకోవచ్చు. రామరాజులాంటి అమాయకులు ఇది గుర్తిస్తే నవల ఆశయం నెరవేరుతుంది; రచనకు పరమార్థం చేకూరుతుంది. మొత్తంమీద ‘కక్ష’ నవల చదువుతున్నంతసేపు చక్కని కుటుంబ కథాచిత్రం చూస్తున్నట్లనిపించింది. వెరైటీ కథాగమనం, సామాజిక స్పృహతో కూడిన చక్కని సందేశాత్మక నవల ‘కక్ష’. ప్రతినెల పాఠకులకు సరికొత్త నవలలందిస్తున్న ‘చతుర’కు ధన్యవాదాలు.

—ఎస్.శాంతకుమారి, ఇద్దనవలన

# చతుర

జనవరి 1989

సంపుటి: 11 సంచిక: 12



"నీ పాతికేళ్ళ రాజకీయజీవితం ప్రతిపక్షంలోనే గడిచినా నీకొరిగిందేమీ లేదు. పదవి ఇప్పిస్తా- ప్రజలకు సేవచేసుకో" అని ఓ ప్రతిపక్షనాయకుడినీ; "నెల జీతంతో నీ సరదాలెలా తీరతాయి? నీ కొడుకు చదువు, కూతురి పెళ్లి, భార్య కోరికలు... ఏది తీరాలన్నా డబ్బు కావాలి. మనస్సు, అంతరాత్మ అనేవి పిరికివాళ్లు వాడుకునే ఆయుధాలు - ఇంద... ఇది వుంచు" అని నోట్లకట్టల్ని విసిరి ఓ పోలీసాఫీసరునీ లొంగదీసి తన రాజకీయచాతుర్యంతో వారిని చక్రవ్యూహంలో బంధించాడతను. ఫలితంగా తాత్కాలికంగా తను బయటపడినా మరొక కేసులో తనుకూడా చక్రవ్యూహంలో ఇరుక్కోక తప్పలేదతనికి.

అలనాటి అభిమన్యుడు పద్మవ్యూహంనుండి బయటపడటం తెలీక శత్రువుల కుతంత్రాలకి ఆహుతయ్యాడు. నేటి రాజకీయాభిమన్యులు తామే సామాన్యులకు సమస్యగా తయారై ఏరికోరి తమను తాము చక్రవ్యూహంలో బంగారుసంకెళ్లతో బంధించుకుంటున్నారు. బయటపడటం వారికి అయిష్టం. ప్రాణం పోయినా ఫరవాలేదుగానీ పదవి వూడొద్దనేది వారి పాలసీ.

ప్రస్తుత రాజకీయ వ్యవస్థకి అద్దంపట్టే సన్నివేశాలతో, వాస్తవ సంఘటనలతో ఆద్యంతం ఉత్కంఠతో చదివించే వయ్యస్సారెస్ తాజానవల 'చక్రవ్యూహం'

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల

వుంది రాజధాని నగరంలోని ఆ ప్రాంతం...

విలాసవంతమైన ఆ ప్రాంతంలో ఏడంతస్థుల భవనం...

ఆ భవనంలో ఓ ఫ్లాటు...

అందులో డబుల్‌కాట్ బెడ్...

బెడ్‌మీద గవర్రాజు.... ఆయన ఒళ్ళో మోహిని...

మోహిని చేతిలో గ్లాసు... గ్లాసులో లిక్కరు...

సిప్ సిప్‌కీ మధ్య గవర్రాజు నోటికి జీడిపప్పు అందిస్తోంది మోహిని.

జీడిపప్పు అందుకుంటూ అడపాదడపా ఆమె చేతి వేళ్ళని కొరుకుతూ చురుగ్గా సరసమాడుతున్నాడతను. ఒక చేత్తో అతని నోటికి గ్లాసు అందిస్తూ రెండో చేత్తో సుతారంగా అతని తలవెంట్రుకలు నిమురుతోందామె.

గవర్రాజుకి మోహిని అందం కొత్తేమీకాదు. కాని ఈ క్షణంలో తనని ఆసాంతం తన్మయత్వంలో ముంచుతూ తన వెన్నులో కోర్కెల సెగలురేపుతున్న ఆమె లాలిత్యం మాత్రం కొత్తగానే వుండి వింత అనుభూతినిస్తోంది. లోనెక్ జాకెట్‌లోనుంచి ఎగదన్నుతున్న పొంగులు కళ్ళని కట్టిపడేస్తున్నాయి. అతని చూపులు కోరికల పొగలు చిమ్ముతున్నాయి. ఆ కళ్లల్లోని ఎర్రజీరల అర్థమేమిటో ఆమెకి తెల్సు.

గవర్రాజు డోస్ మించిపోతున్నాడు!

అందుకే త్వరపడి అసలు విషయానికొచ్చింది.

"డియర్..." సుతారంగా పిలిచింది.

అది పిలుపుకాదు... లాలింపు.

బలవంతాన చూపులు మరల్చి ఏమిటన్నట్టు చూశాడు మోహిని కళ్లల్లోకి.

"నా రవ్వల నెక్లెస్ సంగతి ఏం చేశారు?"

అది డిమాండు కాదు... అలాగని అర్థింపుకాదు.

"ఏం రవ్వలు... ఏం నెక్లెస్సోయ్?"

అతని చేతులు ఆమె మేనని సవరిస్తున్నాయి. మాటల్లో తడబాటు తెల్సిపోయిందామెకి. ఇక లాభం లేదనుకుని వెంటనే గ్లాసు





ఆని ఎల్బోల పట్టేసింది.

"నాకు మీరు చేయిస్తానన్న నెక్లెస్... గుర్తులేదా?"

"ఓస్... అదా! పాత బెండరేగదా. దాన్నలా వుంచి మళ్ళీ మరో నెక్లెస్ అడుగుతున్నావేమోననుకున్నానోయ్". మత్తులోకూడా తేలిగ్గా నవ్వేశాడు.

"ఆఁ... మరే... అడిగిందానికి ఠికాణాలేదు. మరోటి అడిగే అదృష్టం కూడానా"

ఆమె మాటల్లో పెళుసుదనం హెచ్చుతోంది.

"మరేం ఫర్వాలేదు. అడుగు- ఒకటి కాకపోతే వంద అడుగు. నీకోరిక తీర్చకపోతే ఈ పదవి, హోదా ఇవన్నీ ఎందుకు?"

"ఆ... ఇలా మాటలతోనే కాలం వెళ్ళబుచ్చుండి. అడిగి అడిగి నేను నోరుపారేసుకోవడం తప్పించి మరేమీ కనిపించటం లేదు"

మోహిని మాటలు పదునెక్కుతున్నట్టు పసిగట్టాడు గవర్రాజు. ఇంతలో అతని ఒళ్ళోనుంచి లేచి బెడ్‌మీద దూరంగా జరిగి కూర్చుంది మోహిని.

"వాట్ డియర్.. కోపమొచ్చేస్తోందా?" ఆమె బుగ్గలు నిమురుతూ లాలనగా అడిగాడు. అతనికి లాలింపు వెన్నతోపెట్టిన విద్య. వృత్తి నేర్పినపాఠం. ఈ విద్యతోనే ఇన్నాళ్ళూ ప్రజల్ని లాలిస్తూ వచ్చాడు.

మోహిని రుసరుసలాడింది.

"కోపం రాదామరి? నేను రెండేళ్ళనుంచి అడుగుతుంటే ఆఫ్టరాల్ ఒక్క రవ్వల నెక్లెస్ చేయించలేకపోయారే!"

"వెధవది-చిన్న నగదగ్గర నువ్వింతగా అవ్వాయ్ చువ్వాయ్‌లాగా ఆకాశానికి అంటుకుపోవడం ఏం బాలేదోయ్"

"అనండి అనండి... నేను ఏదన్నా మీకు అలాగే అనిపిస్తుంది. నామీద మీకు అసలు మోజు తగ్గిపోతోంది. ఇదే మీఆవిడ అడిగితే ఇన్నాళ్ళు తాత్సారంచేస్తారా?" ఆమె గొంతు జీరబోయింది. పైటచెంగుతో కళ్ళు వత్తుకుంటూ ఓ పక్కకి వెళ్ళి నిలబడింది.

గవర్రాజు మూడ్ పాడైపోయింది. ఇవ్వాళ ఈ మోహిని అంతతేలిగ్గా వదిలేట్టు లేదనుకున్నాడు. ఎలాగైనా ఆమెని దారికి తీసుకురావాలి! మెల్లగా ఆమెని సమీపించాడు.

మోహిని మెడచుట్టూ చెయ్యేసి తనవైపు తిప్పుకోబోయాడు. ఆమె విదిలించికొట్టింది.

"నువ్వు అడిగినట్టు రవ్వల నెక్లెస్ కొనివ్వాలనే అనుకుంటున్నాను డాళింగ్... నీకోరిక తీర్చాలని నాకుమాత్రం ఉండదా? కాకపోతే సమయంకోసం చూస్తున్నానంతే"

మోహిని విసురుగా గవర్రాజువైపు తిరిగింది. అతని కళ్ళల్లోకి చురుగ్గా చూసింది. ఆమె కళ్ళు రక్తవర్ణంలో ఉన్నాయి.

"హుఁ... సమయం. రెండేళ్ళనుంచీ వస్తూనేఉంది ఆ పాడు సమయం". మాటల్లోని వెటకారం చూపుల్లో కూడా ప్రతిఫలిస్తోంది.

"మొదట్లో అడిగినప్పుడు ఏమన్నారు? పార్టీ టిక్కెట్‌రానీ చూద్దాం అన్నారు... ఔనా? టిక్కెట్ వచ్చాక అడిగితే... గెలవనీ అన్నారు. తీరా గెలిచాక గుర్తుచేస్తే మంత్రినయ్యాక తప్పకుండా కొనిపెడతానన్నారు. మంత్రి అయ్యారు. నాకు గొలుసే రాలేదు. ఇంకెప్పుడు మీరు చేయించేది? ఈలోగా ఆ పదవి కాస్తా ఊడిపోతే?"

మోహిని గొలుసు కోసం ఇవ్వాళ ఇంతగా ఎందుకు పట్టుబడుతున్నదో గవర్రాజుకి అర్థమైంది.

"పిచ్చిదానా... నీకలాంటి భయమేవద్దు. ఏనా ఓసారి చేతికి చిక్కిన పదవిని అంతతేలిగ్గా చేజార్చుకునే వాజమ్మలాగా కనిపిస్తున్నానా నేను? నా గురించి ఇంతేనన్నమాట నీకు తెల్సింది? కాకపోతే నీ నెక్లెస్ విషయంలో కాస్త ఆలస్యంజరిగిన మాట వాస్తవమే. అంతమాత్రాన అది నాచెయ్యి దాటిపోయిందనుకోకు".

మోహిని కాస్త మెత్తబడింది. ఆ సంగతి ఆమె చూపులే చెబుతున్నాయి.

గవర్రాజు క్షణం కూడా ఆలస్యం చేయలేదు. ఆమె నడుం చుట్టేశాడు.

"ఓసి పిచ్చిమొద్దా... నన్నంత తేలిగ్గా అంచనా వేయకు. లక్షలాది జనం కలిసి నన్ను నాయకుణ్ణి చేశారు. ఆ సంగతి నువ్వు మరిచిపోతున్నావు".

తన నెక్లెస్‌కి, జనానికి ఎందుకు లంకె పెడుతున్నాడో మోహినికి ఓపట్టాన అర్థంకాలేదు.

"ప్రజా నాయకుణ్ణి ప్రజలే బతికించుకుంటారు. మన అవసరాలనన్నింటిని వాళ్ళే తీరుస్తారు. ప్రజలే మన ఆస్తి"

"అంతే?" గవర్రాజు ఉద్దేశం అంతుపట్టక, అర్థోక్తిలో ఆగిపోయిందామె.

"మన జేబులో చిల్లిగవ్వకూడా బైటికి తియ్యకూడదు. దానికిబదులు సమయం చూసి పదవిని వాడుకోవాలన్నది పొలిటికల్ ఫిలాసఫీ. మన కాసుల నిలవ తరగకూడదు. అలాగని కోరికా మిగలకూడదు"

"ఇదెలా కుదురుతుంది?"

"అక్కడే వుంది అసలు రహస్యం. గొప్పవాళ్ళుగా చెలామణీ అవుతున్న వాళ్ళందంతా ఇదే పాలసీ. మొదట్లో జనంకోసమే బతుకుతున్నామంటారు. అలాగే నమ్మిస్తారు. ఆ తర్వాత జనం మీద బతికేస్తారు"

"మనకి అంత ఖర్మేం వచ్చింది?"

"ఖర్మకాదు... అది మనహక్కు. మన వెనక జనం వున్నారు. జనం దగ్గర ధనం వుంది. ప్రజలంతా నా వాళ్ళు అనుకున్నట్టే ప్రజల ఆస్తి అంతా మనదేనని అనుకోవడం ప్రాథమిక రాజకీయ లక్షణం. జనం దగ్గర డబ్బు వుందికదా అని సూటిగా అడిగితే ఎవ్వడూ ఇవ్వడు. దానికెంతో నేర్పు, ఓర్పు రావాలి. నీ దగ్గర ఆ మాత్రం ఓర్పు వుంచేవాలు. దానికి నా నేర్పుని జతవేసి పదిహేనురోజులు తిరిగేసరికి నీ మెళ్ళో రవ్వలనెక్లెస్ దించుతా- సరేనా"

మోహిని మొహం వెయ్యి వోల్టుల బల్బు మాదిరిగా వెలిగిపోయింది. కోరిక తీరబోతోందన్న సంతోషం నిలువెల్లా తచ్చిబ్బు చేస్తోంది. ఆమె మనసు ఓ పదిహేను రోజులు ముందుకెళ్లింది....

తన మెళ్ళో ధగధగలాడే నెక్లెస్... అది తన స్టేటస్‌కి చిహ్నం. గవర్రాజుతో తనకు వున్న సాన్నిహిత్యానికి నిదర్శనం....

పట్టలేని ఆనందంతో మోహిని రివ్వున వెళ్ళి గవర్రాజుని చుట్టేసింది. ముద్దులతో ముంచెత్తింది. గవర్రాజు నడుం ఆమె చేతుల్లో వుంది. అతని మనసు అదుపుతప్పింది.... వళ్ళు వశం తప్పింది. అబగా ఆమెని కౌగలించుకున్నాడు. గదంతా బెడ్‌లైట్ బ్లూ కాంతిలో మసకబారింది.

★ ★ ★

అర్ధరాత్రి దాటింది. నగరమంతా నిద్రలో జోగుతోంది. గవర్రాజు మాత్రం ఒక్కడే తన గదిలో పచార్లు చేస్తున్నాడు.

అతనికి ఓ పట్టాన నిద్రరావడంలేదు. అతని మనస్సుమనస్సులో లేదు. ఉండిఉండి వదులుతున్న సిగార్‌పొగ గదిలో రింగులు రింగులు తిరిగి మాయమవుతోంది.

ఎంతకీ తెగని ఆలోచనలు అతన్ని నిద్రపో నివ్వడంలేదు.

అతని కళ్ళముందు దినమొక క్షణంలా ఇట్టే గడిచిపోతోంది. తను చూస్తుండగానే ఐదు రోజులు దొర్లిపోయాయి. ఇంకా పట్టుమని పది రోజులే వ్యవధి. అందుకే అతనిలో ఈ ఆత్రం.

గవర్రాజుని ఇంతవరకు ఏ సమస్యా ఇంతగా పట్టిపీడించలేదు. ఆలోచనలతో మెదడు మొద్దుబారిపోయింది. ఓ పెగ్ విస్కీ గ్లాసులోకి వంచుకుని అప్పుడప్పుడు సిప్‌చే స్తూ పచార్లు చేస్తున్నాడు. విస్కీ సీసా ఖాళీ అవుతోంది. మందు ఎక్కువవుతున్నకొద్దీ ఆలో చనల వేగం పెరుగుతోంది.

అతని మనోఫలకం మీద ఎన్నెన్నో రూపాలు తిరుగాడుతున్నాయి.

వ్యక్తిగత బలహీనతలున్న బ్యూరోక్రాట్లు... ప్రజాధనాన్ని దోచుకోవడమే లక్ష్యంగా పెట్టుకు న్న కాంట్రాక్టర్లు... ఆధిక్యత కోసం పాకులాడే బడా పారిశ్రామిక వేత్తలు...

వీళ్ళల్లో ఎవరన్నా ఈ ఆపత్కాలంలో తనని ఆదుకోగలరేమో! తను నోరు తెరిచి అడగాలే గాని కొండమీద కోతైనాదిగొస్తుంది.

కాని ఈసారి అతని మనసెందుకో ఎదురు తిరుగుతోంది.

ఎవ్వర్నీ పైసా అడక్కుండా సొంతడబ్బుల్లో పైసా కూడా ఖర్చుచేయకుండా రవ్వలనెక్లెస్ సాధించాలన్నది అతని పట్టుదల. లేకపోతే ఇంతగా మానసిక ఒత్తిడికి గురికావాల్సిన పనిలేదు.

రవ్వలనెక్లెస్ ఎలా సాధించాలన్న విషయం ఇప్పటికీ అగమ్యగోచరంగానే వున్నా అతనిలో పట్టుదల మాత్రం సడలలేదు. ఎలాగైనాసరే సాధించి తీరగలననే నమ్మకమే ఇందుక్కా రణం.

ఏ మాటకామాటే చెప్పుకోవాలి. గవర్రాజు కార్యదక్షుడని రాజకీయవర్గాల్లో పేరుంది. మంచో చెడో ఒకసారి నిర్ణయం తీసుకుంటే ఇక వెనకా ముందు చూడడు. పని అయ్యేంతవ రకు కంటికి కునుకు సైతం రానివ్వడు. అందుకే అతని సన్నిహితులు కొందరు మొండిమనిషి అంటారు. ఆ మొండిపట్టుద లతోనే రాజకీయవైకుంఠపాళిలో అంచెలంచె లుగా ఎదిగి ఇవ్వాళ ఈ స్థితికి రాగలిగానని అతని నమ్మకం.

విస్కీ సీసాలో ఆఖరిబొట్టు గవర్రాజు ఆలోచ నలకి వూపిరిపోసింది. ఓ అయిదు నిముషా లు ఆలోచించాడు. అతని పెదవుల మీద చిరుదరహాసం తొణికిసలాడింది.

'బెస్ట్ ఐడియా' అనుకున్నాడు మనసులో.

అన్నికోణాల్లో నుంచీ దాని మంచిచెడులు, లాభనష్టాలు బేరీజువేశాడు. అన్నివిధాలా ఆ పథకమే శ్రేయస్కరమని చివరికి తీర్మానించు కున్నాడు. 'దటీజ్ గవర్రాజు....' అతనిలోని మరో గవర్రాజు మెచ్చుకున్నాడు. లైటు తీసేసి తృప్తిగా మంచమెక్కాడు.

★ ★ ★

ఆ మర్నాడు-

భరత్ టేబుల్‌మీద ఇంటర్‌కం ఫోన్ మోగింది. భరత్ రిసీవర్ ఎత్తాడు. గవర్రాజు నుంచి పిలుపు. భరత్ ఆయన పర్సనల్ సెక్రటరీ.

గదిలో గవర్రాజు తాపీగా కూర్చొనివున్నాడు. భరత్ వెళ్ళగానే "చూడండి... సాయంత్రం అర్జంటుగా విలేకరుల సమావేశం ఏర్పాటు చేయండి" హుకుంజారీచేశాడు.

"యస్ సర్" భరత్ తలవూపాడు.

"రేపు రాత్రికి బయల్దేరి వూరెళుతున్నాను. ఆ ఏర్పాట్లు చూడండి. నా జిల్లాలో నా వాళ్ళ ందరికీ ఈ వేళే ఫోన్‌చేసి ఈ సంగతి చె ప్పండి. ఓ వారంపాటు జిల్లాలో విస్తృతంగా పర్యటించాలి. బహిరంగసభలకు సన్నాహాలు చేయమని చెప్పండి"

గవర్రాజు చెబుతున్నదంతా శ్రద్ధగా వింటు న్నాడు భరత్.

"ఈవారం నా అప్పాయింట్‌మెంట్స్ అన్నీ కాన్సిల్ చేయండి. ఆ లిస్టులో వి.ఐ.పి.లు

ఏమన్నా వుంటె వాళ్ళకి ఫోన్ చేసి విషయం చెప్పండి. అర్జంట్ అనుకున్నవాళ్ళని రేపు మధ్యాహ్నంలోగా నన్ను కలవమని చెప్పండి''

గవర్రాజు చెప్పిన దానికి తలూపి భరత్ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రమే విలేకరుల సమావేశంలో గవర్రాజు ఓ ఇరవై నిముషాల ఉపన్యాసం ఇచ్చాడు.

''ప్రజాస్వామ్యంలో ప్రభుత్వానికీ, ప్రజలకీ మధ్యవారధిలాంటిది మన సమాచార వ్యవస్థ. అందులో ప్రత్యేకించి పత్రికలకి విశిష్ట స్థానం వుంది. ప్రజల మనోగతం పాలకులకు, పాలకుల సేవానిరతి ప్రజలకు తెలియజెప్పే గురుతరబాధ్యత మీమీద వుంది గనకనే నేనివ్వాళ మిమ్మల్ని ఇక్కడికి పిలిపించాను

''నేను మొదటినుంచి ప్రజాసేవకే అంకితమైన వాణ్ణని మీకు తెలును.. ప్రజాసేవే నా సర్వస్వం అనుకోబట్టే నేను మానసికంగా నా కుటుంబానికి దూరమయ్యానేమోనని పిస్తుంది. ఇంటి విషయాలు పట్టించుకోనని నా భార్య నాతో మాట్లాడదు. నా ఒక్కగానొక్క కొడుకు నా మీద స్ట్రయిక్ చేస్తున్నాడు. అయినా ప్రజాసేవ ముందు ఇవేవీ నాకు జటిల సమస్యలుగానూ, జీవిత లక్ష్యాలుగానూ అనిపించడంలేదు. అందుకే ఎలాంటి అడ్డంకులు ఎదురైనా నా అభిమతాన్ని బట్టి ప్రజాసేవే పరమావధిగా నడుచుకుంటూ వస్తున్నాను. ఆ విశిష్ట లక్షణమే నన్నింతవాణ్ణి చేసిందని చెప్పుకోవడం ఆనోటా ఆనోటా నాదాకారాకపోలేదు''

విలేకరులు శ్రద్ధగా రాసుకుంటున్నారు. ఇంతవరకు చెప్పినదానిలో ఏ పాయింట్‌ని హైలైట్ చేయాలా అన్న ఆలోచనలో పడ్డారు ఎవరికివాళ్ళు.

గవర్రాజు ఓ క్షణం గాలి పీల్చుకుని మళ్ళీ అందుకున్నాడు-

''రాత్రి నాకు ఓ కల వచ్చింది. అశరీరవాణి నాకు కర్తవ్యబోధ చేసింది. ప్రజల కంటె మరెవరూ నాకు ఎక్కువ కాదని చెప్పింది. వారే నా ... , వారే నా స్ఫూర్తి అని సెలవిచ్చింది. ... కడగండ్లకు కారణాలువెదికి, వారి జీవనగమ్యానికి బాట వేయమని పిలుపునిచ్చింది. అశరీరవాణి ఆజ్ఞని శిరసావహించదలిచాను. ప్రజలకోసమే జీవితం అంకితం చేసిన వాణ్ణి... ప్రజల కోసమే ఈ రక్తమాంసాల్ని ఫణంగా పెట్టినవాణ్ణి...''

క్షణం పాటు విరామమిచ్చాడు. విలేకరులు తనని ఫాలో కాగలుగుతున్నారని నిర్ధారణ అయ్యాక ఉపన్యాసం కొనసాగించాడు.

''అశరీరవాణి నా వెన్ను తట్టిన మరుక్షణమే నాలోని 'సేవకుడు' నిదురలేచాడు. నా ప్రజల్ని కళ్ళారా ఒక్కసారి చూడాలనిపించింది. రాత్రంతా నిద్రేపట్టలేదు. రేపటి నుంచి వారంరోజులపాటు నా జిల్లాలో పర్యటించాలని రాత్రే నిర్ణయించుకున్నాను'' విలేకర్లకి ఇప్పుడు ప్రాణం లేచివచ్చినట్లయింది. వార్తకి లీడ్ పాయింట్ దొరికిందన్న తృప్తి వాళ్ళ ముఖాల్లో కనిపించింది. గవర్రాజు దీన్ని పసిగట్టకపోలేదు. అందుకే ఓ నిముషం ఆగాడు.

''ఇంకా మీ పర్యటన విశేషాలు తెలియజేస్తారా?'' ఆత్రం అణచుకోలేని ఓ విలేకరి అడిగాడు.

గవర్రాజు ముఖంలో నవ్వు చిందింది.

''ఆగండి మిత్రమా... అంతా చెబుతాను. మీకు కాకపోతే నేను ఇంకెవ్వరికి చెప్పుకుంటాను?'' కనుబొమలు ఎగరేస్తూ చిద్విలాసంగా నవ్వేశాడు.

విలేకరులు కూడా ఆ నవ్వుతో జత కలిశారు. ఇంతలో రెండో వరస కాఫీలు వచ్చాయి.

కాఫీలు సేవించడం పూర్తయ్యాక గవర్రాజు ప్రసంగాన్ని కొనసాగించాడు.

''ప్రజాసమస్యల పరిష్కారం నిమిత్తం వారంరోజులు పర్యటించబోతున్నట్లు రాస్తారు కదా? ఆ కార్యక్రమ వివరాలన్నీ నా పి.ఎస్. మీకు అందిస్తారు చివర్లో. ఇకపోతే మరో ముఖ్యమైన విషయం. నాయకులు ఓట్ల కోసం తప్పిస్తే జనం మొహం చూడరన్న అపోహ వుంది. ఆ సంగతి మీకూ తెల్సు. కొంతవరకు అది నిజమే అయినా అందర్నీ ఒకేగాడిన కట్టడం ఏం భావ్యం చెప్పండి. ఈ అపోహ నాకు వర్తించదని రుజువుచేయాలన్న ఉద్దేశంతో నేనొక సమగ్ర భవిష్యత్ ప్రణాళికను రూపొందించుకున్నాను''

విలేకరుల్లో ఆసక్తి పెరిగింది. లీడ్‌పాయింట్ మారబోతోందన్న ఆలోచనా వచ్చింది వారికి.

"సమాజంలోని అన్నివర్గాలను మేల్కొలిపి, వాళ్ళలో రాజకీయ చైతన్యం తెచ్చే ఉద్దేశంతో సుదీర్ఘ జనచైతన్యయాత్రకు శ్రీకారం చుట్టబోతున్నాను. ఇందులో భాగంగా ప్రతినెలా ఓ వారంపాటు ప్రజల్లోకి వెళతాను. వాళ్ళ కష్టాలు, కడగండ్లు తెలుసుకుంటాను. వీలైనంతవరకు అక్కడికక్కడే పరిష్కరించేందుకు ప్రయత్నిస్తాను. ఒక్కొక్క నెలలో ఒక్కోజిల్లా వెళతాను. నా సొంత జిల్లాలో రేపటి నుంచి జరపబోతున్న పర్యటన దీనికి నాంది"

గవర్రాజు చెప్పిన దాన్లో అక్షరమైనా పొల్లుపోకుండా విలేకరులు శ్రద్ధగా రాసుకున్నారు.

"పర్యటించే సమయంలో మీ శాఖకి సంబంధించిన సమస్యలే పరిష్కరిస్తారా లేక అన్నీనా?" ఓ సీనియర్ విలేకరి ప్రశ్నించాడు.

ఎదురు ప్రశ్నలు వెయ్యడంలో పత్రికలవాళ్ళనిమించిన వాళ్ళెవరూ వుండరనుకున్నాడు గవర్రాజు. వాస్తవానికి ఇది చాలా ఇరకాటపు ప్రశ్న. ఆ మాటకొస్తే విలేకర్లు అన్నీ ఇలాంటి ప్రశ్నలే అడుగుతుంటారని గవర్రాజు నిశ్చితాభిప్రాయం.

తన మంత్రిత్వశాఖకి సంబంధించిన సమస్యల్నే పట్టించుకుంటానని చెప్పాలా? అలాగైతే 'పక్షపాతి' అని రాస్తారు మర్నాటికల్లా.

సమస్యల పరిష్కారంలో తరతమ భేదాలు పాటించనని చెబితే? ఇతర మంత్రుల శాఖల్లో తలదూరుస్తున్నానని రాస్తారు. అది అంతటితో పోదు. దానికి చిలవలుపలవలు అల్లి స్కూప్‌ల పేరుతో లేనిపోని గొడవలు రేపిపెడతారు.

నిజానికి తన పర్యటన లక్ష్యంవేరు. దానికి ముసుగుగా ఈ పథకం ప్రకటించాడు. అంతే తప్ప ఈ జనచైతన్యయాత్ర ఏడాది పొడుగునా సాఫీగా సాగేదా పెట్టేదా?

విలేకర్ల ప్రశ్నల బారినుంచి ఎలా బైటపడదామా అని ఆలోచిస్తున్న తరుణంలో- "సార్... ఫోన్..." అంటూ భరత్ రావడంతో గవర్రాజుకి ప్రాణం లేచివచ్చినంతపనైంది. అంతలోనే హుషారొచ్చింది.

"సారీ ఫ్రెండ్స్... అర్జంట్ ఫోన్‌కాల్ అది. దానికోసం ఎప్పట్నుంచో ఎదురుచూస్తున్నాను" అంటూ భరత్‌వైపు తిరిగి

"భరత్... నా రేపటి పర్యటన వివరాలు వారికిచ్చి పంపండి" అని తలుపువైపు నడిచాడు.

గుమ్మం దాటబోతూ ఒక్కసారి వెనక్కితిరిగి-

"ఫ్రెండ్స్... ఈరోజుకిక చాలిద్దాం. పర్యటన నుంచి రాగానే మళ్లీ కలుద్దాం- ఓకే?" అంటూ గబగబా వెళ్లిపోయాడు.

మంత్రిగారి పర్యటన వివరాలను భరత్ అప్పటికే సైక్లోస్టెయిల్ తీసివుంచాడు. విలేకర్లందరికీ అవి పంచిపెట్టాడు. ఎడిషన్లకి వ్యవధి దగ్గర పడుతుండటంతో విలేకర్లు గబగబా బైటికి నడిచారు.

మర్నాటి దినపత్రికలన్నీ గవర్రాజు పర్యటనపై ప్రముఖంగా దృష్టి సారించాయి. చాలా పత్రికల్లో రెండు వార్తలు చోటుచేసుకున్నాయి.

పత్రికల్లో తెల్లవారి రాబోయే తన వార్తల తాలూకు శీర్షికల్ని ఎప్పటిమాదిరిగానే గవర్రాజు ముందుగా తెలుసుకోగలిగాడు. అతనికి పూర్తి సంతృప్తికలిగింది.

★ ★ ★

చీకటి అక్రమాలకు శ్రీకారం చుట్టేక్షణాలు దగ్గరపడుతున్నాయి. చల్లని ఈదురుగాలి అక్కడి వాతావరణాన్ని ఆహ్లాదపరుస్తోంది. అసలే ఆధునికతకు అద్దంపడుతున్న ఆ కాలనీలో శ్రీనిలయం మరింతగా కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. లోకంలోని డాబు, దర్పాలకి ప్రతీకను నేనే అన్నట్టు సగర్వంగా నిశ్చలంగా చూస్తున్నట్టుంటుంది. ఆ అందాల భవనంలోని ప్రతి వస్తువు, ప్రతి అంగుళం దాని యజమాని స్టేటస్‌ని ప్రతిఫలింపజేస్తుంటాయి.

ఆ యజమాని వీరభద్రం లాన్స్‌లో కూర్చుని పూలమొక్కల్ని తదేకంగా పరీక్షిస్తున్నాడు. అక్కడక్కడ అల్సేషియన్ కుక్కలు ఆడుకుంటున్నాయి. పరిసరాలన్నీ నిశ్శబ్దసంగీతాన్ని ఆలపిస్తున్నాయి.

గేటు దగ్గర కారాగిన శబ్దం రావడంతో వీరభద్రం అటువైపు చూశాడు. ఆ కారుకోసమే అతను ఎదురుచూస్తున్నాడేమో హుషారుగా

[illegible]
భరత్ అతని వెంటేవున్నాడు.

వీరభద్రం చిర్నవ్వుతో సాదరంగా ఆహ్వానించాడు. ఆ కాంపౌండ్‌లో గవర్రాజు అడుగు పెట్టడం ఇదే మొదటిసారి.

దాదాపు ఎకరం స్థలంలో వుందాభవనం. సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన ఆ వాతావరణాన్ని చూశాక వీరభద్రం కళాభిరుచిని మనస్సులోనే మెచ్చుకోకుండా వుండలేకపోయాడు గవర్రాజు.

ఆకాశపు అంచుల్ని తాకుతున్నట్లున్న భవనాన్ని గవర్రాజు ఓ క్షణంపాటు రెప్పవాల్చకుండా చూశాడు.

'వీరభద్రం ఇంత ఎత్తుకు ఎదిగాడన్న మాట' గవర్రాజు మనసులో ఆలోచనలు మొదలయ్యాయి.

భవనంచుట్టూ ఎటు చూసినా కనుచూపుమేరలో నేలంటూ అంగుళం కూడా కనిపించడంలేదు. పచ్చని లాన్స్‌లో నడుస్తుంటే సుతిమెత్తని తివాసీమీద అడుగేస్తున్నట్టుంది. కాంపౌండ్ అంతా రకరకాల పూలమొక్కలతో పెద్ద ఉద్యానవనంలా వుంది. పూలసుగంధాన్ని మోసుకువస్తున్న ప్రతి గాలితెమ్మెర గవర్రాజు నవనాడుల్ని గిలిగింతలుపెడుతోంది. ఓ క్షణం అతని మనస్సులో మోహిని మెదిలింది.

లాన్స్ మధ్యలో మామిడిపిందె ఆకారంలో స్విమ్మింగ్‌పూల్. భవనం చుట్టూవున్న ఎత్తయిన ప్రహరీ కోటబురుజుల్ని జ్ఞప్తికి తెస్తోంది.

జీవితాన్ని ఇలాంటి భవనంలోనే అనుభవించాలనిపించింది గవర్రాజుకి. అంతలోనే తన అంతస్తు గుర్తొచ్చింది. తాను ప్రజానాయకుడు. నలుగురి కళ్లల్లో పడేట్టు ఇంతటి విలాసవంతమైన జీవితాన్ని గడిపితే ప్రమాదాన్ని కొనితెచ్చుకున్నట్లే! ఎవరెన్ని కోట్లు సంపాదించుకున్నా సద్వినియోగం చేసే విషయంలో వీరభద్రం పరిస్థితివేరు. అతను ప్రజలకు జవాబుదారీ కాదు. అతని జీవనస్రవంతే వేరు.

ఇవన్నీ గుర్తొచ్చాక గవర్రాజు ఆలోచనలకి కళ్లెంపడింది. వీరభద్రం గురించి గవర్రాజు లోగడ చాలా విన్నాడు. కాని అతని తాహతుని కళ్లారాచూడటం ఇదే మొదటిసారి. అదీగాక వీరభద్రంతో నమ్మకమైన స్నేహం కుదిరిందీ ఈమధ్యనే. ఇందులో మోహిని కృషి కూడా వుంది.

వీరభద్రం మరి ఇంతగా 'బలిసిన'వాడని గవర్రాజు ఏమాత్రం వూహించలేదు. ఇప్పుడు అతని ఐశ్వర్యం చూశాక కన్నుకుడుతోంది.

గవర్రాజులోని ఆరోఇంద్రియం చురుగ్గా పనిచేయనారంభించింది. ఇద్దరూ పక్కపక్కనే నడుస్తున్నారు.

వీరభద్రమే ఎక్కువ మాట్లాడుతున్నాడు. గవర్రాజు మధ్య మధ్య 'ఊఁ...' కొడుతున్నాడంతే.

మనిషికీ మనిషికీ తేడాలున్నట్టే అంతస్తుల్లో కూడా తేడాలున్నాయి. అందుక్కారణం- కొందరిలో సుడివుంటే మరికొందరి జీవితాల్లో సుడిగుండాలు వుండటమే!

ధనార్జనతో అంతస్తు పెంచుకోవాలన్న తపన అందరికీ సహజం. అందుకోసం ఎన్నెన్నో ఆలోచనలు చేస్తారు. మరెన్నో పథకాలు వేస్తారు. దీక్షాదక్షతలు, శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు, నైపుణ్యం ఎన్నివున్నా డబ్బు ఎంతగా వెదజల్లినా కొందరు ఏమాత్రం రాణించలేకపోతారు. విధి వాళ్లతో వింతనాటకం ఆడుతుంది. కలిసిరావడంలేదని సరిపెట్టుకుంటారు- ఇది సుడిగుండం.

మరికొందరుంటారు. వాళ్లు తాకిందల్లా బంగారమై కూర్చుంటుంది. పిడికెడు శ్రమతో పట్టెడు ప్రతిఫలం పొందుతారు. ఏంచేసినా కలిసి వస్తున్నదని మురిసిపోతారు; 'సుడి' బాగుందనుకుంటారు.

వీరభద్రం జీవితమే తీసుకుంటే-

ఆదిలో అతనికెన్నో సుడిగుండాలు.

అతని జీవితం ఇప్పటికిలా మలుపు తిరుగుతుందని అతనేనాడూ వూహించివుండడు.

పదోతరగతి గట్టెక్కడం అతని తరంకాలేదు. దాంతో ఇంట్లోవాళ్లు అతన్ని ఒక పురుగుని చూసినట్టు చూశారు. అది భరించలేకపోయాడు. వెనకా ముందూ ఆలోచించకుండా ఇంటినుంచి బైటపడ్డాడు. అప్పుడు అతని జీవితం దరిలేని సముద్రం! చుక్కాని లేని నావ! చాలారోజులు వస్తులున్నాడు.

కాని అదే అతని జీవితాన్ని మలుపు

[illegible] ష్టంమీద పని దొరికింది. ఆ ఆసరాని ఏమాత్రం జారవిడుచుకోలేదతను. త్వరలోనే యజమానికి నమ్మినబంటు అయ్యాడు. వ్యాపారంలో మెళుకువలు తెలుసుకున్నాడు. యజమానికి సలహాదారుడిస్థాయికి ఎదిగాడు. వ్యాపారం అతనికి కొట్టిన పిండే అయింది. మార్కెట్‌లో టెండర్ విలువలు ఇట్టే తెలుసుకోగలిగేవాడు. దాంతో ప్రతి కాంట్రాక్టు టెండర్‌లో ఎంతరేటు వేయాలో ముందుగానే నిర్ణయించుకునే వీలుచిక్కేది. చేజారిపోతాయనుకున్న ఎన్నో కాంట్రాక్టుల్ని వీరభద్రం తన చాకచక్యంతో 'బాస్'కి తెప్పించిపెట్టాడు. అందుకు అనుసరించిన మార్గాలు ఎంతవరకు సబబు అంటే ఏమాత్రం కాదని అతనే చెబుతాడు. కాని, అవన్నీ ఆలోచిస్తూ కూర్చుంటే పనులు కావంటాడు.

ఈ సమాజమంతా కలుషితం కాకుండా వుండి, మనుషుల హృదయాలన్నీ నిష్కల్మషంగా వుండి అవినీతి,అన్యాయం,అక్రమాలు వీళ్లనిచూసి భయపడినప్పుడు, స్వర్ణయుగం, ధర్మం నాలుగుపాదాల నడుస్తున్నప్పుడు వాటన్నింటి గురించి ఆలోచించవచ్చునంటాడు. ఒకడూ అరా మడికట్టుకు కూర్చున్నంత మాత్రాన ఒరిగేదేమీ వుండదని వాదిస్తాడు. అతను నమ్మిన ఈ సిద్ధాంతమే అతనికి తిండి పెట్టింది. అతని జీవితానికి ఆధారం చూపింది.

వీరభద్రం తెలివితేటలు అతని యజమానిని కట్టిపడేశాయి. వీరభద్రం జీవితంలో 'సుడి' వుందని ఆయన నమ్మకం. అతను అడుగుపెట్టిన వేళావిశేషమే తాను ఇంతగా ఎదిగిపోవడానికి కారణమని ఆయన విశ్వాసం. కాలంగడిచేకొద్దీ ఈ నమ్మకం మరింత బలపడింది. వీరభద్రం తెలివితేటలే తన వ్యాపారానికి అసలైన పెట్టుబడి అన్న నగ్నసత్యం అనుభవరీత్యా గుర్తెరగడంతో యజమాని ఆశలు ఆకాశానికెగిరాయి. వీరభద్రం ఆసరాగా తన వ్యాపారాన్ని నాలుగింతలు పెంచుకోవాలన్న తపన బయలుదేరింది. వీరభద్రాన్ని ఎట్టిపరిస్థితుల్లోనూ దూరంచేసుకోకూడదు. అతని తెలివితేటలు మరొకరికి పెట్టుబడి కారాదు. అతనివల్ల మరొకరు బాగుపడకూడదు. వీరభద్రం ఎప్పటికీ తనవాడుగానే మిగిలిపోవాలి అనుకున్నాడు.

అది జరగాలంటే వీరభద్రాన్ని తనఅల్లుడిగా చేసుకోవాలి. ఆ విధంగా అతన్ని కట్టిపడేసుకోవాలి.

ఒకరోజు తనమనసులో మాటని వీరభద్రం ముందుపెట్టాడు. వీరభద్రం పెద్దగా ఆలోచించలేదు. పెళ్ళాం అందంగా వుండాలన్న పట్టింపులేదతనికి. అన్నిటికీ ఆమే ఉపయోగపడాలన్న నియమనిష్టలూలేవు. వీటన్నిటికితోడు అతనిలో కృతజ్ఞతాభావం చెదిరిపోలేదు. తన జీవితానికోదారి చూపించిన వ్యక్తిపట్ల అతనికి 'ప్రభుభక్తి' వుంది. అందుకే తనకు కాబోయే అర్ధాంగి అవిటితనం అతనికి అంతగా అభ్యంతరకరంగా తోచలేదు.

వీరభద్రాన్ని ఇల్లరికం వుంచుకోవాలని ఆమెతండ్రి ఆశించాడు. ఒక్కగానొక్క కూతురు లక్షల ఆస్తి. ఇదంతా ఆమె సొంతం. ముందుముందు సంపాదించేదికూడా తమదే. అలాంటప్పుడు ఇల్లరికాన్ని తిరస్కరించడానికి కారణమేదీ కనిపించలేదు.

వీరభద్రం ఓ ఇంటివాడయ్యాడు. ఓ ధనవంతురాలి జీవితభాగస్వామి అయ్యాడు. రెండు కాళ్ళూలేని ఓ స్త్రీకి భర్తయ్యాడు. ఏడాది తిరిగేసరికి మామగారి వ్యాపారం రెండింతలైంది. ఆ తర్వాత రెండేళ్లకి మామగారు చనిపోయారు. ఆ ఏడాదే వీరభద్రానికి కూతురు పుట్టింది. బాలింత జబ్బుతో భార్య కన్నుమూసింది.

గవర్రాజు, వీరభద్రం పావుగంటనుంచీ లాన్స్‌లో నడుస్తూనేవున్నారు. ఇంకా భవనం చుట్టిరావడం పూర్తి కాలేదు. గవర్రాజు అలసటగా వెనక్కి తిరిగి చూశాడు.

“చాలా దూరం నడిచాం” అన్నాడు యధాలాపంగా.

“ఇంకా ఇంతవుంటుంది” సిగరెట్ పొగవదులుతూ అన్నాడు వీరభద్రం. అందులో కాసింతగర్వంలేకపోలేదు. నడవాలంటే గవర్రాజుకి ఇబ్బందిగా వుంది. అతని అవస్థని వీరభద్రం గమనించాడు. దగ్గర్లోవున్న ఓ సిమెంట్ బెంచీమీద కూర్చున్నారిద్దరూ.

తన వ్యాపార లావాదేవీల గురించి వీరభద్రం చూచాయగా చెప్పుకొచ్చాడు. దేశంలోని




ప్రముఖ కాంట్రాక్టర్ల జాబితాలో తాను ఎన్నోవాడో చెప్పాడు. ఎక్కడెక్కడ ఏయేకాంట్రాక్టులు తన చేతులమీదుగా పూర్తయిందీ చెప్పాడు. అయితే దేనిలో ఎంతెంత మిగిలింది మాత్రం చెప్పలేదు. అదంతా గవర్రాజు తనే అంచనావేసుకున్నాడు.

అయిదు నిముషాలాగి ఇద్దరూలేచారు. మళ్ళా నడకసాగించారు. పావుగంట తర్వాత భవనం ముఖద్వారంచేరారు.

దారిపొడుగునా వీరభద్రం చెప్పిన ప్రతిదీ గవర్రాజు శ్రద్ధగావిన్నాడు. అక్షరం అక్షరం ఆకళింపుచేసుకున్నాడు. ఆచితూచి పూర్వాపరాలు ఆలోచించాడు. వీరభద్రం ఆస్తి విలువ ఎంతో తనదైన ఫక్కీలో లెక్కకట్టాడు. సందేహంలేదు. అతను కోట్లకి పడగలెత్తిన బలిష్టుడు. ఇతని దగ్గరమాత్రం స్టిఫ్‌గానే వుండాలని తీర్మానించుకున్నాడు.

మసకచీకట్లు కమ్ముతున్నాయి.

చుట్టుపక్కలంతా నియాన్ లైట్లవెలుగు చిప్పిల్లుతోంది. భవనంలో అడుగుపెట్టారిద్దరూ.

అదొక చిన్నసైజు స్వర్గంగా అనిపించింది గవర్రాజుకి. గదులన్నీ తిప్పిచూపిస్తున్నాడు వీరభద్రం. ప్రతిగదినీ ఎయిర్‌కండిషన్‌చేశారు. వాస్తవానికి అవి గదులు మాదిరిగాలేవు. ఒక్కోగదీ ఒక్కో విశాలమైన హాలు. గదిగదికీ ఖరీదైన కార్పెట్లు... కలర్ టీవీలు, ఫ్రిజ్‌లు, ఇవన్నీ సర్వసాధారణమన్నట్లుగా వుంది అక్కడివాతావరణం.

లోపలనుంచే పైఅంతస్థుకి మెట్లున్నాయి. అవి నేరుగా వీరభద్రం గదిలోకి తీసుకెళతాయి. ఇద్దరూ ఆదారిన పైకిచేరారు. భరత్ మాత్రం కిందనే ఆగిపోయాడు.

వీరభద్రం గది చాలా విశాలంగా వుంది. మధ్యభాగంలో పెద్ద టేబుల్ వుంది. చుట్టూ స్ప్రింగ్ చైర్స్ వున్నాయి. పక్కనే ఫ్రిజ్. ఇద్దరూ ఎదురెదురుగా చెరొక కుర్చీలో కూర్చున్నారు.

నిమిషాలు క్షణాలుగా దొర్లిపోయాయి. స్కాచ్‌విస్కీ సిప్‌చేస్తూ కబుర్లలోపడ్డారు. అరగంటలోనే ఎంతో సన్నిహితులుగా మారిపోయారు.

''మొన్నీమధ్య అమరేంద్రగారితో అపాయింట్‌మెంట్ దొరికింది. వెళ్ళి కలిశాను. మాటల్లో మీ ప్రస్తావన వచ్చింది. మీగురించి ఆయన ఎంతోసేపు చెప్పుకొచ్చారు'' వీరభద్రం బాణం వదిలాడు.

అమరేంద్ర పాలకపార్టీ అధ్యక్షుడు. ప్రభుత్వ అధినేత కూడా.

గవర్రాజులో ఆసక్తిపెరిగింది.

''ఏం చెప్పారేమిటి?'' పెదాలకు గ్లాస్ ఆనించుకుంటూ ముందుకివంగి అడిగాడు.

''మీమీద ఆయనకి మంచి ఇంప్రెషన్ వుంది. బాగా మెచ్చుకున్నారు''

గవర్రాజుకి ఈమాటలు ఎంతో తృప్తినిచ్చాయి. ఈమధ్యకాలంలో తనకీ, అమరేంద్రకీ మధ్య సంబంధాలు కొంత బెడిశాయి. తనమీద ఆయనకి సదభిప్రాయం లేనట్టు ఆనోటా ఆనోటావిన్నాడు. ఐతే తనని పొగిడినట్లు వీరభద్రంనోట ఇప్పుడే వింటున్నాడు.

''మీరు పెద్దపెద్ద సమస్యల్ని సైతం ఎంతో నేక్‌గా డీల్‌చేస్తారంట. ఆ స్టయిల్ అంటే ఆయనకెంతో లైకింగ్''

గవర్రాజు శ్రద్ధగా వింటున్నాడు. అతని మనస్సు ఆహ్లాదకరంగా కూడా వుంది.

''మీ హస్తంపడకపోతే ఉద్యోగులసమ్మె ఓ కొలిక్కి వచ్చేదికాదని అమరేంద్రగారన్నారు. స్పిన్నింగ్‌మిల్లు వ్యవహారం కూడా అంతేనట గదా!''

వీరభద్రం అప్పటికే ఓ క్వార్టర్ ఖాళీచేశాడు. గవర్రాజుముఖంలో విజయగర్వం తొణికిసలాడింది. గతం ఓసారి కళ్ళముందు మెదిలింది.

ఒకప్పుడు పార్టీ అధిష్టానవర్గంలో తనకి ఎంతో పట్టువుండేది. విస్తృతాధికారాలు చెలాయించేవాడు. మంత్రివర్గంలో తనమాటకే ఎక్కువ విలువవుండేది. కాని ఈ పరిస్థితి మూణ్ణాళ్ళముచ్చటే అయింది. తను తీసుకున్న నిర్ణయాలు కొన్ని బెడిసికొట్టాయి. తనకిది గట్టి ఎదురుదెబ్బ. పార్టీలోని ప్రత్యర్థివర్గానికి బాగా అవకాశం చిక్కింది. ముఖ్యంగా భూపాలరావు దెబ్బకొట్టాలని చూశాడు. తనమీద చిలవలుపలవలు అల్లి ప్రచారంచేశాడు. భూపాలరావు తన శక్తియుక్తులతో అధిష్టానవర్గాన్ని పునరాలోచనలలోపడేయగలిగాడు.

గవర్రాజుని ఇంకెంతమాత్రం ప్రభుత్వంలో కొనసాగనివ్వడం పార్టీకి, ప్రభుత్వానికి శ్రేయస్కరంకాదని పార్టీ అగ్రనాయకులు నిర్ణయించారు. గవర్రాజు అహం దెబ్బతింది.

సరిగ్గా అప్పుడే గవర్రాజులోని అసలు సిసలైన రాజకీయవేత్త జూలువిదులిపాడు.

తన రాజకీయ జీవితానికిది పరీక్షా సమయం. తన శక్తిసామర్థ్యాలకి ఇదొక సవాల్. సమకాలీన రాజకీయవైకుంఠపాళిలో ఇన్నేళ్ళూ వరుసగా నిచ్చెనలే ఎక్కుతూ వచ్చాడు కానీ ఇప్పుడు పామునోట చిక్కాడు. దానినుంచి బైటపడాలి. ఇది పరువుప్రతిష్ఠల సమస్య. ఇన్నాళ్ళూ తాను అనుభవించిన అధికారం అంధకారం కాబోతోంది. ఇది తాను భరించలేడు. పదవి తనకు ముఖ్యం. అదే తన ఆరో ప్రాణం. పెళ్ళాంపోయినా ఫర్వాలేదు. బతకచ్చు. కాని పదవిపోతే...? అమ్మో...ప్రాణమే పోతుంది. పదవిపోయిన మరుక్షణం తన పరిస్థితి ఎలావుంటుందో ఓ క్షణం ఆలోచించాడు. దానికంటే నరకమే మేలనిపించింది. అసలు ఆవూహే భయంకరంగా వుంది.

నిన్నమొన్నటిదాకా తన కళ్ళముందు పెరిగిన భూపాలరావుకి తలవంచడమా? అతను విసిరిన వలలో చిక్కుకుపోవడమా? కలలో కూడా అలా జరగకూడదు. ఆరునూరయినాసరే ఈ గండం నుంచి గట్టెక్కాలి. అందుకే క్షణం ఆలస్యంచేయకుండా కార్యరంగంలోకి దూకాడు.

గవర్రాజుకి ప్రజాస్వామ్యమంటే గొప్పనమ్మకం! అంతకుమించిన గురి ఇలాంటి ఆపత్కాలాల్లో తనని ప్రతిసారీ ఇదే రక్షిస్తూ వుంటుంది. అందుకే ఆ విశ్వాసం.

విస్తృతమైన వ్యవస్థని తమ అవసరాలకి, బలహీనతలకి ఆసరాగా వాడుకోవడం రాజకీయనాయకుల ప్రత్యేక లక్షణం. తమ పదవికి పతనం తప్పదని తెలిసినప్పుడు వ్యవస్థతో ప్రయోగాలు చేస్తారు. అందులో పావులు ప్రజలే.

గవర్రాజు అదేచేశాడు. ప్రభుత్వోద్యోగుల యూనియన్‌లలో ఒకటి అతనికి చాలా సన్నిహితం. ఆ యూనియన్ నాయకుల్ని పిలిపించి అర్ధరాత్రి మంతనాలు జరిపాడు. వారికి ఆశలు రేకెత్తించి ప్రభుత్వంమీదికి వుసిగొల్పాడు.

ప్రభుత్వం తమని నిర్లక్ష్యంచేస్తోందన్న అసంతృప్తి ఉద్యోగుల్లో ఎప్పట్నుంచో పేరుకుపోయివుంది. ఏడాదిక్రితం తమ డిమాండ్లకి ఆమోదం తెలిపినా ఇంతవరకు అవి ఆచరణలోకి రాలేదు. ప్రభుత్వంచేస్తున్న తాత్సారం ఉద్యోగుల ఓర్పుకి పరీక్షగా వుంది. గవర్రాజు ఇవన్నీ కదిలించాడు. ఉద్యోగుల డిమాండ్లని అమలుచేయాలన్న చిత్తశుద్ధి ప్రభుత్వానికిలేదని, అందుకే ఏడాదిగడిచినా అవి అతీగతీ లేకుండాపడివున్నాయని యూనియన్ నాయకులతో చెప్పాడు.

'మన నేతల దృష్టిలో ఉద్యోగులంటే పొట్టకూటికోసం రాత్రింబవళ్ళు చాకిరీచేసే నౌకర్లు. ఇది మీకు సిగ్గుగా లేదా? ఇన్నినెలలుగా ఎలా చేతులు ముడుచుకు కూర్చోగలిగారు?''

యూనియన్ నాయకుల అహంమీద దెబ్బ కొట్టాడు. ఖర్చులకోసమని వాళ్ళకి కొంత ముట్టజెప్పాడు.

మూడురోజుల్లో ప్రభుత్వానికి సమ్మెనోటీసు అందింది. ఇది ప్రభుత్వం వూహించని పరిణామం.

ఒకసంఘం సమ్మెకు దిగేసరికి రెండో సంఘం పునరాలోచనలోపడింది. గవర్రాజు వాళ్ళనీ దారిలోకి తెచ్చాడు.

సమ్మె జయప్రదంగా సాగుతోంది. ప్రభుత్వం ఈవిషయాన్ని చాలా తీవ్రంగా తీసుకుంది. ఇంత హఠాత్తుగా వీళ్ళు సమ్మెకి దిగడంలోని అంతర్యమేమిటో ఎంతప్రయత్నించినా ప్రభుత్వానికి అంతుచిక్కలేదు.

ఉద్యోగుల న్యాయమైనకోర్కెల్ని తక్షణం అమలుజరిపేందుకు ప్రభుత్వం సంసిద్ధత వ్యక్తంచేసింది. మిగతా గొంతెమ్మకోర్కెల్ని తీర్చేదిలేదని కరాఖండీగా చెప్పేసింది. తమకనీస కోర్కెల్ని గొంతెమ్మకోర్కెలు అన్నందుకు ఉద్యోగులు అపెండ్ అయ్యారు. వారిలో పౌరుషం పెరిగింది.

అంతవరకు శాంతియుతంగా సాగిన సమ్మె హింసాత్మకంగా మారింది. రోజులుగడచినకొద్దీ పాలకపార్టీకి ఈ సమ్మె తలనొప్పిలా తయారైంది. శాంతిభద్రతల పరిస్థితి క్షీణిస్తోంది.

దాంతో నాయకులంతా ఇతరసమస్యల్ని దాదాపు మరిచిపోయారు. గవర్రాజు పదవిలోనే వున్నా ఏదీ పట్టించుకోనట్లుంటున్నాడు.

ఉద్యోగుల నిరసన ప్రదర్శనలు...

మంత్రుల ఘెరావ్...

పోలీసులకు, ఉద్యోగులకు ఘర్షణలు...

లాఠీఛార్జీ... భాష్పవాయుప్రయోగం... పోలీసుకాల్పులు-- నిత్యం ఇవేవార్తలు. పోలీసుకాల్పుల్లో కొందరు మరణించడంతో సమస్య మరింత ఉగ్రరూపం దాల్చింది. అన్నివర్గాల్లో సంచలనం తలెత్తింది. ప్రభుత్వం పతనానికి పోతున్నదని సర్వత్రా నిరసన వ్యక్తమవుతోంది.

పాలకపార్టీ పరిస్థితి ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్టుంది.

ఈ పరిస్థితే గవర్రాజుకి కావాల్సింది. ఈ అదనుకోసమే అతను కాచుక్కూచుంది. మొదటరెండురోజులు పత్రికలద్వారా అన్నివర్గాలను ఆకర్షించాడు. రాయబారం పేరుతో రంగంలోకి దిగాడు. చొరవతీసుకుని స్వచ్ఛందంగా ఉభయపక్షాలతో చర్చలకు పూనుకున్నాడు. ఉద్యోగనాయకులు తనవాళ్ళేఅయినప్పుడు... ఈ సంక్షోభమంతా తనసృష్టే అయినప్పుడు... యూనియన్ నాయకులు తను ఎటుకదిపితే అటుకదిలే పావులే అయినప్పుడు... సమ్మె అనేది ఏమంత సమస్యగనుక!

గవర్రాజు వ్యూహం గొప్పగా విజయవంతమైంది. రాత్రికిరాత్రే సమ్మె విరమిస్తున్నట్టు యూనియన్‌నాయకులు ప్రకటించారు. ప్రభుత్వానికి శిరోభారం తగ్గింది. సమస్యలు ఎంతవరకు పరిష్కారమయ్యాయన్న విషయం అటు ప్రభుత్వవర్గాల్లోనూ, ఇటు ఉద్యోగుల్లోనూ అంతుచిక్కని ప్రశ్నగానే మిగిలిపోయింది. గవర్రాజు పలుకుబడి మాత్రం పార్టీలోనూ, ప్రభుత్వంలోనూ మళ్ళీ పుంజుకుంది. అతనిపదవికి కొత్తవూపొచ్చింది. అప్పుడుగాని అతను తృప్తిగా నిద్రపోలేదు.

మరోసారి స్పిన్నింగ్‌మిల్లు వ్యవహారంలోనూ ఇలాంటిదే జరిపి తన తడాఖా ఏమిటో పార్టీకి రుచిచూపించాడు.

-ఇవన్నీ గవర్రాజు ఘనమైన చరిత్రకి గీటు

[illegible]

రాళ్ళు. అతని అఖండరాజకీయ మేధస్సుకి ఆనవాళ్ళు.

గతంలో తను సాధించిన విజయాలు ఒకటొకటే గుర్తుకువస్తుంటే గవర్రాజు ముఖంమీద ఆనందపుఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

గతాన్ని నెమరువేసుకుంటున్న గవర్రాజుని నిశితంగా పరికిస్తూ కూర్చున్నాడు వీరభద్రం. తనువదిలిన బాణాలు ఏమాత్రం పనిచేస్తున్నాయో గవర్రాజు ముఖకవళికలనుబట్టి అతను అంచనా వేస్తున్నాడు.

గంటలు దొర్లిపోతున్నాయి.

వీరభద్రం ఇవ్వాళపార్టీ పేరుతో తనని ఎందుకు పిలిచాడో గవర్రాజుకి తెల్సు. అవసరం వీరభద్రానిది. కాబట్టి అసలు విషయాన్ని అతనే ప్రస్తావించాలని గవర్రాజు ఎదురుచూస్తున్నాడు. గవర్రాజు కదిలిస్తే తనపని సుళువు అవుతుందని వీరభద్రం భావిస్తున్నాడు.

ప్రతిష్ఠాత్మకమైన ఓ భారీప్రాజెక్టు కాంట్రాక్టు కోసం వీరభద్రం ప్రయత్నిస్తున్నాడు. దాని అంచనావ్యయం నాలుగుకోట్లు రూపాయలు. అది పూర్తయ్యేనాటికి ఈ ఖర్చు ఎట్లాలేదన్నా ఒకటిన్నరరెట్లు పెరగక మానదు. కనీసం కోటి రూపాయలు మిగలడం ఖాయం. ఆపైన తెలివితేటల్నిబట్టి దండుకోవచ్చు. ఇప్పుడాఫైలు గవర్రాజు మంత్రిత్వశాఖవద్ద పెండింగ్‌లో వుంది. దానిమీద అతని సంతకంపడాలి.

గవర్రాజుకి బ్రహ్మాండమైన డిన్నర్ ఇవ్వాలని వీరభద్రం ఎప్పటినుంచో అనుకుంటున్నాడు. తీరా అవసరం దగ్గరపడింది. గతవారం తన మనోగతాన్ని బైటపెట్టాడు. అప్పాయింట్‌మెంట్ ఫిక్సయింది. నాలుగురోజుల్లో డిన్నర్ జరగాల్సింది. తీరా గవర్రాజు జిల్లా పర్యటనకి ముహూర్తంపెట్టుకోవడంతో డిన్నర్‌ప్రోగ్రాం రద్దయింది. ఆసంగతి గవర్రాజు సెక్రటరీ భరత్ వీరభద్రానికి ఫోన్‌చేసి చెప్పాడు. గవర్రాజు పూరెళ్ళేలోపే తన పని పూర్తి చేయించుకోవాలనివీరభద్రం ఆశ. అందుకే నానాతిప్పలు పడి ఈ పూట పార్టీకి గవర్రాజుని ఒప్పించాడు.

గవర్రాజు సంతకానికి ఎంత విలువ కట్టాలో వీరభద్రం ఆలోచిస్తూకూర్చున్నాడు.

గవర్రాజు అప్పుడప్పుడు చేతివాచీలో

క్షైంచూస్తున్నాడు.

ఇక ఆలస్యం చేయడంభావ్యం కాదనుకుని వీరభద్రమే మొదలెట్టాడు. కాంట్రాక్టు గురించి సూటిగా మూడుముక్కల్లో చెప్పాడు. అది తనకి దక్కాలి, వాటా ఎంతకావాలో చెప్పమన్నాడు.

ఇద్దరూ చాలా నిర్మొహమాటంగా మనసువిప్పి మాట్లాడుకున్నారు- వ్యాపారధోరణిలో! ముప్పావుగంట తర్వాత ఓ అంగీకారానికి రాగలిగారు. మొత్తంమీద అరడజను టెండర్లు వచ్చాయి. మిగతావాళ్ళనందర్నీ గవర్రాజు ఎలాగోలా తప్పించాలి. ఆ తలనెప్పులన్నీ తనేపడతాడు. కాంట్రాక్టు వీరభద్రానికి దక్కుతుంది. ఆతర్వాత దశలవారీగా సక్రమంగా నిధులు విడుదలచేయించే బాధ్యత కూడా గవర్రాజుదే. మూడుదశల్లో ప్రాజెక్టు పూర్తికావాలి. డబ్బుకూడా మూడుదశల్లో అందుతుంది. అందులో గవర్రాజుకి పదిశాతం ముట్టజెప్పాలి. నిధులు విడుదలైనప్పుడల్లా ఎప్పటికప్పుడు అతని వాటా అతనికి చేరాలి- ఇదీ ఒప్పందం!



ఉదయం ఎనిమిదిగంటలకల్లా ఠంచనుగా గవర్రాజు పడక గదిలో ఫోన్ మోగింది అలవాటు ప్రకారం! ఆ మోతతో గవర్రాజు నిద్రవదిలింది. బద్ధకంగా పక్కకి ఒత్తిగిల్లి రిసీవర్ అందుకున్నాడు.

"గుడ్‌మార్నింగ్ డియర్" అవతలి నుంచి మోహిని గొంతు. ఆ తీయని గొంతుతో గవర్రాజు నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది. రాత్రి తీసుకున్న స్కాచ్‌విస్కీ గుర్తొచ్చిందతనికి. అలా గుర్తురావడం మద్యపానప్రియుల ఆరోగ్యానికి నిదర్శనమని గవర్రాజే అంటుంటాడు.

"వాట్ డియర్... ఉలుకూపలుకూలేదు. ఇంకామత్తు దిగలేదా?"

మోహిని తనముందే నిలబడి మాట్లాడుతున్నట్టుంది గవర్రాజుకి. అతను నవ్వుగా నవ్వాడు.

"నీ కమ్మని పిలుపుతో ఒక మత్తు దిగిపోయి ఇంకో మత్తు మొదలైంది డియర్".

"ఏయ్... అప్పుడే మొదలైందా?" గుసగుసలాడిందామె.

"ఏం చెయ్యను చెప్పు. నీ గొంతు వినిపిస్తే నాలో నవనాడులు..."

"ఉష్... ఎప్పుడూ అదే ధ్యాసా? ఇలాగైతే భుక్తి ఎలాదొరుకుతుంది? బుద్ధిగా పనులు చేసుకోండి. నామీద కురిపించే ప్రేమలో కనీసం నాలుగోవంతయినా జనంమీద చూపించండి. వాళ్ళేకదా మనకి కూడూగుడ్డా అన్నీను".

"ఓసోస్... నా పాఠాలు వంటబడుతున్నాయన్నమాట!"

"ఆఁ... మరే పాపం. మీరు చెబితేగానీ అర్థం చేసుకోలేనంత బుజ్జిపాపాయినికదూ!" మోహిని గలగలనవ్వింది.

"నీసంగతి అలావుంచు. ప్రజలు మాత్రం నాకెప్పుడూ బుజ్జి పాపాయిల్లాగానే కనిపిస్తారోయ్".

"కాబట్టేవాళ్ళని అప్పుడప్పుడు లాలిస్తూ, బుజ్జగిస్తూ ఉండాలని చెబుతున్నానండీ బాబూ!" రహస్యం చెబుతున్నట్లుగా అంది మోహిని.

"ఆ సంగతి నువ్వు నాకు వేరే చెప్పాలా? జనం నాడి తెల్సినవాణ్ణి. జనం 'వాణి' కనిపెట్టి 'బాణీ' మార్చుకోగలిగినవాణ్ణి. ఆ సంగతి నీకు తెలియనిదేంకాదుగదా".

"అవుననుకోండి... కాని ఆప్తులకు అంతరంగిక సలహాలివ్వకుండా ఊరుకోలేంగదా!"

"ఆల్‌రైట్. నీసలహాలెప్పుడూ నాకు శిరోధార్యాలేనోయ్... ఆఁ ఇంతకీ ఇప్పుడేం చేస్తున్నావ్?"

అవతలివైపు మౌనం.



"హలోడియర్... ఏమిటి మాట్లాడవు?"

"ఆఁ.. చెప్పండి"

"ఇప్పుడేం చేస్తున్నావేయ్" అని అడిగాడు.

"చెప్పను" ఉడికించింది మోహిని.

"చెప్పు డియర్".

"ఏం... అంత అవసరమా?"

"కాదామరి? నాక్కావాల్సినదానివి. నా ఆప్తురాలివి. నువ్వు ఎప్పుడు ఏం చేస్తుంటావో.. నీకదలికలన్నీ నా మనోగతంలో క్లోజ్‌టచ్‌లో ఉండాలని నేను కోరుకుంటాను"

"అలాగా... నేనంత తేలిగ్గా చెబుతానేమిటి?"

"మరైతే ఎలా చెబుతావో అదన్నా చెప్పు"

"నేను చెప్పను. మీరేకనుక్కోవాలి".

"నేనా... నీతో మాట్లాడుతుంటే నా బుర్ర ఆ మాత్రం కూడా పనిచేయదని నీకుతెలీదా? ఉడికించక చెప్పు డాళింగ్".

"నే చెప్పను బాబూ... సిగ్గేస్తోంది" ఆమె కిలకిలానవ్వింది.

"ఆఁ.. తెల్సింది. ఇప్పుడు తెల్సిపోయింది" గవర్రాజు గొంతులో ఎక్కడలేని హుషారు వచ్చింది.

"ఏంతెల్సింది?"

"చెప్పనా?"

"ఊఁ... చెప్పండి చుద్దాం"

"పోనీ నన్ను రమ్మంటావేమిటి?"

"నేనిప్పుడు ఫోన్ చేసింది అందుక్కాదు"

"మరి?"

"ఇవ్వాళ పేపర్లో వార్త చూశాను. ఏమిటి ఇంత హఠాత్తుగా ఊరిప్రయాణం పెట్టుకున్నారు?"

"అవును... హఠాత్తుగానే పెట్టుకున్నాను. తప్పనిసరైంది."

"మీరు కొన్ని విషయాలు నాకు చెప్పకుండా దాస్తున్నారనడానికి ఇంతకంటె ఇంకేం కావాలి?" నిష్ఠూరం ఆడింది.

"లేదు డియర్. అపార్థం చేసుకోకు. అదంతా క్షణాల్లో జరిగిన నిర్ణయాలు. అసలా మాటకొస్తే ఆ ప్రయాణం నీకోసమే తెల్సా?"

"— చెప్పండి చెప్పండి"

"—అబద్ధం అనుకుంటున్నావా? మరో వారంలో నీకే తెలుస్తుందిగా"

"—ఏం తెలుస్తుంది. మీరు తిరిగొచ్చేసరికి నాకిచ్చిన గడువు తీరిపోతుంది. చూశావుగదా ఊళ్ళో లేకనే నీమెళ్ళో గొలుసుదిగెయ్యలేకపోయానని నన్ను మాయబుచ్చుతారు- అంతేగా".

"ఓసి పిచ్చిమొద్దూ... నీకు అసలు సంగతి తెలీదు. నేను వారంపాటు పర్యటన పెట్టుకున్నది నీ గొలుసుకోసమే".

"పర్యటనకి వెళితే గొలుసు వస్తుందా?"

"చూడు... చూసింతర్వాత మాట్లాడు".

కొద్దిసేపు ఇద్దరి మధ్యామౌనం.

గవర్రాజే అందుకున్నాడు- "ఇవ్వాళ మధ్యాహ్నామే బయల్దేరివెళుతున్నా"

"వెళ్ళేలోగా ఓసారి నాదగ్గరికి వచ్చిపోకూడదూ?"

"అమ్మో... పట్టపగలే? అయినా టైం లేదు"

"ఏం... పగలైతే ఏమవుతుంది?"

"చూడు డియర్... ప్రజా జీవనస్రవంతితో పెనవేసుకుపోయిన ప్రజా నాయకులకి ఒక టైమ్‌టేబిల్ అంటూ ఉంటుంది. దాన్ని తు.చ. తప్పకుండా పాటించకపోతే కష్టాలుతప్పవు. ఆ టైం టేబిల్ ప్రకారం పట్టపగలుచేయాల్సిన పనులు కొన్నుంటాయి. రాత్రిళ్ళు చేయాల్సినవి వేరే ఉంటాయి. అంతదాకా ఎందుకు? ప్రజాసేవంటూ చేస్తే పగటిపూటే చేయాలనేది నాకు అనుభవం నేర్పిన పాఠం. రాత్రిళ్ళు కూడా చేస్తున్నాం అనుకో- లేనిపోనిది అంటగడతారు. స్వార్థం కోసం చేస్తున్నామనో, చీకటి పరదామాటున అవినీతికి పాల్పడుతున్నామనో దుమారం లేవదీస్తారు. అందుకే చీకటి పడ్డాక ప్రజలగురించి పట్టించుకోవడం మానేశా నేను"

"బాగుంది. చీకటిపడితే ప్రజల్ని పట్టించుకోరు. తెల్లవారితే నాజోలికి రారు"

"అవునేయ్ నాటైంటేబిల్ ప్రకారం పొద్దుపోయిన తర్వాత మాత్రమే చేయాల్సిన పనులు కొన్నిఉన్నాయి. వాటిల్లో ఒకటి- ఇదుగో మని




# ఆ నొప్పికి స్ట్రాంగ్ చికిత్స అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికి అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిశ్రితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

## అమృతాంజన్ స్ట్రాంగ్




మిక్కిలి బాధాకరమైన నొప్పులకు

అమృతాంజన్ లిమిటెడ్ 

OBM 831 TG

ద్దరం ముఖాముఖీ కలవడం. మన సంబంధం రహస్యంగా ఉండటం చాలా అవసరంగదా''

''రహస్యంగా బతకాల్సిన అవసరం మనకేమిటండీ?''

''అక్కడే ఉంది పాయింటు. మన సంబంధం రహస్యంగా లేదనుకో, అప్పుడది అక్రమ సంబంధమవుతుంది పత్రికల్లో''

మోహిని పెద్దగా నవ్వింది.

''నీకు నవ్వులాటగా ఉందన్నమాట?''

''లేకపోతే ఏమిటండీ? మన స్నేహానికి కళంకం ఎవరు అంటగడతారని?''

''నీకు తెలీదు మోహినీ... రాజకీయనాయకుని జీవితం కత్తులబోను వంటిది. వరుసతప్పించివేసే ఒక్క తప్పటడుగు చాలు- విచ్చు కత్తులు గుచ్చుకోవడానికి. నేనేమీ అజాత శత్రువుని కాదు. నిత్యం నాచుట్టూ వేలాది కళ్ళు పహరాకాస్తుంటాయి. వ్యక్తిగతంగా నేనంతేపదని వాళ్ళు రాజకీయంగా నాకు గోతులు తవ్వేందుకు ప్రయత్నిస్తుంటారు. నా అభివృద్ధిని చూసి ఓర్వలేని నాపార్టీ మనుషులే నాకాళ్ళ కింద మందుపాతరలు పేల్చవచ్చు. మా వ్యక్తిగత జీవితాలకి ప్రజలు ఎంతో ప్రాధాన్యమిస్తారు. అందులో ఏ కొంచెం అపశృతి వినిపించినా ప్రత్యర్థులు తమ అవసరానికి వాడుకుంటారు. మనల్ని పాతాళానికి తొక్కేస్తారు''

గవర్రాజు సీరియస్‌గా చెప్పుకుపోయాడు. మోహిని మౌనంగా వినడం మినహా మరే వ్యాఖ్యా చేయలేదు.

ఓ నిముషం తర్వాత అన్నది- ''సరే... మీ ఇష్టం- ఊర్నించి రాగానే కలుస్తారుగా?''

''ఓ తప్పకుండా''

''రోజా ఫోన్ చేస్తుండండి''

''అలాగే. నీకేదన్నా అవసరమైతే నాకు వెంటనే ఫోన్ చేస్తుండు''

''ఊఁ...''

''ఉండనామరి?''

''మంచిది. క్షేమంగా వెళ్ళి లాభంగా రండి''.

''థాంక్యూ''

''అన్నట్టు ఓ విషయం... ఈ వారం రోజులూ మీ బస ఎక్కడా?''

''ఇంట్లో మాత్రంకాదు- సరేనా?''

''ఓకే. అదే నాకూ కావాల్సింది. థాంక్యూ'' సంతోషంతో మోహిని ఫోన్ డిస్‌కనెక్ట్ చేసింది.

★ ★ ★

విమానాశ్రయంలో కోలాహలంగా ఉంది. అధికార పార్టీ సభ్యులు, జిల్లా స్థాయినాయకులు, కార్యకర్తలు వందల సంఖ్యలో గుమికూడారు. రన్‌వేమీద విమానం ఆగీఆగగానే కార్యకర్తలు ఉత్సాహంతో కేరింతలు కొట్టారు. విమానంలోనుంచీ గవర్రాజు దిగాడు. స్థానికనాయకులంతా ఆయన్ని చుట్టుముట్టారు. వారందరి చేతుల్లో నిలువెత్తు పూలదండలున్నాయి. క్షణాల్లో గవర్రాజు మెడ పూలదండలతో బరువెక్కింది. నల్లని కళ్ళద్దాల్లోనుంచి చిద్విలాసంగా చూశాడాయన నిముషంపాటు. కెమేరాలు క్లిక్‌మన్నాయి. గవర్రాజు పక్కనే సర్కిల్‌ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్ నిలబడిఉన్నాడు. మంత్రిగారు ఒకటొకటే పూలదండతీసి ఇస్తుంటే ప్రభాకర్ అందుకుంటున్నాడు.

మరోవంక కార్యకర్తల నినాదాలతో విమానాశ్రయం దద్దరిల్లుతోంది. గవర్రాజు మాత్రం ఇవేమీ వినేస్థితిలో లేడు. తనని ఆహ్వానించడానికి ఎవరు వచ్చారో, ఎవరు రాలేదో నల్లని అద్దాల్లోనుంచి నిశితంగా పరిశీలిస్తున్నాడు.

అవతల నినాదాల జోరు హెచ్చింది. కార్యకర్తల్లో ఉత్సాహం అవధులు దాటుతోంది. మంత్రిగారిని సమీపించాలన్న పట్టుదలతో ఒక్కుమ్మడిగా ముందుకు కదిలారు. తొక్కిసలాట మొదలైంది. పోలీసులు కలగజేసుకొని కార్యకర్తల ప్రయత్నాన్ని విఫలం చేశారు. దీంతో ఆగ్రహించిన కార్యకర్తలు రెచ్చిపోయారు. పోలీసుల జులుం నశించాలి- అంటూ పెద్దపెట్టున అరవసాగారు. ఇది అంతటితో పోలేదు. కార్యకర్తల్లో కొందరు రాళ్ళు రువ్వారు. ఒక పోలీసు కానిస్టేబుల్ కణతకి దెబ్బతగిలింది. అతను అక్కడికక్కడే స్పృహతప్పి పడిపోయాడు. ఈ సంఘటనతో పోలీసుల జాత్యభిమానం మేల్కొంది. లాఠీచార్జి మొదలైంది.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్‌కి మాత్రం




చిమకుట్టినట్టు కూడా లేదు. మంత్రిగారిని వదలకుండా ఆయనవెంటే తిరుగుతున్నాడు.

గవర్రాజు విజిటర్స్ లాంజ్‌లో రెండు నిముషాలు విలేకరులతో మాట్లాడి లోనికెళ్ళిపోయాడు. పావుగంట విశ్రాంతి తీసుకుని మళ్ళీ బైటికొచ్చాడు.

గవర్రాజు మంత్రిత్వశాఖకు సంబంధించి ఈమధ్య కొత్తగా ఒక పథకం ప్రవేశపెట్టాడు. 'ఇలాంటప్పుడు సంబంధిత మంత్రులు సహజంగా ఆ పథకం పురోగతి గురించి అధికారులను అడిగి తెలుసుకోవడం పరిపాటి. ఒకవేళ వాళ్ళు మరచిపోతే జిల్లా ఉన్నతాధికారులే గుర్తుచేసి వారికి వివరిస్తారు.

జిల్లాలో ఆ పథకం అమలు జరుగుతున్న తీరుతెన్నుల గురించి కలెక్టర్ మంత్రికి వివరిస్తున్నారు. గవర్రాజు ముందుకి అడుగులేస్తూ 'ఊ' కొడుతున్నాడు. కళ్ళు మాత్రం తనకంటే నాలుగడుగులు ముందు నడుస్తున్న ఎమ్మెల్యే ప్రకాశరావునే చూస్తున్నాయి. ప్రకాశరావు పక్కన కనకారావు నడుస్తున్నాడు. అదీ అసలు విశేషం. వీళ్ళిద్దరూ ఇంతగా ఎప్పుడు దగ్గరయ్యారో ఆయనకి అర్థంకాలేదు. కనకారావు తేనెపూసినకత్తి. ప్రకాశరావు మేకవన్నెపులి. ఈ రెండూ ఒకటైతే జిల్లాలో తన అస్థిత్వానికి ముప్పు తథ్యమన్న సంగతి గవర్రాజుకి తెలుసు. వాళ్ళవైపే చూస్తూ, వాళ్ళనే గమనిస్తూ యాంత్రికంగా అడుగులేస్తున్నాడాయన. కలెక్టర్ మాత్రం సంక్షేమ పథకం గురించి చెప్పుకుపోతూనే ఉన్నారు.

కనకారావు ఇదివరకెప్పుడూ తనని ఆహ్వానించేందుకు ఎయిర్‌పోర్టుకి రాలేదు. మరి ఇవ్వాళెందుకు వచ్చినట్టు? పైగా ప్రకాశరావుతో పూసుకు తిరుగుతున్నాడు. ఇందులో రాజకీయం ఏమై ఉంటుందో గవర్రాజుకి ఎంత ఆలోచించినా ఊహకి అందడంలేదు.

ఎయిర్‌పోర్టు టెర్మినల్ దాటి బైటికొచ్చారంతా. అక్కడ వరుసగా మూడుకార్లున్నాయి. అవి గవర్రాజు రాజకీయ చక్రవ్యూహానికి దర్పణాలు. అధికారపార్టీలో ఆయన పెంచి పోషిస్తున్న మూడు వర్గాలకి మచ్చుతునకలు. ఇందులో ఒకవర్గానికి కనకారావు నాయకుడు. ఇతను ఈమధ్య తోకజాడిస్తున్నట్టు గవర్రాజు దృష్టికొచ్చింది. ఎలాగైనా తోక కత్తిరించాలనుకున్నాడు.

కనకారావు మొదట్లో వార్డు నాయకుడు. తన ప్రయోజనాలకోసం గవర్రాజే అతనికి ప్రాపకమిచ్చి పైకితెచ్చాడు. ఇప్పుడతను తనకే ఏకుమేకు అవుతున్నాడని గవర్రాజు అనుమానం.

రెండోవర్గానికి గణపతిరావు రాజపోషకుడు. ఇతనికి పార్లమెంటులో సభ్యత్వం ఉంది. ఇతను తలఎగరేసినప్పుడల్లా గవర్రాజుకి అప్పలనాయుడు ఉపయోగపడుతుంటాడు. అప్పలనాయుడు మూడోవర్గానికి ప్రతినిధి.

దేశంలో ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే ప్రతిపక్షం తప్పనిసరిగా ఉండాలి. మరి పార్టీలో ప్రజాస్వామ్యం పటిష్టంగా ఉండాలంటే? ముఠాలు ఉండితీరాలి అంటాడు గవర్రాజు. ఆ ముఠాలను కూడా తనే పోషించాలి. తనే ఆదరించాలి. ఒకరిమీద మరొకరికి ఈర్ష్య కలిగేట్టు చెరొకపూట చెరొకర్ని భుజానికెత్తుకోవాలి. వాళ్ళల్లోవాళ్ళకి కీచులాటలు పెట్టాలి. ఆ విధంగా వాళ్ళ రాజకీయాల్ని వాళ్ళవరకే పరిమితం చేయాలి. సమస్యలతో సతమతం చేయాలి. జిల్లానుంచి వాళ్ళు కాలుబైటపెట్టే తీరికే ఉండకూడదు. అప్పుడిక తన పదవికి ఎసరుపెట్టే వాళ్ళే ఉండరు. ఇదీ గవర్రాజు పొలిటికల్ ఫిలాసఫీ.

కనకారావు, గణపతిరావు, అప్పలనాయుడు ఎవరికివారు మంత్రిగారికి స్వాగత సన్నాహాలు ఆర్భాటంగా చేశారు. బలాబలాల ప్రదర్శనకు ముగ్గురూ తాపత్రయపడుతున్నారన్న సంగతి గవర్రాజుకి అర్థమైంది. లోలోన ఎంతో సంబరపడ్డాడు కూడా. తాను కోరుకునేది ఇదే. వాళ్ళల్లో ఈ పోటీ తనకు లాభిస్తుంది. తన రాజకీయ మనుగడకి ఇది జీవగర్ర. తన పదవికి ఇది శ్రీరామరక్ష.

మంత్రిగారికి ముగ్గురూ బస ఏర్పాట్లు చేశారు. మంత్రిగారిప్పుడు ఏ కారెక్కుతారో కార్యకర్తలకి అర్థంకాకుండా ఉంది. వాళ్ళల్లోవాళ్ళు మథనపడుతున్నారు. ఎటూ తేల్చుకోలేకపోతున్నారు. అంతా అయోమయంగా ఉంది.

తనకారెక్కమన్నట్టు కనకారావు గవర్రాజు పక్కపక్కనే నడుస్తున్నాడు. గణపతిరావు కూడా ఏమీ తీసిపోలేదు. గవర్రాజుకి తనకారువైపు దారి చూపిస్తూ ముందుకి అడుగులేస్తు

న్నాడు. 'మీరు నా కారెక్కితేనే బావుంటుంది' అన్నట్టు అప్పలనాయుడు మంత్రిగారివైపు ఆశగా చూస్తున్నాడు.

గవర్రాజు మాత్రం ఇదేమీపట్టించుకున్నట్టు లేడు. ఆయన దృష్టి మరెక్కడో ఉంది.

"గవర్రాజు జిందాబాద్"

కార్యకర్తలు మళ్ళీ నినాదాలకు దిగారు.

"కనకారావు జిందాబాద్"

ఆ వెంటనే మరోవైపు నుంచి గవర్రాజుకీ, అప్పలనాయుడికీ మద్దతుగా నినాదాలు మొదలయ్యాయి.

మంత్రిగారు అవినీతిపరుల ఆతిథ్యాన్ని స్వీకరించడానికి వీల్లేదంటూ మూడోవర్గం అరుపులకి దిగింది. గణపతిరావుకి మద్దతుగా ఈ వర్గం నినాదాలు చేస్తోంది. అంతేకాదు నిన్నకాక మొన్న పార్టీలో కొచ్చాడు కనకారావు. అప్పలనాయుడు అవినీతి ఊబిలో కూరుకుపోయాడు. మొదటినుంచీ పార్టీని అంటిపెట్టుకుని ఉంటూ ఏ పదవినీ ఆశించకుండా ప్రజాసేవకే జీవితాన్ని అంకితంచేసిన అసలు సిసలైన ప్రజాబంధు గణపతిరావని కార్యకర్తలు ఎలుగెత్తి చాటారు. ఈ ముగ్గుర్లో ఎవరుకావాలో తేల్చుకోమన్నట్లు గొంతు చించుకు అరిచారు.

గవర్రాజు గొంతులో పచ్చి వెలక్కాయపడినంతపనైంది. జనం తాను అనుకున్నంత అమాయకులు కాదేమోనని మొదటిసారిగా అనిపించింది.

అవతల కార్యకర్తలు రెచ్చిపోతున్నారు. ప్రత్యర్థి వర్గాలనాయకుల్ని దుమ్మెత్తిపోస్తూ ఆ ప్రాంతమంతా దద్దరిల్లేట్టు అరుస్తున్నారు. పరిస్థితి విషమిస్తోందనుకున్నాడు గవర్రాజు. ఏం చేయాలో పాలుపోలేదు. అతని మనస్సు చకచకా ఆలోచిస్తోంది.

ఇంతలో అల్లంతదూరాన తెల్లని అంబాసిడర్ కారొకటి తళుక్కున మెరిసింది. గవర్రాజు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అంబాసిడర్ కారులో నుంచి పర్వతవర్థని దిగింది.

రొప్పుతూ రోస్తూ పరుగులాంటి నడకతో గవర్రాజుని సమీపించింది.

బరువైన పూలదండ ఒకటి అమాంతం ఆయనమెళ్ళో వేసింది.

కెమేరాలు క్లిక్ మన్నాయి.

పార్టీలోని ఇతరవర్గాలు ఆశ్చర్యంలోనుంచి బైటపడేందుకు కొద్ది నిముషాలు పట్టింది. ఈ సమయంలో పర్వతవర్థని అక్కడ ప్రత్యక్షం కావడమే ఓ ఆశ్చర్యం.

పర్వతవర్థని పాలకపార్టీ శాసనసభ్యురాలే అయినా ఈమధ్యకాలంలో ఆమెకి, గవర్రాజుకి అంతగా సంబంధాలులేవు. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే ఆమె గవర్రాజు ప్రత్యర్థి శిబిరంవైపే మొగ్గుచూపుతూ వచ్చింది. ఇదంతా గవర్రాజుకి తెలీనిదికాదు.

కాని ఇప్పటి పరిస్థితివేరు. సిద్ధాంతాల్లో రాజీపడినా పడకపోయినా ముఠారాజకీయాల్లో రాజీవైఖరి నాయకుని మనుగడకు అత్యవసరమన్న సంగతి గవర్రాజుకి బాగా తెలుసు. అందుకే అప్పటికప్పుడు తన వ్యూహాన్ని రూపొందించుకున్నాడు. పర్వతవర్థని ఇలా ఉన్నఫళంగా వూడిపడటంలో ఆంతర్యమేమిటో నిదానంగా తెలీకపోదు. ప్రత్యర్థి శిబిరంలో తన పప్పులుడకవని తెలుసుకుని తన అండచేరాలని నిర్ణయించుకునివుండొచ్చు. ఆ పూర్వాపరాలన్నీ తర్వాత - ముందీ మూడువర్గాల గండంనుంచి గట్టెక్కాలి.

పార్టీ జిల్లాశాఖలో మూడువర్గాలు లోలోపల కుమ్ములాడుకుంటున్న తరుణంలో పర్వతవర్థనికి ప్రాపకమిచ్చి మిగతావారికి షాక్ ట్రీట్మెంట్ ఇవ్వాలని గవర్రాజు ఆక్షణంలోనే నిర్ణయించుకున్నాడు. అందుకే ఏమాత్రం సంశయించకుండా ఆమె వెనకే నడిచాడు. మరుక్షణంలో అంబాసిడర్‌కారు రయ్యినదూసుకుపోయింది. ఆ వెనకే కలెక్టర్‌కారు, ఆ తర్వాత సి.ఐ. ప్రభాకర్ జీపు ఒకటొకటిగా వెళ్ళిపోయాయి.

ఈ హఠాత్పరిణామానికి కనకారావు, అప్పలనాయుడు, గణపతిరావు హతాశులయ్యారు. పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లయింది. దీనికంతటికీ నువ్వు కారణమంటే కాదు నువ్వే కారణమంటూ ముగ్గురూ ఘర్షణకి దిగారు.

అవతల కార్యకర్తల పరిస్థితీ ఇలాగేవుంది. నాయకుల వూతంచూసుకుని అగ్గిమీద గుగ్గి

లము అయ్యాయి. పార్టీ జండాలు తగలంచుకు వచ్చిన కర్రలు వారికిప్పుడు ఆయుధాల య్యాయి. మరోవంక గులకరాళ్ళు ఆకాశంలో వల్టీలు కొడుతున్నాయి. పరిస్థితి అదుపుత ప్పింది. పోలీసుల లాఠీలు ఏమాత్రం పనిచే యడంలేదు. కార్యకర్తల్లో చాలామందికి తల లుపగిలాయి. కొందరు స్పృహతప్పిపడిపో యారు. పోలీసులు గాలిలోకి కాల్పులు జరిపా రు. ఈ కాల్పుల్లో ఇంకొందరు గాయపడ్డారు. ఈలోగా రెండు వాన్లనిండా పోలీసు బలగాలు దిగాయి. చాలామందిని అదుపులోకి తీసుకు న్నారు.

అక్కడ..

గెస్ట్‌హౌస్‌ముందు గవర్రాజు, పర్వతవర్ధని కారు దిగారు.

తెల్లారితే పట్టణంలో గవర్రాజు పర్యటన మొదలవుతుంది. పర్వతవర్ధని ప్రాతినిధ్యం వహిస్తున్న నియోజకవర్గంలోవున్న ఏకైక పట్టణం ఇదే. పర్యటన ఇక్కడినుంచే ప్రా రంభించాలనిముందే నిర్ణయించారు.

గవర్రాజు, పర్వతవర్ధని ఓ అరగంటసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. రేపటి సభలు, సమావేశాల ఏర్పాట్ల గురించి పూసగుచ్చినట్టు వివరించింది. ఆ తర్వాత సెలవుతీసుకుని వెళ్ళిపోయింది.

గవర్రాజు కనకారావుకి ఫోన్‌చేశాడు. పది నిముషాల్లో అతను రెక్కలు కట్టుకుని వాలాడు. స్వయంగా మంత్రిగారు పైగా తనొక్కణ్ణీ పిలి పించేసరికి అతను ఉబ్బిపోయాడు.

ఎయిర్‌పోర్టులో జరిగిన గొడవని గురించి అడిగితెలుసుకున్నాడు. తెల్లారిపేపర్లకెక్కితే పదిమందిలో పలచబడిపోతామని కనకారావు కి సుతిమెత్తగా చీవాట్లు పెట్టాడు. ముఠాకు మ్ములాటలు పార్టీకి ఎంతచేటు తెస్తాయో పావు గంటసేపు లెక్చరిచ్చాడు. కనకారావు పశ్చాత్తా పపడ్డాడు.

రేపు మొట్టమొదట పర్వతవర్ధని నియోజక వర్గంనుంచి తన పర్యటన మొదలవుతు న్నందున ఆమె ఆతిథ్యంలో వుండటమే సబ బు అన్నకారణంతో ఎయిర్‌పోర్టులో ఆమె కారె క్కినట్టు గవర్రాజు చెప్పాడు.

కనకారావుకి ఈ పాయింట్ సమంజసంగానే తోచింది. ఎయిర్‌పోర్టులో మంత్రిగారి ప్రవర్త నని అపార్థంచేసుకున్నందుకు తనని తానే నిందించుకున్నాడు.

మంత్రిగారి రాక సందర్భంగా తమ పట్ట ణంలో భారీయెత్తున బహిరంగసభలు, సన్మాన కార్యక్రమాలు ఏర్పాటుచేస్తున్నట్టు చె ప్పాడు కనకారావు. మంత్రిగారు తనొక్కణ్నే పిలిచి, పర్సనల్‌గా మాట్లాడినందుకు కొండంత తృప్తితో కనకారావు సగర్వంగా వెళ్ళా డు. అందర్నీ మించిపోయేవిధంగా తమ పట్ట ణంలో భారీ ఏర్పాట్లుచేయాలని ఆ క్షణంలోనే నిర్ణయించుకున్నాడు. అదే పనిమీద వూరు బయలుదేరాడు.

ఆ తర్వాత గణపతిరావుకి, అప్పలనాయు డికి కూడా గవర్రాజు విడివిడిగా ఫోన్లుచేసి రప్పించాడు. కనకారావుకి చెప్పినట్టుగానే చె ప్పి పంపాడు. ఆ విధంగా ఆ ముగ్గుర్నీ తన 'వర్గీయులు'గా తృప్తి పరచాడు. అదే సమ యంలో ఆ ముగ్గురిలో ఒకరిపట్ల మరొకరికి శతృత్వం మిగిల్చాడు.

★ ★ ★

పట్టణమంతా పుట్టినరోజు జరుపుకుంటు న్నట్టుగా వుంది. ఎటుచూసినా కోలాహలమే. పార్టీ పతకాలు రెపరెపలాడుతూ టాక్సీలు, జీపులు, ఆటోరిక్షాలు, సైకిళ్ళు, స్కూటర్లు, మోటారుసైకిళ్ళు రోడ్లవెంబడి అటూఇటూ పరుగులు పెడుతున్నాయి.

ప్రధాన రహదారుల్లో బ్యానర్లు, రంగు కాగితా లు పట్టణానికి కొత్త అందాలు తెచ్చిపెట్టాయి.

గంట గడుస్తున్నకొద్దీ పట్టణంలో జన సందోహం ఎక్కువవుతోంది. ఏ కూడలిలో చూ సినా తుపాకీలు ధరించిన పోలీసులే దర్శనమి స్తున్నారు.

పట్టణంలో మొత్తం మూడు వేదికలు వెలి శాయి. అందులో ఒకటి శాసనసభ్యురాలు పర్వ తవర్ధని స్వయంగా ఏర్పాటుచేయించింది. ఆ స్టేజిదగ్గర ఇసుకవేసినా రాలనంతమంది జనం పోగయ్యారు.

బారులు తీరివస్తున్న కార్లు చూడగానే జనంలో ఉత్సాహం వచ్చింది.

"మంత్రిగారొచ్చారు"- గుసగుసలు విని పిస్తున్నాయి. వరుసగా ఓ అరడజనుకార్లు




స్టేజీ పక్కగా ఆగాయి. తెల్లని అంబాసిడర్‌కా రులో నుంచి ముందుగా పర్వతవర్ధని దిగింది. ఆ తర్వాత గవ్రరాజు కాలుకిందపెట్టాడు. కార్య కర్తలు, అభిమానులు ఆయన్ని చుట్టుముట్టా రు. గవ్రరాజు చుట్టూ పోలీసు వలయం ఏర్పా టైంది.

రెండునిముషాల్లో ఆయన స్టేజీ ఎక్కాడు. చిరుదరహాసంతో ముకుళిత హస్తాలతో జనంముందు నిలబడ్డాడు.

''గవ్రరాజు జిందాబాద్'' కార్యకర్తలు దిక్కు లు పిక్కటిల్లేలా అరిచారు. ఆయన పెదాల మీద సన్నని నవ్వు తళుక్కున మెరిసి అంత లోనే అంతర్ధానమైంది.

హితులు, సన్నిహితులు, శ్రేయోభిలాషులు, పార్టీ అభిమానులు, కార్యకర్తలు, ఇతర నాయ కులు ఒకరొకరే వరుసగా స్టేజీ ఎక్కి మంత్రి గారి మెళ్ళో పూలదండలేస్తున్నారు. ము ఖంమీద నవ్వు పులుముకుని గవ్రరాజు మెడ వంచి నిలబడివున్నాడు. పూలదండల జోరు పెరిగింది. అతని ముఖంలో సరికొత్త వెలుగు లు ద్యోతకమవుతున్నాయి. దండల విలువను అతను లోలోపలే అంచనా కడుతున్నాడు.

తనమెడలో పడుతున్న దండలు తన పలు కుబడికి నిదర్శనంగా గవ్రరాజు భావిస్తున్నా డు.

గవ్రరాజు మెడనలంకరిస్తున్న దండలన్నీ ఆయన వాటిని తీసేయగానే స్టేజీ వెనక్కి జేరుతున్నాయి. అక్కడ ఇందుకోసం ప్రత్యే కంగా ఒక లారీని ఏర్పాటుచేశారు.

ఓ పావుగంటకి దండల కార్యక్రమం ముగి సింది. ఆతర్వాత అరగంటసేపు గవ్రరాజు ప్రసంగించాడు.

ప్రసంగం పూర్తయి, ఆయన స్టేజీ దిగగానే బాషా ఎదురెళ్లాడు. ఇద్దరూ కలిసి కారుదాకా నడిచారు. మంత్రిగారు కారెక్కారు. ఆ వెనకే పర్వతవర్ధని, భాషాలోనికెక్కి కూర్చున్నారు.

బాషా స్థానికంగా ఇప్పుడిప్పుడే పైకివస్తు న్నాడు. పట్టణంలో ముస్లిములనందర్నీ ఇప్ప టివరకు ఏకతాటిపైన నడిపించుకొచ్చాడు. ఈసారి ఎన్నికల్లో అతనికి సీటు రావచ్చునన్న వదంతులు వ్యాపించాయి. సహజంగానే ఈ పరిణామం పర్వతవర్ధినికి రుచించలేదు. అందుకే బాషాపట్ల ఆమెలో వ్యతిరేకత పెరి గింది. ఎన్నికల్లో ఓట్ల భయం ఆమెకిలేదు. గవ్రరాజు అండవుంటే చాలు ఓట్లకోసం ఎవ్వ ర్నీ అర్థించాల్సిన అగత్యం వుండదు. అందుకే బాషాని దువ్వాల్సిన అగత్యం కూడా కనిపించ లేదామెకి. ఎటొచ్చీ ఈసారి ఎన్నికల్లో అతను తనకుపోటీకాకుండా చూసుకోవడమే ముఖ్యం.

రెండోవేదిక దగ్గర కారాగింది. పట్టణంలో తనకువున్న పలుకుబడి పర్వతవర్ధినికంటే ఏమాత్రం తక్కువకాదని నిరూపించేందుకు బాషా శతవిధాలా ప్రయత్నించాడు. ఘుమ ఘుమ అత్తరు వాసనలు వెదజల్లుతున్న నిలు వెత్తు పూలమాలలు వేదికమీద గవ్రరాజుకి మళ్ళీ ఓసారి అలంకారాలయ్యాయి.

గల్ఫ్ దేశాల్లో సంపాదిస్తున్న స్థానిక ముస్లి ముల అండ బాషాకి బాగా వుంది. అతను యువకుడు. రాజకీయాల్లో ఆసక్తివున్నవాడు. విద్యావంతుడు. మైనారిటీల సమస్యలు తెలి సినవాడని ఆ వర్గంలో పేరుంది. అది బాషాకి అన్ని విషయాల్లోనూ అనుకూలిస్తోంది. మంత్రి వర్గంలో మైనారిటీలకు స్థానం లేదిప్పుడు. గవ్రరాజు తలుచుకుంటే తనకి మంత్రిపదవి దక్కుతుందన్న ఆశ బాషా నరనరాల్లోనూ జీర్ణించుకుపోయిఉంది. గవ్రరాజుని మచ్చిక చేసుకోవడం అతని ప్రస్తుత ధ్యేయం. ఈసారి ఎన్నికల్లో సీటు సంపాదిస్తేచాలు. తాను మంత్రి అయిపోయినట్టేనని అతని ఉద్దేశం.

వేదికమీద మంత్రిగారికి యాభైవేల రూపా యల పర్సు బహూకరించాడు. గవ్రరాజు అత న్ని అమాంతం కౌగిలించుకున్నాడు. పర్వతవ ర్ధనికి ఇది కన్నెర్ర అయినా బయటపడటానికి వీల్లేని పరిస్థితి. మంత్రిగారు అరగంటపైగా ప్రసంగించారు. మైనారిటీలంటే తనకెంతో ప్రేమ, ఆదరాభిమానాలున్నాయని చెప్పుకు న్నాడు. మైనారిటీల సంక్షేమంకోసం అవసర మైతే ప్రాణమిచ్చేందుకు కూడా తాను సిద్ధమే నన్నాడు.

గవ్రరాజు ప్రసంగం పూర్తయ్యాక జనం ఆకాశం అదిరేట్టు చప్పట్లు కొట్టారు.

ఈ వేడుకతో బాషా పలుకుబడి పెరిగినట్ల యింది. అతనెంతగానో సంబరపడ్డాడు. అది తన విజయంగా గర్వపడ్డాడు. ఇకపై పర్వతవ



ర్ధనిని ఓ ఆట ఆడించవచ్చుననుకున్నాడు. ఇంతకాలం ఛోటానాయకుల లిస్టులో అడుగునెక్కడో చిల్లరనాయకుడుగా మిగిలిపోయిన తను ఇప్పుడు పట్టణంలోని ప్రముఖ నాయకుల జాబితాలో చేరిపోయినట్లేననుకున్నాడు.

పట్టణంలో ఇంకా ఒకే ఒక్క బహిరంగసభ మిగిలిపోయింది. మంత్రిగారి కారు అటువైపు దూసుకెళ్లింది.

ఆ బస్తీకి తిరుగులేని చక్రవర్తి హరిబాబు. పార్టీపట్టణశాఖ గౌరవాధ్యక్షుడు కూడా. స్వతహాగా డబ్బున్నమనిషి. అందుకే పనిలేని పదవిని కట్టబెట్టింది పార్టీ. పర్వతవర్ధనికి, ఇతనికి మొదట్నుంచీ చుక్కెదురే! ఆమె భర్త బతికివున్న రోజుల్లోనే అతనికీ, హరిబాబుకీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుండేది. ఆమెమీద అక్కసుకొద్దీ హరిబాబు నిన్న విమానాశ్రయానికి సైతం వెళ్లలేదు. ఆయనకి ఓ ధీమావుంది. అదే డబ్బు ధీమా. తన డబ్బు బలం చూసయినా గవర్రాజు తనని లక్ష్యంచేస్తాడన్న సంగతి అతనికి బాగాతెలుసు.

అయితే మంత్రిగారికి స్వాగత ఏర్పాట్లు చేయడంలో మాత్రం రాజీపడలేదు. అదే జరిగితే ప్రజల దృష్టిలో పర్వతవర్ధని, భాషా పైచేయి అవుతారని ఆయన భయం. అందుకే తనబస్తీ మొత్తాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాడు. ముఖ్యమైన కూడలులదగ్గర గవర్రాజు కటౌట్లు కూడా ఏర్పాటుచేయించాడు. చుట్టుపక్కల పల్లెలనుంచి పెద్దయెత్తున జనాన్ని సమీకరించాడు. ఆ రెండు సభలకూ వచ్చినంతమందిని తనొక్కడే రప్పించగలిగాడు. ఆ ప్రాంతంలో ఏ రోడ్డుచూసినా తిరణాల సందడే కనిపిస్తోంది. నాలుగెకరాల స్థలంలో ఓమూలగా బాగా ఎత్తులో వేదికనిర్మించారు. అప్పటికే అక్కడ జనం క్రిక్కిరిసివున్నారు. మొదటి రెండు బహిరంగసభలకు హాజరైన జనంలో కొంతమంది మళ్లీ ఇక్కడికి చేరుకున్నారు.

స్టేజీ వెనుకభాగంలో గవర్రాజు కారుదిగాడు. ఈరోజుకి ఇదే ఆఖరి సభ. గవర్రాజు వేదిక ఎక్కాడు. అంతమంది జనాన్నిచూసి పర్వతవర్ధని లోలోనే కుళ్లుకుంది.

 

పూలదండలు సమర్పించుకోవడంలో కూడా హరిబాబుదే పైచేయి అయింది. ఒక్కొక్క దండనే మెళ్లోనుంచితీసి గవర్రాజు పక్కన పెడుతూ వుంటే, అవన్నీ యథావిధిగా లారీలోకి చేరుతున్నాయి. లారీ దాదాపు నిండిపోయింది.

ఇంతలో ఆకాశం మేఘావృతమైంది. మంత్రిగారిని పొగడ్తలతో ముంచెత్తుతూ పర్వతవర్ధని, బాషా, హరిబాబు ప్రసంగించారు. ప్రజల్లో నుంచి నినాదాలకు అంతేలేదు.

మంత్రిగారు మాట్లాడేందుకు లేచేసరికి వానజల్లు మొదలైంది. అయినా జనానికి అదే మీపట్టినట్టులేదు.

స్టేజీ ముందుభాగంలో జనం ఎక్కువగా గుమికూడారు.

అక్కడ చేరినవారందరికీ ఒకే తాపత్రయం - తమ నాయకుణ్ణి దగ్గరగా మరింత స్పష్టంగా చూడాలని.

వాళ్లందరికీ ఒకటే ఆరాటం – తమ కష్టాలు చెప్పుకుని, వాటినుంచి కడతేర్చమని అర్థించాలని.

ఆ ఆరాటానికి వర్షం తోడయింది. అనుకోని విధంగా తొక్కిసలాట మొదలైంది.

పర్వతవర్ధని మైకుముందుకొచ్చి నిశ్శబ్దంగా, ప్రశాంతంగా వుండాల్సిందని మనవి చేసింది. మనసులో మాత్రం ఈసభ భగ్నం కావాలని కోరుకుంది.

ప్రియతమ నాయకుడు, అటు వృద్ధతరానికి ఇటు యువతరానికి వారధిలాంటి రాజనీతిజ్ఞుడు, భావితరానికి ఆశాజ్యోతి అయిన మంత్రివర్యులు గవర్రాజుగారు ఇప్పుడు ప్రసంగిస్తారని ప్రకటించి వెళ్ళి తన సీట్లో కూర్చుంది.

గవర్రాజు మైకు దగ్గరికి నడిచాడు.

తొక్కిసలాట ఆగలేదు. అప్పటిదాకా గవర్రాజునే అంటిపెట్టుకునివున్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్ స్టేజిముందుకొచ్చాడు. దగ్గర్లో కనిపించిన ఇద్దరు ఎస్.ఐలని పిలిచి, ఏదోపని పురమాయించి, మళ్ళీ స్టేజీవెనక్కి వెళ్లిపోయాడు.

ఆ ఇద్దరు సబ్‌ఇన్‌స్పెక్టర్లు మరో డజనుమంది పోలీసుల్ని వెంటేసుకుని జనంమీదవడ్డారు.

అప్పటిదాకా ముందువైపునకు నెట్టుకొస్తున్న జనం మళ్ళీ ఒక్కసారిగా వెనక్కి తోసుకోవడం మొదలుపెట్టారు. లాఠీలబారినుంచి తప్పించుకునేందుకు ఎవరికివాళ్ళు గుడ్డిగా అడుగులు వేస్తూ ముందుకెళ్ళిపోతున్నారు. ఈ తొక్కిసలాటలో ఓ పదేళ్ళ కుర్రాడు ఇరుక్కుపోయాడు. ఆ జనం బలంముందు అతని బలం చాల్లేదు. అతను కిందపడిపోయాడు. అనేకజతల కాళ్ళు అతనిమీదగా నడుచుకుంటూ వెళ్ళిపోయాయి.

మైకుముందు నిలబడ్డ మంత్రిగారిని హరిబాబు యధావిధి సత్కరించాడు. వందరూపాయలనోట్లతో గుచ్చిన దండని ఆయన మెళ్ళో వేశాడు. దాంతోబాటు ఓ ఖరీదైన పూలదండ కూడా వేశాడు. గవర్రాజు ముఖం సంతోషంతో విప్పారింది.

ఇంతలో జనంలో కలకలం...

''కుర్రాడు చచ్చిపోయాడు''

''పాపం... ఎవరో పిల్లాడుపోయాడు''

జనంలోనుంచి కేకలు- గవర్రాజుకి క్షణంలో ముచ్చెమటలు పోశాయి.

పిల్లవాడి శవాన్ని స్టేజిదగ్గరికి తెచ్చారు ఎవరో.

అంతరంగారుతోనూ గవర్రాజు మనస్సు వేగంగా పనిచేసింది. అతనిలోని రాజకీయనాయకుడు సమయస్ఫూర్తి ప్రదర్శించాడు.

గవర్రాజు రెండు అంగల్లో శవాన్ని సమీపించాడు. మోకాళ్ళమీద వంగి, కూర్చుని తన మెడలోవున్న బరువైన పూలదండని తీసి శవంమీదకప్పాడు. గవర్రాజు మెళ్ళోని నోట్ల దండ శవం మొహంమీద అటూ ఇటూ కదులుతోంది. జనం పెద్దపెట్టున చప్పట్లు చరిచారు.

గవర్రాజు మనస్సు తేలికపడింది. తన సమయస్ఫూర్తికి తనను తానే అభినందించుకుంటూ నల్లని కళ్ళద్దాల పక్కలనుంచి చేతివేళ్ళతో కళ్ళు అద్దుకున్నాడు. ఆ తర్వాత మైకు ముందుకొచ్చాడు. పిల్లవాడి ఆత్మశాంతికి ఓ నిముషం మౌనంపాటించాడు. గొంతు సవరించుకుని మాట్లాడటంమొదలు పెట్టాడు.

''ఇంత చిన్నవయస్సులోనే రాజకీయాలపట్ల ఈ కుర్రవాడికి ఇంతటి అభిరుచి ఉందని తలుచుకుంటే నా గుండె ఆనందంతో ఉప్పొంగిపోతోంది. కాని ఆ పసికుర్రాడు మన ముందు లేడన్నబాధ నన్ను కుంగదీస్తోంది కూడా. మనదేశం ముందుముందు మరో మహాత్ముణ్ణి పొందే అవకాశాన్ని కోల్పోయిందని నా అంతరాత్మ ప్రబోధిస్తోంది. ఈ కుర్రవాని దేశభక్తికి విలువకట్టలేం. మహాత్ములకి ఆయువు తక్కువన్న నానుడి మరోసారి రుజువైంది. ఏమైనా ఈరోజు మనకి ఎంతో దుర్దినం. మాతృదేశంకోసం ప్రాణాన్నిత్యజించే సుశిక్షితుడైన సైనికునికంటే ఈ కుర్రాడు ఏమాత్రం తీసిపోడు. ఇతను అమరజీవి. ఈ క్షణంనుంచి ఈ కుర్రాడు మనలోనే జీవిస్తాడు. మనకి మరింత ప్రేరణనిస్తాడు. ఇతని కుటుంబానికి ప్రభుత్వంతో పోరాడి అయినా ఆర్థిక సాయంచేయిస్తాను''

జనంలో ఈలలు, కేరింతలు, చప్పట్లు.

ఒక్కక్షణమాగి గవర్రాజు మళ్ళీగళం విప్పాడు.

''ఈరోజు ఈ కుర్రాడు ఇక్కడిలా చనిపోవడం మనకెంతో గర్వకారణం. దేశభక్తిలో మీరెవ్వరికీ తీసిపోరనీ, అవసరమైతే ప్రాణాలివ్వడానికైనా వెనకాడరనీ నేటితో నిర్ధారణ అయింది''

జనంలో మరోమారు వెర్రి ఆనందం!

మంత్రిగారి మాటలు వాళ్లని మంత్రముగ్ధుల్ని చేశాయి.

ఆ తర్వాత గవర్రాజు చాలాసేపు మాట్లాడాడు.

ప్రజాసమస్యల్ని అక్కడికక్కడే పరిష్కరించేందుకు తానీ పర్యటన ప్రారంభించానన్నాడు. రాత్రనక, పగలనక, ఎండనక, వాననక తన ఈ కార్యక్రమాన్ని వారంరోజులపాటు నిర్విఘ్నంగా కొనసాగిస్తానని చెప్పాడు.

జనంలోనుంచీ మళ్ళీ చప్పట్లు. ఈ చప్పట్లే గవర్రాజుకింకా హుషారుతెస్తున్నాయి. ఆ హుషారుతోనే అనర్గళంగా మాట్లాడేస్తున్నాడు.

పట్టణంలో నీళ్ళ సమస్యని శాశ్వతంగా రూపుమాపేందుకు కంకణం కట్టుకుంటానన్నాడు. నిరుద్యోగాన్ని నిర్మూలించేదాకా నిద్రపోనన్నాడు.




అరగంటసేపు చెప్పిన విషయం చెప్ప కుండా మాట్లాడాడు. తన శాఖకి సంబంధించిన అంశాలుకొన్నే. తన శాఖకు ఏమాత్రం సంబంధంలేని ఇతర శాఖల తర పున కూడా వకాల్తా పుచ్చుకుని హామీల వడగ ళ్ళువెదజల్లాడు. ఏది ఉచితం ఏది అనుచిత మన్న వెరపు లేకుండా నోటికి వచ్చిందల్లా మాట్లాడాడు.

తన పరువుపోకుండా ఉండాలంటే జనానికి ఎలా చెప్పాలో, ఏం చెప్పాలో అదల్లా చెప్పాడు. ప్రజల్ని మభ్యపెట్టేందుకు వారికేది కావాలో అదంతా ఇచ్చాడు మాటల్లో.

గవర్రాజు ఆవేశపూరిత ప్రసంగం జనాన్ని కట్టిపడేసింది. మంత్రిగారు చాలా బాగా మాట్లాడారని అందరూ హర్షంవ్యక్తం చేశారు. ఈలోగా చల్లగా ఆ పిల్లవాడి శవాన్ని అక్కడి నుంచి తొలగించారెవరో.

గండం గడిచినందుకు గవర్రాజు హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. పిల్లవాడి శవాన్ని తలుచుకునప్పుడల్లా మనస్సు కలుక్కు మంటోంది.

సభ ముగిసింది. గవర్రాజు స్టేజీదిగి కారె క్కాడు.



మోహినికి ఓ చెల్లెలుంది. పేరు మందాకిని. పాతికేళ్ళుంటాయి. బొంబాయిలో ఒక్కతే వుంటోంది. అక్కడ జీవితం ఏమంత ఆశాజన కంగాలేదు. ఎదుగూబొదుగూ లేకుండా వుంది. తక్కువరాబడితో విలాసవంతమైన జీవితం గడపడం దుర్భరమవుతోంది. బార్లలోనూ, నైట్ క్లబ్బులలోనూ ప్రొఫెషనల్ డాన్సర్‌గా పనిచే స్తోంది. ఆ వృత్తిలో సంపాదనకంటె సమస్యలే ఎక్కువ. వాటితో మనశ్శాంతి లేకుండాపో తోంది. అందుకే అక్కడినుంచి మకాంమార్చే యాలని ఎప్పటినుంచో అనుకుంటోంది. ఈ విషయం అప్పుడప్పుడు మోహిని చెవినవేస్తూ వచ్చింది.

చెల్లెల్ని తనదగ్గరికి తెచ్చుకోవాలని మోహిని కూడా శతవిధాలా ప్రయత్నిస్తూనే వుంది. ఎంతైనా తానూ ఒకరిమీద ఆధారపడి బతుకుతోంది. అలాంటప్పుడు చెల్లెలి భారా న్ని తానే నెత్తినవేసుకోవడమా లేక వీరభద్రాన్ని ఆశ్రయించడమా అనేవిషయం చాలారోజులు ఆలోచించింది. చెల్లెలి బాధ్యతని వీరభద్రానికి అప్పగించడమే మంచిదనిపించింది.

గవర్రాజు పర్యటనకి వెళ్ళినమర్నాడే మోహిని వీరభద్రం దగ్గరకి వెళ్ళింది. చెల్లెలి విషయం చెప్పింది.

వీరభద్రానికి మోహినిలాంటి అందగత్తెల అవసరం ఎంతో వుంది. తెల్లవారిలేస్తే అతను ఎన్నెన్నో పనులమీద మరెందర్నో కలుస్తుంటా డు. తన పనులు పూర్తిచేయించుకునేందుకు ఎవరి బలహీనతలకి తగ్గట్టు వారిని సంతృప్తి పరచడం అతని దైనందినజీవితంలో ఓ భాగం. అందుకే అతనంటే వల్లమాలిన అభి మానంచూపేవాళ్ళు అటు రాజకీయవర్గాల్లోనే కాక ఇటు అధికారవర్గాల్లోనూ లెక్కలేనంత మంది వున్నారు. వాళ్ళందరికీ వీరభద్రం రాజ పోషకుడు.

వీరభద్రం తన స్వార్థానికి నిత్యం విసురు తుండే సవాలక్షపాచికల్లో మోహిని కూడా ఒకతి. ఇప్పుడు మరో పాచిక వచ్చి చేరబో తోందన్నమాట అనుకున్నాడు వీరభద్రం. మోహిని చెల్లెల్ని స్వయంగా చూశాక ఆమెని ఎవరిమీద ప్రయోగించాలో నిర్ణయించుకోవాల నుకున్నాడు.

మోహిని ఎదురు చూస్తోంది వీరభద్రం ఏమంటాడోనని.

అతనుమాత్రం సిగార్ పొగపీలుస్తూ ఆలో చనలోపడ్డాడు. మోహిని వీరభద్రం మనిషి. ఆమాటకొస్తే అతనికి అమ్ముడుపోయింది. నెల నెలా అతను కొంత డబ్బిస్తాడు. అతను అప్ప గించిన పని పూర్తిచేయడం ఆమె విధి. గవర్రా జుతో తనకు ముందుముందు ఎంతో అవస రంవుందని రెండేళ్ళక్రితమే వీరభద్రం తెలు

సుకున్నాడు. ఆ ఆలోచనవచ్చిందే తడవుగా మోహినిని ప్రయోగించాడు. ప్రస్తుతం గవర్రాజు తనదారిలోనే వున్నాడు. అతని సాయంతో మున్ముందు మరిన్ని కార్యాలు సాధించాలన్నది వీరభద్రం లక్ష్యం.

ఓ పదినిముషాలయ్యాక వీరభద్రం నుంచి సమాధానం దొరికింది మోహినికి. ఆమె ముఖం విప్పారింది. చెల్లెలి సమస్య ఓ కొలిక్కి వచ్చిందన్న తృప్తి ఆమెలో కనిపించింది.

చెల్లెల్ని పిలిపించమని వీరభద్రం చెప్పిన రోజురాత్రే మోహిని ఫోన్ చేసింది. రెండుమూడురోజుల్లో బయలుదేరి రమ్మని మందాకినికి చెప్పింది. అక్కడి బరువుబాధ్యతలన్నీ ఒకటి రెండురోజుల్లో వదిలించుకుని వస్తానని మందాకిని జవాబిచ్చింది. ఖచ్చితంగా ఎప్పుడు బయలుదేరివచ్చేదీ మళ్ళీ ఫోన్‌చేస్తానంది. ఆ ప్రకారం మందాకిని నిన్ననే ఫోన్‌చేసి బొంబాయి నుంచి ప్రయాణమయింది.

గవర్రాజు సెక్రటరీ భరత్‌కి మోహిని ఫోన్ చేసి కారు పంపమని చెప్పింది.

హడావుడిగా ముస్తాబై బయలుదేరబోతుండగా వీరభద్రం నుంచి ఫోన్‌వచ్చింది. మందాకిని విషయం అడిగాడు. ఈ పూటే రాబోతున్నట్టు చెప్పిందామె. సాయంత్రం ఇద్దర్నీ ఇంటికిరమ్మన్నాడు. మోహిని సరేనంది.

ఆమె స్టేషన్‌కి చేరేసరికి బొంబాయి ఎక్స్‌ప్రెస్ అప్పటికి పదినిముషాల క్రితమే వచ్చిఆగింది. ఇంకా ప్లాట్‌ఫారంమీద రద్దీతగ్గలేదు. చెల్లెలికోసం ఆమె కళ్ళు అటూ ఇటూ వెదుకుతుండగా వెనకనుంచి ఎవరో ఆమె భుజంమీద చెయ్యేశారు. మోహిని తలతిప్పి చూసింది.

ఎదురుగా అనంత్!

మోహిని ఆశ్చర్యంతో అతని కళ్ళల్లోకి చూసింది. అతనూ అంతే ఆశ్చర్యపోయాడు. దాదాపు పదేళ్ళతర్వాత మళ్ళీ ఇవ్వాళ ఇక్కడ తామిలా కలుసుకోవడం వారికి నమ్మశక్యంగా లేదు.

రెండు నిమిషాలు గడిచినా మోహిని ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు.

"అనంత్...నువ్వు..." ఆమే ముందుగా గొంతు విప్పింది.

"అవును మోహినీ... నేనే... బాగున్నావా?"

అతని గొంతు చాలా నిర్మలంగా వుంది. ళ్ళల్లో కాంతులు మోహినిపట్ల అతని ఇష్టాన్ని చెప్పకనే చెబుతున్నాయి.

మోహిని తదేకంగా అతనివైపే చూస్తోంది. అప్పటికంటె అనంత్ కొంచెం ఒళ్ళు చేశాడు. రంగుకూడా వచ్చాడు. ట్రిమ్మింగ్ గడ్డం, ముందువైపు బట్టతల, జీన్స్‌పాంట్ మీద గ్లాస్కోలాల్చీ వేశాడు. మనిషిలో పెద్దరికం కనిపిస్తోంది.

వయస్సు పైబడుతున్నా మోహిని అందాలు ఏమాత్రం చెక్కుచెదర లేదనిపించిందతనికి. అప్పటికీ ఇప్పటికీ ఆమెలో ఒకటేమార్పు. పదేళ్ళక్రితం తానెరిగిన మోహిని అమాయకపు లేడిపిల్ల. కాని ఇప్పుడీ మోహిని కళ్ళల్లో జీవితసారాన్ని కాచివడబోసిన అనుభవాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అప్పట్లో మోహిని చాలా సన్నగా వుండేది. లైట్‌కలర్ చీరల్లో చాలా సింపుల్‌గా కనిపించేది.

ఇప్పుడు ఆమె జీవనవిధానం మారింది. ఆలోచనా విధానమూ మారింది. పరిస్థితుల ప్రభావంవల్ల ఆమె వేషభాషలూ మారాయి. గ్రీన్‌కలర్ చీర పసుపుపచ్చని ఆమె శరీరానికి మరింత హుందాతనాన్నిచ్చింది. స్లీవ్‌లెస్ బ్లౌజ్ ఆమె జీవనసరళికి అద్దంపడుతోంది.

స్వతహాగా అందమైన మోహినిలో మరిన్ని అందాలు కనిపించాయి అనంత్‌కి.

"యూ ఆర్ సో ఫెయిర్" మోహినిని అభినందించకుండా వుండలేకపోయాడు.

ఆమె కళ్ళు గర్వంతో మిలమిలమెరిశాయి. అనంత్ తనను ఇలా పొగడటం ఆమెకి మరింత ఆశ్చర్యమేసింది. అతనిలో వచ్చిన ఈమార్పు ఆమెని క్షణకాలంపాటు తబ్బిబ్బుచేసింది.

ప్లాట్‌ఫారంమీద సందడి తగ్గుతోంది. మందాకిని మోహినికోసం ఎదురుచూసి చూసి సూట్‌కేసు తీసుకుని ప్లాట్‌ఫారం బైటికి నడవబోతూ గేటు దగ్గర వీళ్ళనిచూసి ఆగిపోయింది. పక్కగా వెళ్ళి మోహిని చెయ్యిపట్టుకుంది.





"ఎంతసేపయిందక్కా వచ్చి" అంటూ కుశలం అడిగింది. అప్పటికిగాని మోహినికి గుర్తురాలేదు - తాను, అనంత్ కలిసి దాదాపు పదినిమిషాలైందని!

చెల్లెల్ని అతనికి పరిచయంచేసింది.

మందాకిని ఎర్రగా సన్నగా పొడుగ్గా వుంది. మోహినికంటె చాలా ఆధునికంగా మేకప్ అయింది. షెల్వార్, కమీజ్‌లో మరింత సుకుమారంగా కనిపిస్తోంది. వెడల్పాటి కళ్ళు ఆమె ముఖానికి మరింత వన్నెతెచ్చిపెట్టాయి.

ముగ్గురూ కలిసి ప్లాట్‌ఫారం బైటికి నడిచారు.

అనంత్‌ని తనింటికి ఆహ్వానించింది మోహిని. ఏ హొటల్‌లో దిగాలా అని ఆలోచిస్తున్న అనంత్‌కి మోహిని ఆహ్వానం పరిష్కారంగా తోచింది.

ముగ్గురూ కారెక్కారు.

అనంత్ కనిపించిన క్షణంనుంచి మోహినికి ఎంత వద్దనుకున్నా పదేపదే గతం గుర్తుకు వస్తోంది.

ఆ గతమంతా తన ఇష్టానుసారం సాఫీగా సాగివుంటే ఇవ్వాళ తన జీవితం ఈ మార్గంలో ఉండేది కాదన్న ఆలోచనరాగానే ఆమె మనస్సు కొంచెంసేపు బాధపడింది.

అనంత్‌తో తన పరిచయం పదేళ్ళనాటిది. అప్పట్లో తాను మద్రాసులో ఉండేది. ఒక ప్రయివేటు డిటెక్టివ్ ఏజన్సీలో కొత్తగా ఉద్యోగంలో చేరింది. అమ్మా, నాన్న, చెల్లికి తనే జీవనాధారం.

అనంత్ జర్నలిస్టుగా పనిచేసేవాడు. వార్తల సేకరణకోసం నిత్యం తెగ తిరుగుతుండేవాడు. ఆ పనిమీదే తాను పనిచేసే ఆఫీసుకి కూడా వస్తుండేవాడు.డిటెక్టివ్ ఏజన్సీ కావడంతో క్రయిం వార్తల తాలూకు వివరాలకోసం అనంత్ దాదాపు రోజూ ఆఫీసుకి వస్తుండేవాడు. అతనికి ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్ అంటే ప్రాణం. తన సమయంలో ఎక్కువ భాగాన్ని దానికే కేటాయించేవాడు.

ఆ ఆఫీసులో మోహిని ఒక్క టైపిస్టుగానేగాదు, టెలిఫోన్ ఆపరేటర్ పనితోబాటు ఆఫీసు ఇతర వ్యవహారాలు కూడా చూసేది. ఆమె సీటు ఎంట్రన్స్‌లోనే ఉండేది.

అనంత్ రావడమే తుఫానులా వచ్చేవాడు. డోర్ తెరిచి లోనికి రాగానే మోహిని కనిపిస్తుంది.

'హలో' అంటూ నవ్వుతూ ఆమెవైపు చెయ్యి వూపి, అంతే వేగంతో లోనికి వెళ్ళిపోయేవాడు. అనంత్‌వైపు నవ్వుతూ చూసేది మోహిని. కాని అది అతని దృష్టికి వచ్చేదికాదు. అప్పటికే అతను వెళ్ళిపోయి ఉండేవాడు. అంత వేగంగా పనిచేసేవాడు. తిరిగి వెళుతూవెళుతూ డోర్ తెరుచిపట్టుకుని ఒక్కక్షణం ఆమెవైపు చూసి 'బై' అంటూ చెయ్యి గాలిలోకి ఊపి వెళ్ళిపోయేవాడు. ఇంతకుమించి అతను ఆమెని ఒక్కసారి కూడా పలకరించేవాడుకాదు.

మోహినికి అతనంటే క్రమేపీ సదభిప్రాయం ఏర్పడసాగింది. తనకి తెలీకుండానే అతనికోసం మనస్సు ఎదురుచూసేది. అతను వచ్చాక గుండెలో ఎందుకో గుబులుగా ఉండేది. అతను అక్కడ ఉన్నంతసేపూ ఆమెకి ఏపనీ చేయాలనిపించేదికాదు. మళ్ళీ ఎప్పుడు తిరిగి వెళూతూ కనిపిస్తాడా అని ఉబలాటపడేది. తీరా అతను క్షణంలో మెరుపులా మాయమయ్యేవాడు. మళ్ళీ రేపటికోసం ఎదురుచూపులు.

ఇలా నెలలు గడిచాయి.

ఓసారి వారంరోజులపాటు అనంత్ ఆ దరిదాపులకి రాలేదు. మోహిని ప్రతిక్షణం ఎదురుచూస్తూ గడిపేది. రోజు గడిచేకొద్దీ ఆమెలో నిరాశానిస్పృహలు ఎక్కువ కాసాగాయి.

ప్రతినిముషం మనస్సు అతని గురించే ఆలోచించసాగింది. కన్ను తెరిచినా మూసినా అతని రూపమే కనిపించేది. రెండుపూటలా అన్నం తినాలనిపించేదికాదు. తనకి తెలీకుండానే మనస్సు పూర్తిగా అతని వశమైందని దీంతో తెలిపోయింది. ఈ సంగతి అతనికి కూడా తెలీదు.

అపమార్గంలో పోతున్నానేమోనన్న భీతి లోలోన హెచ్చరిస్తోంది. ఈ పరిణామం చివరికెట్లా మలుపు తిరుగుతుందోనన్న సంశయం పట్టి పీడించసాగింది. అతన్ని మర్చిపోదామని ఎంతగా ప్రయత్నించినా ఆమెవల్ల కావడంలేదు.

ఓరోజు ఆఫీసులో యధాలావంగా టైపింగ్ చేసుకుంటూ కూర్చునుండగా ఎదురుగా ఉన్న డోర్ విసురుగా తెరుచుకున్నట్టు అనిపించి తలెత్తి చూసింది.

ఎదురుగా అనంత్!

ఆమె గుండె ఒక్కసారిగా వేగంగా కొట్టుకోసాగింది. మనస్సు ఎక్కడెక్కడికో తేలిపోయింది. టైప్ మిషన్‌మీద చేతివేళ్ళు అచేతనంగా ఉండిపోయాయి.

మోహిని కళ్ళల్లో కొత్తకాంతి వచ్చింది. తనకి తెలీకుండానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చాలా కాలం తర్వాత తన అప్పుణ్ణి చూశానన్న భావన ఆమెని నిలువెల్లా పులకరింపచేసింది.





''ఇన్నాళ్ళూ ఎక్కడికెళ్ళారు?'' మోహిని
ాన్ను గోముగా, నిష్ఠూరంగా ప్రశ్నించింది.
ు ఆ ప్రశ్న ఆమె పెదాలుదాటి బైటికిరాలేక
ుయాయి. సహజ సిద్ధమైన బిడియం ఆ
ాలని కట్టి ఉంచింది.

ఒక్కక్షణమాగితే ఆ ప్రశ్న తనపెదాలుదాటి
అతని గుండెల్లోకి వెళ్ళి ఉండేదన్న భావనరా
గానే మోహిని గుండె ఝల్లుమంది. ఏమిటి
తనిలా అయిపోతున్నది? అనంత్ విషయంలో
తన ప్రమేయం లేకుండానే తన మనసెందు
కిలా కళ్ళెంలేని గుర్రమే అవుతుంది?

తలెత్తి అనంత ముఖంలోకి చూస్తూనే ఇవ

న్నీ ఆలోచిస్తోంది. క్షణాలు దొర్లుతున్నాయి. రెండు నిముషాలు గడిచాయి.

అనంత్ అక్కడినుంచి కదలడేం?

మామూలుగా అయితే ఒక్కక్షణంలోనే ఉప్పెనలా దూసుకెళ్ళేవాడు! మరి ఇప్పుడో?

ఈ వారంరోజులూ తన మాదిరిగానే అతనూ తనకోసం తపించాడా? ఈ ఆలోచనే ఎంతో హాయిగా ఉందామెకి?

అనంత్ మోహిని టేబుల్ ఎదురుగా ఆగాడు.

'హలో' చిరునవ్వు అతని సహజత్వానికి చిహ్నం.

మోహిని కళ్ళు కాంతితో తళుక్కుమంటున్నాయి.

'హలో' అంది మెల్లిగా.

"ఎలా ఉన్నారు?" అనంత్ చాలా సౌమ్యంగా ప్రశ్నించాడు.

బాగానే ఉన్నాను అన్నట్టు ఆమె మౌనంగా తలూపింది.

బ్యాగ్‌లోనుంచి అనంత్ స్వీట్ ప్యాకెట్ ఒకటితీసి ఆమెకి అందించాడు.

"ఇవ్వాళ నా బర్త్‌డే"

ప్యాకెట్ అందుకుంది మోహిని. కంగ్రాచ్యులేషన్స్ చెప్పడం మర్యాద. కాని పరాయివ్యక్తి మాదిరిగా నోటిమాటతో "కంగ్రాట్స్' చెప్పడమంటే ఆమెకి ఏదో వెలితిగా ఉందనిపించి నోరు తెరవలేదు.

మోహిని మాటకోసం ఓ నిముషం ఎదురుచూశాడు అనంత్!

ఆ తర్వాత అతనే పెదవి విప్పాడు.

"విష్ మీ మెనీమెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ దిస్ డే!" నన్నగా నవ్వాడు. ఆమెకీ నవ్వాగలేదు. ముత్యాలు దొర్లించినట్టు నవ్వేసింది.

"కంగ్రాచ్యులేషన్స్" అని చెప్పకతప్పిందికాదు.

అక్కడినుంచి అనంత్ లోనికి వెళ్ళిపోయాడు.

ఇన్నాళ్ళూ తనని ఆవరించిన నిస్సత్తువ ఒక్కసారిగా ం ...ంది.

నూతనోత్సా... ంతా పరవళ్ళు తొక్కుతోంది.

అనంత్ లోప... సేపూ ఆమె మనను ఆకాశంలో గా... అయింది.

అరగంట తర్వా... వెళుతూ వెళుతూ మరోసారి విష్... మరుగయ్యాడు.

ఆ తర్వాత ఓ పది... మళ్ళీ కనిపించలేదతను. ఈసారి ఆ... ఓపికపట్టలేకపోయింది.

అనంత్ పనిచేసే ...కి ఫోన్‌చేసింది. రెండుమూడుసార్లు ...శాక అతను కలిశాడు.

'మా ఆఫీసుకి ఎందుకు ...లేదు మీరు?' అంటూ డొంక తిరుగు... డిగింది.

'పనిబడితేగదా వచ్చేది' ... యథాలాపంగా.

ఓ క్షణం ఆలోచించాక ఆ... అనుమానం తలెత్తింది.

'ఔను... మీ బాస్ కనుక్కోమ...

"అబ్బే... అదేంలేదు. నేనే అడి... కే.... కనుక్కుందామని..." తర్... టక్కున ఫోన్ క్రెడిల్‌చేసింది.

మర్నాడు అనంత్ మోహినివాళ్ళ ... వచ్చాడు. అప్పటికే మోహిని అతనికోసం ...రు ఒకటి సిద్ధంచేసి వుంచింది. అనతను ప్రేమిస్తున్నట్టు వుత్తరం రాసిపెట్... అందులో. తనకి ఇంతటి పిచ్చి ధైర్యం వచ్చిందో మోహినికి ఆశ్చర్యంగావుంది. ...సేపు ఆలోచించినా ఒక్కటే సమా... ఎదుట నిలుస్తోంది.

తన మనసుని అనంత్ పూర్తిగా వశప... కున్నాడు. అతని ఆకర్షణే తనచేత చేయిస్తోంది.

మోహిని ఇచ్చిన కవరుమీద అడ్రస్... డు. తన పేరుమీదేవుంది. 'ఎవరి... అని అడిగాడు యధాలాపంగా.

'నేనే' బదులిచ్చింది ఆమె.

అక్కడే కవరుచింపబోయాడు వు... చదివే వుద్దేశంతో. మోహిని వారిం... ఇంటికెళ్ళాక చదువుకోమని సలహా ఇచి... అతనికేమీ అంతుచిక్కలేదు. మోహి...




అదోరకంగాచూసి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రెండోరోజు మధ్యాహ్నంపూట అతను రాలేదుగాని అతని దగ్గర్నుంచి ఫోన్‌వచ్చింది.

ఫోన్ మోగగానే రిసీవర్ తీసి 'హలో' అంటూ రిసీవ్‌చేసుకుంది. 'హలో సర్... ఎవరు కావాలి?' అంటూ ఇంగ్లీషులో అడిగింది.

'ఐ వాంట్ మోహిని'

అవతలి గొంతుని మోహిని వెంటనే పసిగట్టేసింది.

ఒక్కనిముషం ఆమెకి మాటలు పెగల్లేదు.

నిన్నతానిచ్చిన వుత్తరానికి అతని ప్రతిస్పందన ఎలా వుంటుందోనన్న విషయమై రాత్రి తెల్లవార్లూ ఆందోళనతోనే గడిపింది. ఫోన్‌లో ఏమి చెబుతాడో వినాలని ఆతృతగా వుందామెకి.

'మీ వుత్తరం చదివాను'

'థాంక్యూ'

'నేను చాలా లక్కీఫెలోని'

మోహినికి అర్థమైపోయింది. సస్పెన్స్ తొలగిపోయింది. తన ప్రేమని అతను ఆహ్వానిస్తున్నాడు.

'నేనంటే మీకు ఎంత ఇష్టమో మీరన్నా నాకూ అంతే'

మోహిని మనస్సు పురివిప్పిన నెమలే అయింది.

'సాయంత్రం మీ డ్యూటీ అయ్యేవేళకి బయట మీకోసం వెయిట్ చేస్తుంటాను' అనిచెప్పి ఫోన్ కట్‌చేశాడు.

★ ★ ★

మోహిని అనంత్ దాదాపు ప్రతి సాయంత్రం కలుసుకునేవారు. చాలాసేపు అలా నడుచుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళేవారు. ఇద్దరూ చాలా సన్నిహితులయ్యారుగానీ మోహిని సంతోషం ఎంతోకాలం నిలవలేదు. ఆమె తల్లిదండ్రులు ఓ సంబంధం చూశామంటే మోహిని అనంత్ విషయం చెప్పింది. కానీ సనాతన ఆచారాలే ఆరోప్రాణంగా బతుకుతున్న ఆ ముసలివాళ్ళు మోహిని ప్రేమని హర్షించలేదు. కులాల పట్టింపు మోహిని పాలిట శాపమైంది. 'గతిలేక పొట్టకూటికోసం నౌకరీకని బైటికి పంపితే నువ్వు చేసే నిర్వాకం ఇదా' అంటూ తల్లిదండ్రులు ఆమెమీద విరుచుకుపడ్డారు. ఆమెచేత వుద్యోగం మాన్పించారు.

ఏమాత్రం వ్యవధిలేకుండా ఆమె పెళ్ళి జరిపించారు. మోహినికి మంచి ఆస్తిపరుడే భర్త అయ్యాడు. పైసా కట్నం తీసుకోకుండా పెళ్ళి ఖర్చులు కూడా అతనే భరించాడు. అందుకే తలవని తలంపుగా మోహినిని అతని చేతిలో పెట్టేశారు. ఆమె తల్లిదండ్రులు పెద్దగా కష్టపడాల్సిన అవసరంలేకపోయింది.

అనంత్ మోహిని కోసం ఆఫీసుచుట్టూ చాలాసార్లు తిరిగాడు. చివరికి ఆమె ఇంటి అడ్రస్ సంపాదించి ఇల్లు వెతుక్కుంటూ వెళ్లాడు. ఇంటికి తాళంవేసివుంది. పక్క ఇంట్లో వాకబుచేస్తే మోహినికి పెళ్ళయిందని చెప్పారు. ఓ వారం క్రితమే ఆ ముసలివాళ్ళిద్దరూ చిన్నకూతుర్ని తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయారుట.

ఆ తర్వాత ఇక మోహినిని కలుసుకోలేకపోయాడు అనంత్. ఆమె ఎక్కడవుందో, ఎలా వుందో కూడా అతనికి తెలీదు. ఇన్నేళ్ళ తర్వాత మళ్ళీ ఇద్దరూ ఒకరికొకరు తారసపడ్డారు.

గతం గుర్తుకురాగా మోహిని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. అమ్మానాన్న గుర్తొచ్చారు. తన ఇష్టాఇష్టాలకన్నా వాళ్ల విశ్వాసాలకే ప్రాముఖ్యమిచ్చి తన మనస్సుకు కళ్లెంవేసి వాళ్లు సాధించిందేమిటి?

తన వైవాహిక జీవితం గురించి పూర్తిగా తెలీకముందే కన్నుమూశారు. ఎటొచ్చీ తన జీవితమే కుక్కలు చింపిన విస్తరి అయింది. అనంత్ మనస్సుని గాయపరిచిన పాపం మిగిలింది.

ఎవరో వస్తున్న అలికిడి అవడంతో మోహిని పైటచెంగుతో కళ్లు తుడుచుకుంది.

అనంత్ అప్పుడే స్నానంచేసివచ్చాడు. ఆమె ఎదురుగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు.

"రైల్వే స్టేషన్లో నీమీద చెయ్యేసినందుకు బాధపడ్డావా?"

అనంత్ ఇలా సూటిగా అడిగేసరికి ఏం

సమాధానం చెప్పాలో ఆమెకి అర్థంకాలేదు. నిజానికి ఆ సంగతి మోహిని అప్పుడే మరిచిపోయింది. ఇలాంటివి ప్రస్తుతం ఆమె జీవితంలో సాదాసీదా వ్యవహారాలు.

మోహిని నుంచి సమాధానం రాకపోవడంతో అనంత్ నిరాశ చెందాడు. "సారీ మోహిని! హఠాత్తుగా నువ్వు కనిపించేసరికి ఆ క్షణం నాలో విచక్షణాజ్ఞానం నశించింది. నువ్వింకా నాదానివేనన్న భ్రమలో ఉచితానుచితాలు మరిచి ప్రవర్తించాను" అతని కళ్లల్లోనూ, మాటల్లోనూ పశ్చాత్తాపం కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది.

మోహిని ఈసారి నవ్వకుండా వుండలేకపోయింది. ఆ నవ్వులో మోహిని ఆత్మఘోష వుంది.

మోహిని అలానవ్వడం అనంత్‌కి ఇబ్బందిగా వుంది.

కాని ఆమె అంతరాంతరాల్లో ఏడుపు పొర్లివస్తున్న సంగతి అతనికి తెలీదు.

"అనంత్ ... పిల్ల లెంతమంది నీకు?" చాలా సాదాసీదాగా అడిగింది మోహిని.

"కాపురం అంటూ వుంటేగదా ... కన్నబిడ్డలు వుండటానికి" పెదవి విరుస్తూ చెప్పాడు.

"అదేం? ... నువ్వు అప్పట్నుంచీ పెళ్ళి చేసుకోలేదా?"

లోలోన మోహిని గుండె బద్దలవుతోంది. ఆనాడు తను చేసిన ఆ పాపానికి అనంత్ ఇంతటి ఘోరశిక్షననుభవిస్తున్నాడేమోననిపించేసరికి ఆమె గుండెనెవరో సూదులతో గుచ్చుతున్నట్టు బాధేసింది. నిముషం తర్వాత అనంత్ ఆగిఆగి చెప్పుకొచ్చాడు.

మోహిని పెళ్ళయ్యాక ఓ సంవత్సరానికి అతను పెళ్లిచేసుకున్నాడు. ఆ అమ్మాయి పేరు మాలతి. పేరుకే విద్యావంతురాలు. అంతకుమించి ఏమాత్రం గుణవంతురాలు కాదని తొందర్లోనే తెలిసొచ్చింది.

వృత్తిరీత్యా అనంత్ ఎక్కువ సమయాన్ని ఆఫీసు వ్యవహారాలకే కేటాయించేవాడు. పొద్దున్నేలేచి పొలోమంటూ ఊరిమీదపడితే మళ్లీ కొంపకిచేరడం రాత్రిళ్లే. మాలతికి ఇది నచ్చలేదు. ఈ చిన్నకారణంపై మొగుడు తనకి నచ్చలేదని అనంత్‌నుంచి విడాకులు తీసుకుంది. ఆ తర్వాత అతనిక పెళ్లి ప్రయత్నం చెయ్యలేదు.

గతం పట్ల మోహిని పశ్చాత్తాపం చెందింది. అనంత్ చెప్పింది విని చాలాబాధపడింది. ఆనాడు తల్లీదండ్రీ మాటకి కట్టుబడి అనంత్‌ని నిర్లక్ష్యంచేయాల్సి వచ్చినందుకు క్షమాపణచెప్పింది. అందుకు తాను ఆ వెంటనే అంతకు అంత అనుభవించానని, ప్రస్తుతం తానింకా ఆ శిక్షాకాలంలో వున్నానని మోహిని అన్నది. తన జీవితం ముగిస్తేకాని ఆ శిక్ష పూర్తికాదని కూడా చెప్పింది.

అనంత్ ఆమె ముఖంలోకి అనుమానంగా చూశాడు. ఆమె చెప్పిందంతావిని ఒక్కసారి ఖంగుతిన్నాడు.

అల్లుడు ఆస్తిపరుడని అమ్మానాన్న మురిసిపడ్డారేగాని అతని గతజీవితం గురించిగానీ, గుణగణాల గురించిగానీ ఏమాత్రం పట్టించుకోలేదు. భర్తకి తెలీని దుర్వ్యసనం అంటూ ఏదీలేదని పెళ్లయిన వారంలోనే మోహినికి తెలిసొచ్చింది. నెలతిరక్కముందే మరో కఠోరసత్యం బైటపడింది. సొంత వ్యాపార ప్రయోజనాలకోసం పెళ్లాన్ని ఫణంగాపెట్టడం అతనికి సర్వసాధారణమైన విషయమని తెలిసేసరికి మతిపోయినంత పనయింది. తనను బలిపశువుని చేశాడు. తనకి తెలీని సరికొత్త వాతావరణంలోకి ఆమెని దించాడు. ఆరోజు కన్న తల్లిదండ్రులకి ఎదురుచెప్పలేని తన బలహీనతే కట్టుకున్న భర్తకీ లాభించింది. అలా నాలుగేళ్లు గడిచాయి. అప్పటికే ఆ రొంపిలో తాను పూర్తిగా కూరుకుపోయింది.

మరోవంక చెల్లెలు మందాకిని కూడా విధివంచితురాలిగా మిగిలిపోయింది. ప్రేమించానని, పెళ్లిచేసుకుంటానని ఒకడు నమ్మించి బొంబాయి తీసుకెళ్లి ఓ నైట్ క్లబ్‌లో అమ్మేశాడు. ఆమె అలా దిక్కుతోచని పరిస్థితుల్లో అక్కడే డాన్సర్‌గా జీవితం ప్రారంభించింది.

అయిదేళ్లక్రితం గుండెపోటుతో మోహిని భర్త మరణించాడు. అతను చనిపోయేనాటికి ఆస్తి చిల్లిగవ్వమిగల్లేదు. ఇక మోహినికి బతుకే భారమైంది. ఆ పరిస్థితుల్లోనే వీరభద్రం తటస్థించాడు.

మనిషి జీవితంలో నిజంగా ఇన్ని నుడి




గుండాలుంటాయంటే తానెప్పుడూ నమ్మేవాడుకాదు. అలాంటిది ఇప్పుడు మోహిని చెప్పిందంతావిన్నాక అనంత్ నమ్మలేకుండా వుండలేకపోతున్నాడు.

ఫోన్ మోతవిని మోహిని లేచివెళ్లి ఫోన్ అందుకుంది. వీరభద్రంనుంచి ఫోను.

ఓ గంటలో చెల్లెల్ని తీసుకువస్తానని చెప్పి ఫోన్‌పెట్టేసింది.

★ ★ ★

గవర్రాజు పర్యటన మూడు మీటింగులూ, అరవై పూలదండలుగా వర్థిల్లుతూ సాగిపోతోంది. అప్పుడే అయిదురోజులు గడిచిపోయాయి.

ఇప్పటివరకు నాలుగుపట్టణాల్లో మొత్తంమీద పదహారు బహిరంగసభలు జరిగాయి. ఛోటానాయకులు ఏర్పాటుచేసిన వీధి సమావేశాలకు కొదవేలేదు.

కనకారావు, గణపతిరావు, అప్పలనాయుడు తమతమపట్టణాల్లో గవర్రాజుకి పోటీలుపడి ఘనంగా ఏర్పాట్లుచేశారు. వాళ్ళు అంతగా కష్టపడటంచూసి గవర్రాజులోలోన ముచ్చటపడ్డాడు. ఆ ముగ్గురికీ ఒకరిమీద మరొకరికి ఎంతఅక్కసు, ఈర్ష్యాద్వేషాలున్నాయో దీన్నిబట్టి తెలుస్తోందనుకున్నాడు గవర్రాజు.

రేపటినుంచి సొంతపట్టణంలో పర్యటించాల్సివుంది. ఈ ఆలోచనరాగానే గవర్రాజుకి త్రివిక్రమరావు గుర్తొచ్చాడు. అతను ప్రతిపక్షనాయకుడు. ఇద్దరిదీ ఒకేవూరు. స్థానికరాజకీయాల్లో వీళ్ళిద్దరూ మొదటినుంచీ ప్రత్యర్థులుగానే ఎదుగుతూ వచ్చారు.

త్రివిక్రమరావుకి మంచి పలుకుబడి వుంది. పాతికేళ్ళ అనుభవంవుంది. రాజకీయచతురతలో గవర్రాజుకంటె నాలుగు ఆకులు ఎక్కువే చదివాడు. కాకపోతే అతనికి కాలంకలిసిరాక ఏపదవినీ చేజిక్కించుకోలేకపోయాడు. అయినా ప్రతిపక్షనాయకునిగా అతనికి గుర్తింపువుంది. వచ్చిన ప్రతిచిన్న అవకాశాన్ని ఆచితూచి వాడుకోవడం అతని ప్రత్యేకత.

గవర్రాజు బలహీనతలు త్రివిక్రమరావుకి కొట్టినపిండి. అవసరమైతే ఎదుటివారి వ్యక్తిగతబలహీనతలను సైతం తన స్వార్థానికి వినియోగించుకునేందుకు త్రివిక్రమరావు ఏమాత్రం వెనుకాడడు. ఈ సంగతి గవర్రాజుకి బాగా తెలుసు. అందుకే సొంతవూళ్ళో తన కార్యక్రమం ఎలావుండాలన్న విషయమై చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఇప్పటివరకు పూర్తయిన పర్యటన ఒకఎత్తు, మిగతా రెండురోజుల కార్యక్రమం ఒకఎత్తు. ఇంతవరకు స్వాగతాలు, సత్కారాలు, అశేషజనసందోహాలకు కొదవలేదు. చివరిమజిలీకూడా సాఫీగా ముగిస్తే పర్యటన విజయవంతమైనట్లే. మోహినిమెడలో రవ్వలనెక్లెస్ అతని కళ్లముందు మెదిలింది.

మోహిని గుర్తురాగానే గవర్రాజు వెన్నులో చలిమొదలైంది. అయిదురోజులనుంచీ క్షణం తీరికలేదు. పగలంతా తిరిగితిరిగి ఒళ్ళుబడలిక చేసింది. మళ్ళీ రేపటినుంచి సొంతవూళ్ళో చాలాబుద్ధిగా వుండాలి. ఈరాత్రి అతని శరీరంసుఖం కోసం తపిస్తోంది. ఇన్నేళ్ళుగా మోహిని తన అవసరాలు తీరుస్తోంది. నాలుగురోజులు ఆమెదగ్గర లేకపోయేసరికి ఆమె అవసరం మరీ తెలిసొచ్చిందతనికి. తన మనసులోమాట సర్కిల్‌ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్‌కి మధ్యాహ్నమే తెలియజేశాడు. ప్రభాకర్‌కి ఇలాంటివి కొత్తకాదు. పైగా ఈ వ్యవహారాల్లో ఆరితేరినవాడు కూడా.

ఇంతలో ఫోన్ మోగింది. ఆలోచనలనుంచి తేరుకుని గవర్రాజు రిసీవర్ అందుకున్నాడు.

అవతలినుంచి మోహిని గొంతు వినిపించింది.

"వాట్ డియర్...నేను అసలు గుర్తున్నానా?"

ఆమె నవ్వుతూనే అడిగినా, గవర్రాజు కొంచెం తడబడ్డాడు.

"అదేమిటోయ్ - అలాఅడుగుతావ్? సూర్యచంద్రులు వెలిగినంతకాలం నువ్వు నాగుండెల్లో గూడుకట్టుకునే వుంటావు...తెలిసిందా?"

"మనిషి ఎదుట కనిపిస్తేనే మీకబుర్లన్నీ"

"అదేంలేదోయ్...నీకు తెలుసుగదా - నేను ఏపనిమీద ఇక్కడికొచ్చానో. రాత్రింబవళ్ళు ఒకటే తిరుగుడు"

"తిరుగుళ్ళా...ఎవరితో?"

"అదిగదుగో...మళ్ళీ శంకిస్తున్నావ్. నాకు

ఇప్పటికే పెళ్ళిఅయింది గాబట్టిగానీ లేకపోతే శ్రీరామచంద్రుడికోవకి చెందాల్సినవాణ్ణి''

''సరదాకి అన్నానుగానీ ఎలావుంది మీ ప్రోగ్రాం?''

''భేషుగ్గా సాగిపోతోంది. ఇంకా రెండురోజులు ఓపికపట్టు''

''మీ పథకం క్లిక్ అయిందంటారు!''

''అషామాషీ క్లిక్‌కాదు-సూపర్‌క్లిక్''

''నిజంగా మీరు మేధావులేసుమండీ. అందుకే మీరు దొరకడం నా అదృష్టం అనిపిస్తూ వుంటుంది ఒక్కోసారి''

''అందుకేనేయ్-నువ్వంటే నేను పడిచచ్చేది. పతివ్రతలకోవలోనే నువ్వుతప్పుబుట్టావ్''

''మీ పలుకులువిని ఎన్నో నెలలైనట్టుందండీ''

''అదేంకాదు-నామీద నీకున్న ప్రేమ అలా అనిపిస్తుందంతే''

''ఇంకా రెండురోజులు గడపాలి. రెండు యుగాలంత భారంగా గడుస్తాయి''

''అలా అనుకుంటే ఎలాచెప్పు. కొన్ని కావాలనుకున్నప్పుడు మరికొన్ని వదులుకోవాలి. రవ్వలనెక్లెస్‌ని తలుచుకుంటూ గడిపెయ్''

''ఆఁ...పెద్ద...ఆఫ్టరాల్- రవ్వలనెక్లెస్‌కోసం 'రాజువెడలె రభసకు...' అన్నట్టు మీరు ఇంతగా ఒళ్ళు విరగ్గొట్టుకోవాలా?''

''ఔనేయ్...మనమేమన్నా స్మగ్లర్లమా, బంది పోటుదొంగలమా? ఒళ్ళువంచకుండా సంపాదనకి మరిగితే జనం ముక్కలువిరగదంతారు. ఆఁ... ఈ గొడవకేంగానీ ఇంకేమిటి సంగతులు?''

''రాత్రిళ్ళు బాగా నిద్రపడుతోందా?''

''ఏం? సలక్షణంగా పడుతోంది'' టక్కునజవాబిచ్చాడు.

''నేనులేకపోతే అస్సలు నిద్రేపట్టదని నాదగ్గర చిలకపలుకులు పలుకుతావే, అంటే... అక్కడ ఎవరన్నా...?''

''ఛీ ఛీ...ఏదో నీవెంటపడ్డానుగదాని నువ్వు మరీ ఇంతఅలుసుగా మాట్లాడటం ఏం బాగాలేదోయ్. పగలంతా ఒకటే ప్రయాణం... సభలు... ఉపన్యాసాలు... ఒళ్ళంతా ఒకటే బడలిక-మరి రాత్రిళ్ళు నిద్రపట్టకచస్తుందా?''

''మరి ఎందుకు అంతగా ఒళ్ళు విరగ్గొట్టుక్కోవడమూ, నోరుపారేసుకోవడమూను?''

''ఆఁ... అంతా ఉపన్యాసాలే. ప్రజాస్వామ్యం, సోషలిజం... ఎంతసేపుకొట్టుకున్నా వీటితోనే''

''అన్నట్టు అసలువిషయం మరిచిపోయాను''

''ఏమిటి సంగతి?''

''ఏంలేదూ... బొంబాయినుంచి మా చెల్లెలు వచ్చింది''

''ఏమిటి...ఇంత హఠాత్తుగా వూడిపడింది?''

''నన్ను చూడాలనిపించిందట-వచ్చేసింది. నేను ఈ పట్టణంలో, అందులోనూ మీతో మకాంపెట్టినతర్వాత ఇంతవరకు రాలేదు. ఇంట్లో డబ్బులులేవు. సరదాగా బైటికివెళితే తను షాపింగ్ అన్నదనుకోండి. మనం మంచి పొజిషన్‌లోవుండి, మన ఇంటికొచ్చినప్పుడు దానిచేత ఖర్చుపెట్టిస్తే ఏంబావుంటుంది-చెప్పండి''

''అవునవును...ఇంతకీ ఎంత అవసరమవుతుంది?''

''అయిదారువేలన్నావుంటే...''

''భరత్‌కి ఫోన్‌చేసి ఓపదివేలు పంపమని చెబుతాను...సరేనా?''

''ఓకే... అన్నట్టు మీ ఆఫీసులో వేసిన కొత్తసోఫాసెట్లు చాలా బాగున్నాయి. చూడండీ ... కాస్త అవికూడా...''

''అవిమన ఆస్తికాదు''

''మీకోసం ఇచ్చినవేగా''

''అవుననుకో. చివర్లో వాటిని మళ్ళీ ప్రభుత్వానికి అప్పగించాలి తెలుసా?''

''వాడినకొద్దీ వస్తువులు పాడైపోవడం సహజం. అప్పుడు ఈమాటే చెప్పొచ్చులెండి''

''మొత్తానికి బాగా తర్ఫీదు అయినావ్''

''మీ సాహచర్యంలో ఈమాత్రం కూడా కాకపోతే మీకేతలవొంపులు''

''సరేలే...ఇప్పుడే భరత్‌కి ఫోన్‌చేసి చెబుతా-సరేనా?''




ఛాలెన్స్యా

"ఉంటానుమరి"

"ఒకే" మోహిని ఫోన్‌పెట్టేసింది.

ఆవెంటనే గవర్రాజు భరత్‌కి ఫోన్‌చేశాడు. మోహిని చెప్పినప్రకారం ఆజ్ఞలు జారీచేశాడు.

అప్పటికి రాత్రి ఏడుగంటలవుతోంది. గవర్రాజు మనస్సు విశ్రాంతికోరుతోంది. ఇంతలో ఆయన సొంతవూరినుంచి అస్మదీయులు వచ్చారు. వారికి కొంతసమయం కేటాయించక తప్పలేదు.

తెల్లారితే సొంతపట్టణంలో సమావేశాలు!

మంత్రిగారికి చాలా ఆర్భాటంగా స్వాగతసత్కారాలు ఏర్పాటుచేసినట్టు వారు చెప్పారు. గవర్రాజు అదంతా ఓపిగ్గా విన్నాడు.

ఊళ్ళోరాజకీయాలగురించి చర్చించుకున్నారు. ముఖ్యంగా త్రివిక్రమరావు గురించి పదేపదే ఆరాతీశాడు.

త్రివిక్రమరావు క్రమేపీ బలపడుతున్నాడని వాళ్ళంతా అభిప్రాయపడ్డారు. ప్రస్తుతం గాలి అతనివైపే వీస్తోందని చెప్పారు.

గవర్రాజు నిరుత్సాహపడకపోలేదు. కాని అది బైటపడనివ్వకుండా జాగ్రత్తపడ్డాడు. పైగా అతని ధైర్యంవేరు.

రాజకీయాల్లో గాలివాటం సహజం. కొంతకాలం చీకటి, మరికొంతకాలం వెలుతురు - రాజకీయనాయకుల జీవితాల్లో బొమ్మాబొరుసుల్లాంటివి. ఈ మాత్రానికే కొంపలుమునిగిపోయినంతగా డీలాపడిపోనవసరంలేదని గవర్రాజు అభిప్రాయం. పైగా అతని చేతిలో అధికారంవుంది. ఇలాంటి పరీక్షాసమయాల్లో ఆ చక్రం అడ్డువేసుకోవచ్చు. ప్రతికూలపవనాలను అనుకూలంగా మలుచుకునేందుకు పదవి ఎంతైనా ఉపకరిస్తుందనేది గవర్రాజు అనుభవంతో నేర్చుకున్నాడు.

త్రివిక్రమరావు పెరగకుండా మేకుదించాలని గవర్రాజుకి వాళ్ళంతా సలహా ఇచ్చారు. ప్రస్తుతం తను జరుపుతున్న ఈ పర్యటనతో పరిస్థితి మారిపోగలదని గవర్రాజు అభయమిచ్చాడు.

రేపటిపర్యటన గురించి మంత్రిగారితో మరికొంచెంసేపు ముచ్చటించాక వాళ్ళు సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

డు. ఎనిమిదవుతోంది. ప్రభాకర్‌కి ఫోన్‌చేశాడు.



వీరభద్రం భూపాలరావుని పార్టీకి పిలిచాడు. అధికారపార్టీలో భూపాలరావు ఇప్పుడిప్పుడే పైకి వస్తున్నాడు. ఈసారి మార్పులంటూ జరిగితే ఆయనకి మంత్రి పదవి ఖాయం.

తను ప్రారంభించబోయే కొత్త వ్యాపారానికి భూపాలరావుని వాడుకోవచ్చునన్న ఆలోచన రావడంతో వీరభద్రం ఆయనతో దోస్తీకి ముందుకొచ్చాడు. ఆయన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకోవాలనుకున్నాడు.

ఇందుకుతగ్గట్టుగానే మందాకిని తారసపడింది. రెండురోజుల క్రితమే మోహిని, మందాకిని వచ్చి కలిశారు వీరభద్రాన్ని. మందాకిని నచ్చిందతనికి. ఆమెకి ఉద్యోగం ఖాయమైంది. పిలిపించినప్పుడు రమ్మనమని చెప్పి పంపేశాడు.

మోహిని ద్వారా గవర్రాజు తనకి అందుబాటులో ఉన్నాడు. ఇప్పుడు మందాకిని ద్వారా భూపాలరావు చేరువ అవుతాడు.

సరిగ్గా అనుకున్న టైముకే పార్టీ మొదలైంది.

వీరభద్రంతో స్నేహం, పెరుగుతున్న తన పలుకుబడికి చిహ్నంగా భావించాడు భూపాలరావు.

ఇద్దరూ డ్రింక్స్ తీసుకుంటున్నారు.

ఒకరికొకరు మనసు విప్పి మాట్లాడుకున్నారు. అప్పుడే రెండుగంటలు గడిచిపోయాయి. ఇద్దరూ లేచి డైనింగ్‌హాల్ వైపునడిచారు.



[illegible]

ఆమెవెంట మందాకిని కూడా ఉంది. అక్కాచెల్లెళ్లు ఇద్దరూ సింపుల్‌గా డ్రస్సప్ అయివున్నారు. ఇద్దరూ వీరభద్రాన్ని విష్‌చేశారు చేతులు జోడిస్తూ.

వాస్తవానికి వీరభద్రం వీళ్ళకోసమే ఎదురు చూస్తున్నాడు. భూపాలరావుతో పార్టీ నిర్ణయమయ్యాక మోహినికి ఫోన్‌చేసి చెప్పాడు ఫలానా టైముకి రమ్మనమని. మందాకిని బాధ్యతలేమిటో కూడా అప్పుడే వివరించాడు.

భూపాలరావుకి వీళ్ళిద్దర్నీ పరిచయంచేశాడు. అప్పటికే డ్రింక్స్ తీసుకుని ఉండటంవల్ల భూపాలరావు ఎక్కువగా మాట్లాడలేదు.

అరగంటకల్లా భోజనాలయ్యాయి. భూపాలరావు ప్రయాణమయ్యాడు.

'ఎనీహెల్ప్?' వీరభద్రం అడిగాడు.

వద్దనిగాని కావాలనిగాని భూపాలరావు ఖచ్చితంగా చెప్పలేకపోయాడు. ఒంటరిగా వెళ్ళాలనీలేదు. తోడుకావాలని అడిగే చొరవా లేదు. అందుకే నీళ్ళు నమిలాడు. పరిస్థితి గమనించిన వీరభద్రం-

"మందాకినీ ఆయన్ని డ్రాప్ చేసివస్తావా?" అంటూ అడిగాడు. నిజానికి అది ఆయన ఆర్డరు. మందాకిని తలూపింది. భూపాలరావు ముందునడిచాడు. వాళ్ళువెళ్ళిపోగానే వీరభద్రం మోహినిని అడిగాడు- "నీ చెల్లెలికి విషయాలన్నీ వివరంగా చెప్పావా?" చెప్పానని తలూపింది.

గవర్రాజు గురించి ప్రస్తావించాడు.

"ఎప్పుడొస్తున్నాడో తెల్సా?"

"రెండురోజుల్లో రావచ్చు"

"ఏమిటి నెలకోసారి జిల్లా యాత్రలు పెట్టాట్ట"...

-"ఎన్నికల స్టంట్ అయివుంటుంది" నవ్వేస్తూ చాలాతేలిగ్గా చెప్పేసింది. ప్రస్తుతం గవర్రాజు పెట్టుకున్న పర్యటన తనకోసమేనని ఏమాత్రం చెప్పలేదు. తానేదో దాస్తున్నానన్న అనుమానం కూడా రాకుండా జాగ్రత్తపడింది.

"ఆ కాంట్రాక్టు ఇంకా పూర్తికాలేదా?" మోహిని అడిగింది.

"ఎక్కడ్డ... పర్యటన కెళ్ళిరాగానే సంతకం చెప్తానన్నాడు"

"రాగానే కదిలించనా?"

"ఆ(... జాగ్రత్త... అనుమానంరాకుండా... అన్నట్టు నీకింకోపనిఅప్పజెపుతున్నాను. శ్రద్ధగావిను. ఈ కాంట్రాక్టుఖర్చులో పదిశాతం గవర్రాజుకి ముట్టజెప్పాలి. అదీ మూడుధపాలుగా. అనుకున్నప్రకారం నేను డబ్బులిస్తాను. వాటిని నువు మళ్ళీ రాబట్టాలి"

"అదెలా?"

"అంతావథకంవేసేవుంచాను. ఇందులో నీచెల్లెల్ని కూడా వాడుకోవాలి"

"నేనేంచెయ్యాలో చెప్పండి"

వీరభద్రం చెప్పిందంతా శ్రద్ధగా విన్నది మోహిని. అతని తెలివితేటలకి మనస్సులోనే జోహారులర్పించింది. ఎదుటివాళ్ళని తమ అవసరాలకి వాడుకోవడంలో వీరభద్రం, గవర్రాజు ఇద్దరికిఇద్దరూ ఉద్దండులే. వీళ్ళ దగ్గర నేర్చుకుంటున్న అనుభవ పాఠాలను తాను పైపైకి వెళ్ళాలన్న ఆలోచన ఆమెలో బలపడింది. ఇన్నేళ్ళుగా గవర్రాజు స్వార్థానికి ఉపయోగపడుతూవచ్చిన తాను ఇప్పుడిప్పుడే అతన్ని తన స్వార్థానికి వాడుకుంటోంది. రవ్వలనెక్లెస్‌కోసం గవర్రాజు పడుతున్నశ్రమే ఇందుకు ఉదాహరణ. గవర్రాజు కోటలో తన స్థానం క్రమేపీ బలపడుతోంది. దాన్ని మరింత సుస్థిరంచేసుకుంటే వీరభద్రాన్ని కూడా ఓ ఆట ఆడించవచ్చు. ఒకరిది అధికారబలం. మరొకరిది ధనబలం. ఈ రెండూ తన గుప్పిట్లో వుంటే...

మోహిని అలా చాలాదూరం. ఆలోచించింది. తన ఆశలసాఫల్యానికి అహర్నిశలు శ్రమించే ఓర్పు, నేర్పు ఆమెలోవున్నాయి. అందుకే వీరభద్రం అప్పగించిన తాజా బాధ్యతని తన భవిష్యత్తుకే సవాల్‌గా తీసుకున్నది. ఒకరికోసం మరొకర్ని మోసగించడం... ఇందులో ఆమెకి ఏదో తెలియని తృప్తి, సరదా. నీతిబాహ్యమైన ఈ వృత్తిలో తననితనే మోసగించుకుంటున్నానన్న ఏవగింపు కలగలిసి ఆమెలో పట్టుదలని మరింత పెంచాయి. మోహిని ఇక వెళతానని లేచింది. అందుకు జవాబుగా వీరభద్రం రెండువేలు ఇచ్చాడు. అవి తీసుకుని ఆమె వెళ్ళిపోయింది.

★ ★ ★

అనంత్ మొత్తంమీద రెండురోజులే

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచి మీ పాపాయికి. పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం** : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు. ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలు అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం** : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం** : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ. పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం** : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది. మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ. తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ. డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాల నించి




4 మాసాల నించి




6 మాసాల నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110 008



Nestlé

**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

పత్రికలో రిపోర్టర్‌గా ఉద్యోగంలో జాయిన్‌అయాడు.

రెండురోజులపాటు తనకి ఆతిథ్యం ఇచ్చినందుకు అనంత్ మోహినికి కృతజ్ఞతలు చెప్పాడు. అనంత్ ఇక్కడే సెటిలయినందుకు ఆమె సంతోషించింది. అనంత్ కొత్తఇంట్లోకి మారుతున్నప్పుడు మోహిని, మందాకిని కూడా వెళ్ళారు. ముగ్గురూ ఆపూటకి హోటల్‌లో భోజనంచేశారు.

మాటలమధ్యలో మోహిని అన్నది- "అనంత్... నేను ఖరీదైన జీవితాన్నే గడుపుతున్నా ఇంతవరకు గమ్యంతెలియని నావగానే వుండిపోయాను. నువు ఈ ఊరొచ్చాక నాకొక దిక్సూచి దొరికినట్టయింది. ఈపాడుజీవితానికి స్వస్తిచెప్పమంటున్నావుగదా, ఇంకొక్క సంవత్సరం ఆగు. దయచేసి ఒక్క ఏడాది వ్యవధి ఇవ్వు. నా జీవితగతినే మార్చుకుంటాను"

"మోహినీ! ఈరొంపిలోనుంచి బయటపడేందుకు ఏడాదికావాలా? నువు తలుచుకుంటే ఈ క్షణమే బైటపడగలవు!"

"అనంత్... ప్రస్తుతం నేను వీసమెత్తు విలువలేనిదాన్ని. ఈ మురికికూపం నుంచి బైటపడిన మరుక్షణం పొట్టనింపుకోవడమే కష్టమవుతుంది. ప్రస్తుతం నా పరిస్థితి ఇది"

"నువ్వలా ఎందుకనుకోవాలి? నేను లేనా?"

"నువ్వేంచేయగలవ్? ఎన్నాళ్ళు పోషిస్తావ్?"

"జీవితాంతం... నిన్ను పెళ్ళిచేసుకుంటాను"

అతనీమాట అంటాడని ఆమె ఏమాత్రం ఊహించలేదు. ఆ అనుబంధమేదో ఆదిలోనే తెగిపోయింది. ఆ తర్వాత మోహిని అనంత్‌నెప్పుడూ ఆ దృష్టితో చూడలేదు. అలాంటిది ఇప్పుడితను ఇలా అనేసరికి ఓ నిముషం పాటు ఆమె మాట్లాడలేకపోయింది.

"వద్దు అనంత్... దయచేసి నీలో ఆ ఆలోచనకి స్థానం ఇవ్వొద్దు. నీకొకసారి అన్యాయంచేశాను. నైతికంగా పతనమైన నేను నీదరిచేరి మరోసారి ఆ ఘోరాన్ని చెయ్యలేను" ఆమె ఏడవటం అనంత్ మొదటిసారిగాచూశాడు.

లేదు మోహిని. అంతా పరిస్థితుల ప్రాబల్యం. ఇందులో నీస్వార్థంకన్నా ఎదుటివారి స్వార్థమే ఎక్కువగావుంది. నీ జీవనవిధానంపట్ల నీలో పశ్చాత్తాపంవుంది- అదిచాలు"

"అనంత్... నువు నన్ను ఇప్పటికీ ఎలాప్రేమించగలుగుతున్నావ్?"

"ఆనాడు నువు నాలోరేపిన ఆశలఫలితం"

"నన్ను క్షమించు అనంత్... నేను పాపంచేశాను. ఘోరమైన తప్పిదంచేశాను. అందుకు ఇదుగో శిక్ష అనుభవిస్తున్నాను"

"శిక్షఅనితెలిసికూడా దీనినుంచి విముక్తి పొందాలని అనుకోకపోవడం అవివేకమే అవుతుంది తెలుసా?"

"అవును అనంత్... అవివేకమే అవుతుంది. కాని ఈ శిక్షే రేపటి నాజీవితానికి రక్షఅవుతుంది. అలామలుచుకోవడం వివేకమే అవుతుందిగదా!"

అనంత్ కనుబొమలు ముడిపడ్డాయి. మోహిని మాటల ఆంతర్యం అతనికి అర్థంకాకుండావుంది. తాము ప్రేమించుకున్న రోజుల్లో మోహిని ఎక్కువగా మాట్లాడేదికాదు. తనే ఏకబిగిని మాట్లాడేస్తుండేవాడు. అలాంటిది ఇప్పుడు మోహిని తనముందు జీవిత సారాన్నే విప్పిచెబుతోంది. తను శ్రోతగానే మిగిలిపోయాడు. మోహిని ఆలోచనల్లోనూ, వ్యవహారసరళిలోనూ ఇంతటి మార్పు రావడం అతనికి నిజంగా నమ్మశక్యంగాలేదు.

మోహినిమాటలు అర్థంకాక ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అవును అనంత్... నాజీవితం ఇప్పటికే ఒక చట్రంలో ఇమిడిపోయింది. దీన్నించి పూర్తిగా బయటపడటం అసాధ్యం. అందుకే నేను ఒక నిర్ణయానికొచ్చాను. ఇప్పుడున్న అవకాశాలను అనరాగాతీసుకుని నా భావిజీవనగతినే మార్చుకుంటాను. అది నీకు ఆనందమయమే అవుతుంది"

"ఏమిటా మార్పు... ఎలా సాధ్యమది..."

"చెబుతాను... సమయంవచ్చినప్పుడు చెబుతాను. నీకంటే ఆప్తులు నాకెవరూలేరు. నేను తలపెట్టిన ఈ మహత్కార్యానికి నీసహాయం ఎంతో అవసరం. నువు కూడా ఒక చెయ్యివేస్తే నేను అనుకున్నది సాధించడం




అనంత్ మనస్సు పరిపరివిధాల ఆలోచన లోపడింది.

★ ★ ★

మసకచీకటిపడుతున్న వేళ-

అనంత్ ఒంటరిగా ఫుట్‌పాత్‌మీద నడుస్తున్నాడు. చేతిలో సిగరెట్ కాలుతోంది. పక్కనవ చ్చేపోయే వాహనాల రణగొణధ్వనులు వింటూ ఆకాశంలో ఆకారాలను మార్చుకుంటున్న మబ్బుల్ని గమనిస్తూ నిదానంగా అడుగులేస్తున్నాడు. రెండురోజులనుంచి ఆఫీసుఛాయలకి వెళ్ళలేదు. ఎసైన్‌మెంట్ ఏదన్నా దొరుకుతుందేమోనని తెగఆలోచిస్తున్నాడు. అతనిదృష్టి అంతా ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగే. అతని జర్నలిస్టు జీవితమే దానితో ప్రారంభమైంది.

గతంలో వివిధ పత్రికల్లో పనిచేసిన అనుభవం వుంది. అతను డబ్బు మనిషికాదు. వృత్తిని పవిత్రంగా భావించేవాడు. పత్రికలు సమాజానికి స్వచ్ఛందసేవ చేయలేకపోయినా, కాకమ్మకథలతో పేజీలునింపే ధోరణికి పాల్పడకుండా, సమాజసంక్షేమానికి కొంతలో కొంతయినా దోహదపడాలని ఆశించే వ్యక్తిత్వం అతనిది. ఆ లక్ష్యంతోనే జర్నలిజంలో అడుగుపెట్టాడు. సమాజానికి శాపాలుగా మారిన అవినీతి, అక్రమాలపై ధ్వజమెత్తాడు.

వివిధ ప్రాంతాల్లో పనిచేస్తూ అక్కడి తెరచాటు వ్యవహారాల్ని ప్రజలకళ్ళముందు వుంచాడు. అతని స్కూప్‌లవల్ల సమాజానికి ఎదురుకాబోయే కొన్ని అవాంతరాలు తప్పిపోయాయి కూడా. ముఖ్యంగా రాజకీయరంగంలో అవినీతి, లంచగొండితనంమీద అతను తిరుగుబాటు బావుటా ఎగురవేశాడు. కనీసం ఓ అరడజనుమంది ప్రముఖుల్ని శంకరగిరిమాన్యాలు పట్టించిన ఘటికుడు అనంత్.

సిగరెట్ ప్యాకెట్ అయిపోయిందిగాని ఆలోచనలకు మాత్రం బ్రేకుపడలేదు. ఏపనీలేకపోతే అతనికి పిచ్చెక్కినట్టు వుంటుంది. కొత్తపత్రికలో చేరాక ఇంతవరకు రెండు: మూడు మంచి రిపోర్టులే ఇచ్చాడు. కాని అవి అతనికి ఏమాత్రం సంతృప్తినివ్వలేదు. జనాన్ని వూపే బాంబులాంటి వార్తకోసం అతని మెదడు ప్రతిక్షణం అన్వేషిస్తూనే వుంది. అలాంటి వార్తకోసం ఏ రంగాన్ని ఎంచుకోవాలన్నది అంతుతేలని ప్రశ్నగా మిగిలింది. ప్రస్తుతం అతనికి యాలు ఇంకా ప్రాథమికస్థాయిలోనే వున్నాయి. తనకి వేడివేడి వార్తలందించగల 'విశ్వసనీయ వర్గాలు' ఇంకా ఏర్పడలేదనే చెప్పాలి. ఈ పరిమితుల్లో వార్తా సేకరణను విస్తృతం చేయడం కష్టం. అందుకే ఏ రంగాన్ని ఎంచుకోవాలన్నది ముఖ్యమైన సమస్య అయింది.

బ్యూరోక్రసీ జోలికి ఇప్పుడప్పుడే వెళ్ళదలుచుకోలేదు. అధికారయంత్రాంగంలో ఉన్నతస్థాయిలో అత్యంత విశ్వసనీయవర్గాల ద్వారానే అవినీతి చీకటికోణాల్ని వెలుగులోకి తేవడం సులభమవుతుంది. ఆ స్థాయిలోనే డాక్యుమెంట్లతో సమస్తసాక్ష్యాధారాల్ని సేకరించే వీలుంటుంది. అట్టడుగుస్థాయిలో ఉద్యోగవర్గాలద్వారా కూడా కుంభకోణాల వివరాలు కూపీ లాగవచ్చుకానీ వాళ్ళు డాక్యుమెంట్లు ఇచ్చి చేతులు కాల్చుకునేందుకు సిద్ధంగా వుండరు. అలాంటప్పుడు చివరికి పత్రికల్లో వార్తవచ్చిన తర్వాత న్యాయపరమైన సమస్యలు తలెత్తితే చిక్కుల్లోపడాల్సి వస్తుంది. లిఖితపూర్వకంగా సాక్ష్యాలు చూపించలేనప్పుడు తిప్పలు తప్పవు. అందుకే అనంత్ ఉన్నతస్థాయిలోనే ఆ కుంభకోణాల్ని సేకరించి, పకడ్బందీగా ధృవపత్రాలతోసహా వార్తని సంధిస్తాడు. ఇక దానికి తిరుగేవుండదు. కొత్త వూరుకావడంతో ప్రస్తుతం తనకి ఇంకా కొంత సమయంపడుతుంది.

వ్యక్తిగతంగా అతనికి రాజకీయరంగంమీద ఆసక్తి ఎక్కువ. ఆ వార్తలతో జనాన్ని ఆకర్షించగలగడం ఒక ఎత్తు. అదీకాక వివిధరకాల వార్తలు ఆ రంగంలోనే దొరికే అవకాశం వుంది.

అనంత్ అలా దాదాపు పావుగంటసేపు నడిచాడు. ఇంతలో సెంటర్ వచ్చింది. ట్రాఫిక్ ఐలెండ్‌దగ్గర ట్రాఫిక్ సిగ్నల్స్‌మీద అతని దృష్టిపడింది. ఎదురుగా గ్రీన్ సిగ్నల్ అప్పుడే లైటు వెలిగింది- అనంత్‌కి ఆహ్వానం చెబుతున్నట్టుగా. యాంత్రికంగా ఫుట్‌పాత్‌దిగి అటువైపు నడవసాగాడు. ట్రాఫిక్‌లైట్స్ వెనకవైపు నాలుగంతస్థుల భవనం అతనికళ్ళని ఆకర్షించింది. అదొక పెద్ద బార్ అండ్ రెస్టారెంట్. నగరంలోకెల్లా అతిపెద్ద బార్ అని పేరుచది

...అతనికి గుర్తొచ్చింది. ఈ బారుగురించి ఫ్రెండ్స్ చెబుతుంటే అతను చాలాసార్లు విన్నాడు.

ఇంతటి ఖరీదైన బార్ నగరంలో మరేదీలేదు. వివిధవృత్తులవారికి, వారివారి అభిరుచుల్నిబట్టి అక్కడ ఏర్పాట్లుచేస్తారని విన్నాడు. ఒక్కో అంతస్థు ఒక్కో వర్గానికి ప్రత్యేకించి వుంచుతారని పేరుంది. డాక్టర్లు, లాయర్ల వంటి ప్రొఫెషనల్స్‌కి ఒక అంతస్థు; రాజకీయ ప్రముఖులకి ఒక అంతస్థు-- ఇలా ఒక్కో అంతస్థు ఒక్కొక్క విలక్షణమైన ప్రత్యేకత వుంటుంది ఆ బార్‌లో. ఈ వూరొచ్చాక ఇంతవరకు అనంత్ ఇటువైపు రాలేదు. ఓసారి ఆ బార్‌కి వెళ్ళాలనిపించింది. జేబులోనుంచి పర్స్ తీసిచూశాడు. అరొందలు మాత్రం వున్నాయి. ఫర్వాలేదు. ఎక్కువేమీలేకపోయినా సరిపోకుండా వుండదు అనుకుంటూ బార్‌వైపు నడిచాడు.

గ్లాస్‌డోర్ తెరుచుకుని లోనికి అడుగుపెట్టాడు. అదొక హాలు. నాలుగువైపులా సోఫాలు, ఈజీఛైర్లు, పూలకుండీలే కనిపిస్తున్నాయి. 'ఓ క్షణం కూర్చోండి' అని సూచిస్తున్న స్టిక్కర్లు గోడలనిండా అతికించి వున్నాయి. హాలులోకి అడుగుపెట్టీ పెట్టగానే అందరిదృష్టినీ ఆకర్షించేంత పెద్ద అక్షరాల్తో ఇంగ్లీషులోనూ, హిందీలోనూ రాసివున్నాయి. అనంత్‌వెళ్ళి ఓ సోఫాలో కూర్చున్నాడు. రెండు నిముషాల్లో అతనిదగ్గరకి ఓ వ్యక్తివచ్చాడు. ఫుల్‌సూట్‌లోవున్నాడు. అనంత్ ఎదుట వినయంగా వంగి అతనికో బుక్‌లెట్ అందించాడు. చదివి ''ఫస్ట్ ఫ్లోర్'' అన్నాడు అనంత్.

ఆ వ్యక్తి అనంత్‌ని సాదరంగా తీసుకెళ్ళి మొదటి అంతస్తులో దిగబెట్టాడు. అక్కడ ఒక పెద్దహాలు వుంది. ప్రతి రెండుగజాలకి టేబుల్, రెండు కుర్చీలు వున్నాయి. టేబుల్ టేబుల్‌కి మనుషుల ముఖాలు మాత్రం కనిపించకుండా ప్రత్యేక ఏర్పాట్లుచేశారు. అనంత్ మొదటివరసలో ఒకపక్కగా వున్న టేబుల్ని ఎంచుకున్నాడు. స్ట్రాంగ్ బీర్ ఒకటి తెప్పించుకుని, మెల్లగా సిప్‌చేస్తూ కూర్చున్నాడు. చాలాసేపు నడవడంవల్ల ఎ.సి.గాలి ప్రాణానికి హాయిగా వుంది. దాదాపు గంటగడిచింది. ఒకసీసా పూర్తిచేశాడు. అనంత్ బీరుప్రియుడు. తీసుకునేది తక్కువే అయినా ఎక్కువసేపు తాగడం అతని హాబీ.

టైంచూశాడు. ఇంకా ఎనిమిదిన్నర కూడా కాలేదు. ఇంటికెళ్ళినా బోర్‌కొట్టడంతప్ప మరేపనీలేదు. అందుకే ఇంకో బీర్ తెప్పించుకున్నాడు.

అక్కడ ఎక్కువమంది రాజకీయ నాయకులే కనిపిస్తున్నట్లు, వారి వేషభాషల్నిబట్టి అనంత్ అర్థంచేసుకున్నాడు. ఇక్కడే తనకి ఎన్నోవార్తలు దొరకగలవన్న ఆలోచనవచ్చి తనలోతనే నవ్వుకున్నాడు.

హాలుకి ఓమూలగా వున్న కౌంటర్‌వైపు అనంత్ యథాలాపంగా చూశాడు. అంతే! కళ్ళు ఇక అక్కడినుంచి కదల్లేదు. కౌంటర్‌లో కూర్చున్నవ్యక్తి దగ్గరకి ఓ యువకుడు వచ్చాడు. చేతిలో సూట్‌కేసువుంది. అతను భయంభయంగా దిక్కులు చూస్తున్నాడు. కౌంటర్‌లో వున్నవ్యక్తికి సూట్‌కేసు అందించాడు. అతని కళ్ళల్లో ఆందోళనమాత్రం తగ్గలేదు. రెండునిమిషాల్లో అతనిచేతికి మరోబ్రీఫ్‌కేస్ అందింది. దాన్ని తీసుకుని హడావుడిగా అక్కడినుంచి కదిలాడు.

అనంత్‌లో ఆలోచనలు మొదలయ్యాయి. పర్సులోనుంచి రెండువందల కాగితాలనోట్లు తీసి కౌంటర్‌లో ఇచ్చేసి, గబగబా కిందికి నడిచాడు. సూట్‌కేసుతో దిగినవ్యక్తి అప్పుడే మోటారుసైకిల్ స్టార్ట్ చేశాడు. అనంత్ అక్కడే ఆగివున్న ఆటోఎక్కి కూర్చున్నాడు. అనుమానం రాకుండా మోటార్‌సైకిల్‌ని ఫాలో అవమని ఆటోడ్రయివర్‌కి చెప్పాడు.

అనంత్ మనస్సు రకరకాలుగా ఆలోచిస్తోంది. దొంగనోట్ల కుంభకోణంగానీ, స్మగ్లింగ్ రాకెట్‌గానీ బయటపడుతుందేమోనన్న ఆశ అతనిలో మరింత ఉత్సాహాన్ని రేకెత్తిస్తోంది. దూరంగా మోటార్‌సైకిల్ అనేకమలుపులు తిరుగుతూ పోతోంది. అరగంట తర్వాత ఆ మోటారుసైకిల్ ఓ భవనంముందాగింది. అనంత్ అల్లంతదూరాన ఆటో ఆపాడు. మీటర్‌చార్జిచెల్లించి ముందుకి నడిచాడు.

మోటార్‌సైకిల్‌కి స్టాండ్‌వేసి, సూట్‌కేసుతో సహా ఆ యువకుడు గబగబా లోనికి నడిచాడు. అనంత్ అతన్ని అనుసరించాడు. యువ




కుడు లిఫ్ట్‌ఎక్కాడు. అనంత్ ఒక్కక్షణం ఆలో చించి మెట్లమీదుగా వేగంగా అడుగులే యడం ప్రారంభించాడు. ఫస్ట్‌ఫ్లోర్‌లో లిఫ్ట్ ఆగలేదు. అనంత్ పెద్దపెద్ద అంగలతో మెట్లె క్కుతున్నాడు. అతను రెండోఫ్లోర్‌లో వుండగానే లిఫ్ట్ మూడోఫ్లోర్‌లో ఆగినట్టు గమనించాడు. గబగబా మెట్లెక్కి పైకిపోయాడు. సూట్‌కేసు యువకుడు ఒక ఫ్లాటుదగ్గర నిలబడి కాలింగ్ బెల్ నొక్కాడు. అనంత్ మెట్లదగ్గరే ఆగిపోయా డు. క్షణాల్లో తలుపుతెరుచుకుంది. అతను లోనికెళ్ళాడు.

అనంత్ మనస్సులో ఎన్నెన్నో సందేహాలు. ఆ ఫ్లాటులో మోహిని వుంటుంది. కుర్రాడు లోనికెళ్ళగానే తలుపు మూసుకుంది. అనంత్ గబగబా వెళ్ళి తలుపు కీ హోల్‌లోనించి చూశాడు. సూట్‌కేసు మోహిని అందుకుంది. సూట్‌కేసు తెరిచింది. అందులో నోట్లకట్టలు. మోహిని ముఖంలో చిరునవ్వు కనిపించింది. అతనితో ఏదో మాట్లాడుతోంది. అనంత్‌కి విని పించలేదు. డబ్బు తెచ్చినవ్యక్తికి ఓ వందరూ పాయలనోటు ఇచ్చింది. ఆ కుర్రాడు వెనుదిరి గాడు. అనంత్ మరుక్షణమే అక్కడినుంచి మాయమయ్యాడు.

★ ★ ★

ఆ రాత్రంతా అనంత్ నిద్రపోలేదు. ఎప్పు డెప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూశా డు. మోహిని చేస్తున్న దొంగచాటు వ్యాపారం ఏమిటో తెలుసుకోవాలని అతని మనస్సు ఉవ్వి ళ్ళూరుతోంది. ఆమెనుంచి చాలా నేర్పుగా సమాచారం రాబట్టాలని నిర్ణయించుకున్నా డు.

అతికష్టం మీద తెల్లవారినట్లనిపించింది అతనికి. ఏడుగంటలకల్లా తయారై బైటికొచ్చే శాడు. ఆటో ఎక్కి పావుగంటలో మోహిని నివాసానికి చేరాడు. ఆమె అప్పుడే నిద్రలేచిన ట్లుంది. అనంత్‌ని చూడగానే ఆమె ఆశ్చర్యపో యింది. పొద్దున్నే లేవడమంటే అనంత్‌కి తగని చిరాకు అని అతనే చెబుతుండేవాడు. ఆ మాటలు ఇప్పటికీ గుర్తున్నాయి ఆమెకి. అనంత్‌ని చూస్తే ఆమె ముఖంలో ఏదో తెలీని కాంతిస్పష్టంగా కనిపిస్తోంది. అనంత్ ఆ మార్పు గమనించకపోలేదు. కాలింగ్‌బెల్ విని... అప్పుడే బెడ్‌మీదనుంచి లేచి వచ్చిన ట్లుంది... జుట్టంతా చెదిరిపోయివుంది... చీర నలిగిఉంది. ఆ ముఖంలో ప్రత్యేకమైన ఆక ర్షణ అనంత్‌ని ఒక్కక్షణం అచేతనంగా నిలి పింది. మోహిని చాలా స్వతంత్రంగా అతని చేయి పట్టుకుని లోనికి తీసుకెళ్ళింది. ఇద్దరూ బెడ్‌రూమ్‌లోకి దారితీశారు. అనంత్ మెద డంతా రకరకాల ప్రశ్నలతో నిండివుంది. ఎదు రుగా సోఫా కనిపిస్తే అందులో చతికిలబడ్డా డు. మోహిని మాత్రం దోమతెరని పైకిఎత్తేసి పరుపు మధ్యలో కూర్చుంది. ఒళ్ళో దిండు పెట్టుకుని మోచేతిని దిండుమీద ఆనించింది.

ఆమెలో రాజసీవి కనిపించింది అనంత్‌కి. ఆమె ముఖంలోకే చూస్తూ కూర్చున్నాడు. కొద్ది నిముషాలు ఇద్దరూ అలా మౌనంగా గడిపారు.

"ఏమిటి అనంత్... అలా చూస్తున్నావ్?" మోహినే మొదట నోరువిప్పింది.

అతను తదేకంగా ఆమెనే చూస్తున్నాడు. సంభాషణ ఎలా ప్రారంభించాలో అతనికి అంతుచిక్కకుండా వుంది. మోహిని మంచంమీదనుంచి లేచి వెళ్ళి సోఫాలో ఓ పక్కగా కూర్చుంది.

"ఏమిటి అనంత్... అలావున్నావ్?"

"నువ్వో సాయంచేయగలవా?" ఆమె కళ్ళ ల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"ఏమిటి చెప్పు... అయినా నేను నీకు ఏం సాయంచేయగలను?" నవ్విందామె.

"నాకు ఓ పదివేలు సర్దగలవా? కొద్ది వారా లకే...."

"ఇదేనా సమస్య... ఈ మాత్రానికి ఇంతగా ఆదుర్దాఎందుకు?"

"నిజంగా నీ దగ్గర దొరుకుతాయా?"

"ఇక ఆ సమస్యని మర్చిపొమ్మంటున్నాగా".

"నువ్వేనయం మోహినీ..."

"ఏమిటి నయం...." ఆ గొంతులో అస్పష్ట మైన వెలితి ధ్వనించింది.

"నువు రెండు చేతులా సంపాదిస్తున్నావని తెలిస్తే ఇంకో పదివేలు అడిగేవాణ్ణిగదా!"

"నిజంగా నీకు అవసరం లేదా?"

"సరదాకి అన్నాను. అవసరంలేకపోతే

నన్నెందుకు అడుగుతాను

మోహిని వెళ్ళి డబ్బు తెచ్చి అనంత్ చేతి లోపెట్టింది. అతను దాన్ని జేబులో పెట్టుకు న్నాడు.

"నిన్ను చూస్తుంటే నాకు ఈర్ష్యగా ఉంది మోహినీ"

"ఎందుకు?"

"ఇన్నేళ్ళనుంచి నేను ఉద్యోగం చేస్తున్నా నాదంటూపైసా కూడా వెనకేసుకోలేదు"

"అయితేనేం. నీ సంపాదనలో తృప్తి మిగు లుతుంది- అంతేచాలు"

"సంపాదన అన్నతర్వాత ఎవరికైనా ఆ తృప్తి సహజమే"

"కాని అందులోనుంచి నన్ను మినహా యించాలిగా" అంటూ తేలిగ్గా నవ్వింది.

"ఏం... నువ్వేం పాపం చేసుకున్నావని?"

"లేచిన దగ్గర్నుంచి పడుకోబోయేదాకా వెయ్యి అబద్ధాలు ఆడాలి. వెయ్యి అక్రమాలు చెయ్యాలి. ఒకరికోసం నీకు అబద్ధం... నీకోసం వేరొకరికి అబద్ధం...."

మోహిని హృదయకవాటాలు తెరుచుకు న్నాయి. తనలోని వేదననంతా ఒక ఆప్తునికి చెప్పుకున్నట్టు ఒకదాని తర్వాత ఒకటి విడమ రిచి చెబుతోంది.

సమయానుకూలంగా అనంత్ మధ్యమ ధ్యలో సందేహాలు లేవనెత్తుతున్నాడు.

మోహిని అంతరంగమథనం పూర్తిగా అవ గతమయ్యేసరికి అనంత్ నిలువునా ఆశ్చ ర్యంలో మునిగిపోయాడు.

ఆమె ఒక సాధారణ స్త్రీగా అనిపించలేదు అతనికి.

జీవితంలో మోసపోయిన సగటు స్త్రీ మాన సిక వేదనకి ఆమె ప్రతిరూపమేమోనని పించింది. వేదనే ప్రతీకారమై ఆమె ఇలా సమాజంమీద తిరగబడబోతోందన్న ఊహరా గానే అనంత్ గుండె ఒక్కసారిగా ఝల్లు మంది.

గవర్రాజు గురించి మొదటిసారిగా బోలెడ న్ని కొత్త విషయాలు ఆమెనోటినుంచి విన్నా డు. అతని బలహీనతని ఆమె ఎలా ఉపయో గించుకుంటోందో తెలుసుకున్నాడు.

వీరభద్రం జాతకం, మందాకిని జీవితం, భూపాలరావు భాగోతం... మోహిని చెప్పిన దంతా రాస్తే ఒక పెద్ద గ్రంథమే అవుతుందని పించింది.

అధికారాన్ని హస్తగతం చేసుకోవడం తన తుది లక్ష్యమని మోహిని అన్నప్పుడు అనంత్ గుండె ఆగినంతపనయింది. ఆమె ఆలోచనా సరళికి అతను దిగ్భ్రాంతి చెందాడు.

ఆ లక్ష్యసాధనకు వీరభద్రాన్ని గవర్రాజుని, భూపాలరావుని ఎలా వినియోగించుకోబోతు న్నదీ ఆమె వివరించినప్పుడు మోహిని అస మాన ప్రతిభా పాటవాలు అమోఘమైనవని అనంత్‌కి అనిపించింది. అధికారాన్ని కొనుక్కొ నేందుకు డబ్బు కావాలి కాబట్టి ఏది గిట్టుబా టైతే ఆ వ్యాపారంచేసి వీళ్ళతో కోట్లు వెనకేస్తున్న ట్టు మోహిని కుండబద్దలు కొట్టినట్టు చెప్పిన ప్పుడు ఆమె కాలాంతకురాలు అనిపించింది. గవర్రాజు తనంటే పడిచస్తాడని, తనికి రవ్వల నెక్లెస్ తెచ్చేందుకే ప్రజాసేవపేరుతో ఊళ్ళమీ దపడ్డాడని సగర్వంగా చెప్పినప్పుడు, గవర్రాజు తోసహా ఆమెకూడా విషసర్పాలుగా అనంత్ మనస్సులో మెదిలారు.

అనంత్ దాదాపు రెండు గంటలు గడిపా డు. మోహిని అనర్గళంగా మాట్లాడేస్తోంది. కేవలం తనకున్న ఒకే ఒక్క అర్హత ఆడతనం! దానితోనే ఇదంతా అవలీలగా చేసుకుపోగలు గుతున్నానని మోహిని నిర్లజ్జగా చెప్పినప్పుడు అనంత్ జాలిపడ్డాడు.

మోహిని కాఫీ తెచ్చి ఇచ్చింది.

ఉదయాన్నే వేడివేడి కాఫీపడేసరికి అనంత్ మనస్సు వేగంగా పనిచేయడం ఆరంభించింది. మోహిని చెప్పినదంతా అతని మనస్సులో మార్మోగుతోంది.

మోహిని త్వరలో రాజకీయసంక్షోభం సృ ష్టించడం ఖాయం. అందులో గెలుపు ఓటము లు ఎవరివి అనే విషయం రహస్యమేమీ కాదు. ధనబలం, అంగబలం ఉన్నవాడిదే రాజ్యమ వుతుంది. ఈ చక్రవ్యూహానికి పథకనిర్దేశం చేస్తున్నది మోహిని కాబట్టి, ముందునుంచే ఆమె అన్నివిధాలా సమాయత్తమవుతోంది. కా బట్టి గెలుపు ఆమెదేకావచ్చు.




అనంతలో ఆలోచనలు తామరతంపరలుగా పుట్టుకొస్తున్నాయి.

ఎన్నివిధాల ఆలోచించినా మోహిని సృష్టించబోయే రాజకీయసంక్షోభం పర్యవసానం అనంత్‌కి ఏమాత్రం సహేతుకంగా లేదు.

మోహిని నైతికంగా పతనం అయింది. ఆమాటకొస్తే గవర్రాజు...? మరి భూపాలరావు సంగతేమిటి?.... వీరంతా తమ జీవితంలో ప్రతిక్షణాన్నీ జనం ఖర్చుతో గడుపుతున్నారు. ఆ జనానికి కృతజ్ఞులైవుండాల్సిందిపోయి, వారికే ద్రోహం చేస్తున్నారు.

ఈ నయవంచకులు ఏమాత్రం క్షమార్హులు కాదనిపించింది.

అనంత్ అప్పటికప్పుడే తన లక్ష్యాన్ని నిర్ణయించుకున్నాడు. తానిప్పుడు ఒక బృహత్తర కార్యాన్ని భుజానవేసుకుంటున్నానని అనిపించగానే అనంత్ మనస్సులో తెలీని ఆనందం పెల్లుబికింది.

పర్యటనలోవున్న గవర్రాజు ఒక్కక్షణం గుర్తుకొచ్చాడు.

అనంత్‌కి తక్షణకర్తవ్యం మదిలో మెదిలింది.

మోహిని దగ్గర సెలవుతీసుకుని బయలుదేరాడు.

ఓగంట తర్వాత తిరిగొచ్చి మోహినికి పది వేలు ఇచ్చేశాడు. అవసరం అవుతాయని అనుకుంటే, తీరా వాటి అవసరమే పడలేదని మాట అడ్డంవేశాడు.

ఆ మధ్యాహ్నామే అనంత్ ప్రయాణం అయ్యాడు. ఇప్పుడు అతనిదృష్టి అంతా గవర్రాజు పర్యటనమీదేఉంది. ఆ అర్థరాత్రికి గవర్రాజు సొంతపట్టణంలో దిగాడు అనంత్.

★ ★ ★

గవర్రాజు పర్యటనలో చివరి మజిలీకి సన్నాహాలు పూర్తి అయ్యాయి. సొంతవూరు కావడంతో ఆయనకి అక్కడ మందీమార్బలానికేమీ తక్కువలేదు. వారం రోజుల ముందు నుంచే పర్యటన గురించి బాగా ప్రచారం చేశారు. కార్లు, ఆటోలు, రిక్షాలు మైకులు కట్టుకుని చుట్టుపక్కల గ్రామాలు కూడా తిరిగాయి.

గవర్రాజు పట్టణప్రవేశం చేశాడు. ఇంతవరకు జరిగిన కార్యక్రమాలన్నీ ఆయనకి సంతృప్తినిచ్చాయి. సొంతవూరు రాజకీయపరంగా ఆయనకి గుండెకాయలాంటిది. తన పలుకుబడికి ఇక్కడ ఏమీ ఢోకాలేకపోయినా, పరిస్థితి పూర్తిగా తన అదుపులోనే లేదని మాత్రం ఆయనకి తెలుసు. సొంతఊళ్ళో ప్రతిపక్ష పార్టీ ఇప్పుడిప్పుడే మళ్ళీ వేళ్ళూనుకుంటోంది. గవర్రాజుకు ఇది మింగుడుపడకపోయినా నిజాన్ని మాత్రం కాదనలేకపోతున్నాడు.

స్వాగతం ఏర్పాట్లతో పట్టణం ఎంతో డాబుసరిగా కనిపిస్తోంది. రకరకాల బ్యానర్లు మంత్రిగారిని ఆకర్షించాయి. వాటితోబాటే అక్కడక్కడా ప్రతిపక్షాల నిరసన బ్యానర్లు కూడా గవర్రాజు కంటబడ్డాయి. పార్టీ జెండాలతో అలంకరించిన ప్రతిచోటా నల్లజెండాలు కూడా దర్శనమిచ్చాయి. తెల్లవారేసరికి ఊరంతా నల్లజెండాలు, నిరసన బ్యానర్లు వెలిశాయి. మంత్రిగారి పర్యటన ఏర్పాట్లలో మునిగిపోవడంతో స్థానిక నాయకులెవరూ వాటిని వెంటనే పసిగట్టలేకపోయారు. ఈ బ్యానర్లు వాళ్ళ దృష్టికి వచ్చేసరికి మంత్రిగారు రానేవచ్చారు.

ఆ నల్లని జండాలు తన భావి రాజకీయ జీవితానికి నల్లనిమరకలుగా గవర్రాజు మనసు శంకించింది. త్రివిక్రమరావు పేరుమీద ఉన్న బ్యానర్లు, పెరుగుతున్న అతని పలుకుబడికి నిదర్శనమేమోననిపించింది గవర్రాజుకి. ఇవన్నీ ఒక ఎత్తు అయితే గోపాల్‌నాయకత్వంలో వెలిసిన యువజన సమాఖ్య బ్యానర్లు ఒక ఎత్తు. బూటకపు పర్యటనకు స్వస్తిచెప్పాలని గవర్రాజుని హెచ్చరిస్తున్నాయి ఆ బ్యానర్లు.

సొంత ప్రతిష్టకోసం ప్రజల్ని మోసగించడం నేరమని ఉద్బోధిస్తున్నాయి. జనంమీద ఆధారపడి బతకటం ఇంకెన్నాళ్ళని నిలదీస్తున్నాయవి. క్యాంటీన్ రాజకీయాలు ప్రజాసేవలో భాగంకాదని విడమరచి చెబుతున్నాయి. గవర్రాజు ఊహించని పరిణామాలివి. ఆయన వర్గీయులు సైతం ఊహించలేదు. ఏమాత్రం అనుమానం వచ్చినా ఈ ఊరు రాకుండా మానుకుంటే మంచిదయ్యేదని గవర్రాజుకి మొదటిసారిగా ఆలోచనవచ్చింది.

తన ఈ పర్యటన తనొక్కడికే లాభించాలి. కాని తనతోపాటు త్రివిక్రమరావు, గోపాల్ ప్రయోజనం పొందబోతున్నారు. ఆ నల్లజెండాలు, నిరసన బ్యానర్లే వాస్తవానికి ప్రజల్లో చర్చనీయాంశాలవుతాయి. ఆ మేరకు వాటికి విలువ పెరిగినట్టే.

ఇంతలో గవర్రాజు కారు ఒక సెంటర్‌లో ఆగింది. అక్కడేదో వేడుక జరుగుతున్నంత ఆర్భాటంగా ఉంది. ఆ ప్రాంతమంతా రంగుకాగితాలతో ఆకాశమే కనిపించడంలేదు. మరో వంక పార్టీ జండాలు రెపరెపలాడుతున్నాయి.

కారు ఆగీ ఆగగానే అస్మదీయులంతా కారు చుట్టుముట్టారు. డోరు తెరుచుకుని గవర్రాజు కిందికి దిగాడు. నలుగురైదుగురు పూలదండలు వేశారు. ఆయన్ని సాదరంగా ముందుకి నడిపించుకెళ్ళారు.

గవర్రాజు అక్కడ ఒక క్యాంటీన్‌కి ప్రారంభోత్సవం చేశాడు.

సొంత ఊళ్ళో గవర్రాజు వీధి రాజకీయాల దగ్గర్నుంచి క్యాంటీన్ రాజకీయాలదాకా దగ్గరుండి చాకచక్యంగా నడిపించడం మొదటి నుంచి అలవాటే. ఇలాంటి రాజకీయాలు ప్రతి నాయకుడికీ ఉంటాయని, ఆ మాటకొస్తే ఇవి అవసరమని గవర్రాజే చెబుతుంటాడు తన ఆంతరంగికులతో.

అయితే గవర్రాజు ఇపుడింత శ్రద్ధగా



[illegible] ప్రారంభించడా
నికి వెనుక పెద్ద కథ వుంది. అంతకన్నా గొప్ప రాజకీయం ఉంది. గవర్రాజు ప్రోద్బలంతోనే కాంటీన్ వెలిసింది. గోపాల్‌ని సాధించడానికి ఇదే సరైన ఆయుధమని గవర్రాజు భావించాడు. అందుకే గోపాల్ టీ స్టాల్‌కి ఎదురుగా ఈ క్యాంటీన్ తెరిపించాడు. ఈ ముహూర్తం కోసం ఎంతోకాలంనుంచీ ఎదురుచూస్తున్నాడు. ఇప్పుడు సమయం కుదిరింది. గవర్రాజుకి ఇప్పుడు తృప్తిగా ఉంది.

ఏడాదిక్రితంవరకు గోపాల్ గవర్రాజుకు మంచి శిష్యుడు. గోపాల్ ఆర్టీసీలో పనిచేస్తాడు. అతను యూనియన్ నాయకుడు కూడా. గవర్రాజుకి ఆయన పార్టీకి అతను ఎంతో సేవచేశాడు. అతని నాయకత్వంలోని యూనియన్ అండదండలన్నీ గవర్రాజుకే దక్కేవి. ఎన్నికలు ముగిసిన కొద్ది రోజులకి సెంటర్లో ఓపక్కగా టీస్టాల్ ప్రారంభించాడు గోపాల్.

గవర్రాజు ఆశీర్వాదంతోనే టీస్టాల్ నడుస్తోంది. రెండు నెలలు తిరిగేసరికి అది బాగా పుంజుకుంది. మున్సిపాలిటీవాళ్ళు కొత్తగా ఫుట్‌పాత్‌లు కట్టించడంతో సాయంత్రంపూట కాలేజీ కుర్రాళ్ళకి, ఇతర ఉద్యోగులకీ బాతాఖానీ వేసుకునేందుకు ఆ ప్రాంతం మంచి స్థావరం అయింది. ఇది ఆ టీస్టాల్‌కి ఎంతో ఉపకరించింది. గోపాల్ తమ్ముడు పేరుకి మాత్రం అందులో కూర్చునేవాడు. పెత్తనం అంతా గోపాల్ చేసేవాడు. యూనియన్ నాయకునిగా అతనికి రకరకాల వ్యాపకాలు. వాటన్నిటికీ వ్యూహాలు, ప్రతివ్యూహాలు ఇక్కడే రూపుదిద్దుకుంటూ ఉండేవి. టీస్టాల్‌తో గోపాల్ ఆర్థికంగా మంచిస్థితికి చేరాడు. దాంతో సహజంగానే అతని పరిధి విస్తరించింది. స్థానికంగా తలెత్తే సమస్యలు, తగాదాలు, నీళ్ళగొడవలు, వీధి కొట్లాటలు పరిష్కారానికి ఇతని దగ్గరికే వస్తున్నాయి.

గవర్రాజు అండదండలతో గోపాల్ తన పలుకుబడి పెంచుకుంటున్నరోజులు అవి.

ఉన్నట్టుండి ఆర్టీసీలో మూకుమ్మడి బదిలీలు జరిగాయి. వీటికి సర్వత్రా నిరసన వ్యక్తమైంది. కొందరు శాసనసభ్యుల ఒత్తిడికిలొంగి [illegible]
సిబ్బంది ఆరోపించారు. కొందరు స్వార్థపరుల ప్రయోజనాల కోసం జరిగిన ఈ అక్రమ బదిలీలను ఎలాగైనాసరే రద్దుచేయించాలని సిబ్బందిలో ఒకవర్గం పట్టుపట్టింది. సిబ్బంది నాయకులు యాజమాన్యంతో చర్చలు జరిపారు. సమస్య పరిష్కారం కాలేదు. వంతాలు పెరిగాయి. సమ్మెకు దిగాలని ఉద్యోగులు నిర్ణయించారు. యూనియన్ నాయకుడుగా గోపాల్. ఆ సమ్మెకు నడుంబిగించక తప్పలేదు.

ఒక యూనియన్ సమ్మెలో పాల్గొనడంతో సగానికి సగం బస్సులు నిలిచిపోయాయి. వారం గడిచినా పరిస్థితిలో మార్పులేదు.

ఇంతలో ఒకరోజు గవర్రాజు పట్టణం వచ్చాడు. గోపాల్‌కోసం కబురుచేశాడు.

"గోపాల్... ఏమిటి ఇదంతా?" నేరుగా అసలు విషయంలోకి వచ్చాడు.

స్నేహితునిగాకాక ప్రభుత్వ ప్రతినిధిగా గవర్రాజు సంభాషణ ప్రారంభించాడు. గవర్రాజు దేని గురించి అడుగుతున్నాడో గోపాల్‌కి బోధపడలేదు. అదే అడిగాడు. గోపాల్ ప్రశ్న గవర్రాజుకి కోపం తెప్పించింది.

"చేయాల్సింది చేస్తూనే ఇంకా దేనిగురించి అని అడుగుతున్నావా?" అన్నాడు గవర్రాజు.

గోపాల్‌కి సవాలక్ష వ్యాపకాలు. ఆర్టీసీ సమ్మె సమస్య కూడా అందులో ఒకటి. అందుకే గవర్రాజు మాట్లాడుతున్నది సమ్మెగురించి అని తొందరగా బోధపడలేదు.

"నేను అంతదూరం నుంచి కాలికి బలపం కట్టుకుని ఎందుకు రావాల్సి వచ్చింది?" గోపాల్ నుంచి సమాధానం లేదు.

"నువ్వు నాకిట్లా ద్రోహం చేస్తావని నేనేనాడూ అనుకోలేదు. నువ్వు చేయిస్తున్న ఈ సమ్మె ప్రభుత్వానికి, పార్టీకి ఎంత నష్టమో వూహించావా?"

సమ్మె గురించి తనతో మాట్లాడి సమస్యని పరిష్కరించటానికే గవర్రాజు వచ్చాడని ఇప్పుడు అర్థమైంది గోపాల్‌కి. ఈ విషయంలో గవర్రాజు తనతో స్నేహితునిగాకాక ప్రభుత్వ ప్రతినిధిగానే మాట్లాడుతున్నాడని కూడా అర్థమైంది. తానూ యూనియన్ నాయకునిగానే గవర్రాజుతో వ్యవహరించాలని నిర్ణయించుకున్నాడు.




"ఎంతసేపటికి ప్రభుత్వానికి, పార్టీకి జరిగే నష్టమేగాని సిబ్బందికి జరిగే అన్యాయం మీ కుపట్టదా?"

"సిబ్బందిని బదిలీచేయడం అన్యాయమని ఏ కార్మిక చట్టంలో చదివావ్? నీ నాయకత్వంలో చట్టాలకు భాష్యాలు మార్చి రాయాలనుకుంటున్నావా?"

"అవును... మీ ప్రభుత్వహయాంలో చట్టాల రూపురేఖలే మారిపోతున్నాయి".

ఉద్యోగుల బదిలీలు పాలనా నిర్వహణలో ఒక భాగం. బాధ్యత కలిగిన పాలకులుగా అవసరమైతే పాలనాయంత్రాంగంలో మార్పులు చేస్తుంటాం. దానికి నువ్వింతగా రాద్ధాంతం చేయాలా?"

"ఏమిటి ఇప్పుడు వచ్చిన అత్యావసరం? మీ ఇళ్లముందు బస్సులు ఆపలేదని వాళ్లోవాళ్లచేత డ్రయివర్లని కొట్టించడమా?"

"లక్షలు ధారపోసి ఎన్నికల్లో గెలిచినవాళ్లకి ఇళ్లముందు బస్సులు ఆపుకునేహక్కు కూడా వుండొద్దంటావా?"

"అలాగని చట్టాలుమారిస్తే సరిపోతుంది గదా"

"ఈ ప్రజాస్వామ్యంలో ప్రతిదానికీ చట్టం అంటే ఎలాకుదురుతుంది? కొన్ని కొన్ని లోపాయికారిగా జరిగిపోతూ వుండాలి"

"అంటే ఉద్యోగులు మీదృష్టిలో నౌకర్లేనంటారా?"

"అని నేను ఎందుకు అంటాను?"

"మరి మీరు చెప్పేదేమిటి? నిబంధనలప్రకారం నడుచుకునేవాళ్లమీద బదిలీల అస్త్రం ప్రయోగించడంలో ప్రభుత్వ ఉద్దేశం ఏమిటి?"

"ప్రభుత్వ ఆదేశాలను సవాలుచేయాలనుకోవడం మూర్ఖత్వం"

"సమ్మె ఉద్యోగుల ప్రాథమిక హక్కు. దాన్ని మూర్ఖత్వం అనడం పాలకుల సహజసిద్ధమైన అవివేకం"

"నా స్నేహితునిగా నువ్వు ఈ సమ్మెకి దిగటం నాకుచాలా ఇరకాటంగా వుంది. తెలుసా?"

"నేను మీస్నేహితుడినని చెప్పుకోవడం మానేయవచ్చుగదా!"

"అంతేగాని సమ్మెని వదలనంటావ్?"

"బదిలీలు ఆగేంతవరకు మా నిర్ణయం మారదు."

"నీకెవరో బాగా నూరిపోశారు"

"అలాగైతే ఇప్పుడు నీకూ లొంగిపోయి వుండేవాణ్ణి"

"నీకు ఎంత సహాయంచేశానో అదంతా మర్చిపోయావు. ఇన్నేళ్ల మన స్నేహాన్నే ఆ మానిస్తున్నావు"

"వేలాది కార్మికులకు సంబంధించిన సమస్యకి స్నేహంతో ముడిపెట్టడం భావ్యంకాదు. స్నేహం విలువైనదే కావచ్చు. కాని దానికన్న కార్మికప్రయోజనాలు మరింత విలువైనవి"

"గోపాల్ ... నువ్వు బాగా ఆలోచించు. నీకు ఇంతగా ఎందుకుచెబుతున్నానో అర్థం చేసుకో"

"గవర్రాజూ... సమ్మెవిషయంలో నువ్వింతగా పట్టుపట్టేబదులు బదిలీలను ఆపించడానికి ప్రయత్నించివుంటే నేనెంత సంతోషించేవాడినో తెలుసా?"

"బదిలీల సమస్య వదిలేసేయ్. అయిందేదో అయిపోయింది. మా నాయకుడి ఆజ్ఞప్రకారం నేను సమ్మెవిషయం మాట్లాడతానేతప్ప బదిలీలగురించి పెదవివిప్పే అర్హతలేదు"

"ప్రభుత్వ ఏకపక్ష కార్మికవిధానాలకి ఇది నిదర్శనంకాదా?"

"ప్రభుత్వం ఏకపక్షంగా వ్యవహరించేదే అయితే ప్రమోషన్‌లిస్టులో నీపేరు ఎందుకు చేర్పుతుంది?"

గోపాల్‌కి విషయం అర్థమైపోయింది. ప్రభుత్వానికి ఈ సమ్మె ఓ సమస్య అయికూర్చుంది. మూకుమ్మడి బదిలీలుచేసి తొందరపడి చేతులుకాల్చుకున్న నేరానికి పరువునిలుపుకునేందుకు తనకి ప్రమోషన్ ఎర వేసిందన్నమాట.

"నేను నీకోసం ఇంతగా శ్రమపడుతుంటే నువ్వు కార్మిక సంక్షేమం అంటూ ఎందుకలా చెడిపోతావ్? అవన్నీ చూసుకునేందుకు చట్టాలున్నాయిగదా"

"ఎన్ని చట్టాలున్నా పాలించేవాళ్లకి చిత్తశుద్ధి లేకపోతే ప్రయోజనమేమిటి?"

"ఎదుటివారి చిత్తశుద్ధిగురించి ప్రశ్నించే ముందు మొదట నీకుటుంబంపట్ల నీకున్న చిత్తశుద్ధి ఏపాటిదో ఆలోచించుకో గోపాల్!"

గవ్రరాజు తనకి ఏవో ఆశలుజూపబోతున్నాడని గోపాల్ గ్రహించాడు. అవేవో గవ్రరాజు నోటినుంచి రాకముందే వాటికి కళ్లెంవేశాడు.

"క్షమించు గవ్రరాజు. నేనెలాంటి ప్రలోభాలకీ లొంగలేను"

"అన్నీ జాగ్రత్తగా ఆలోచించుకునే నువ్వీ నిర్ణయానికివచ్చావా?"

"మంత్రివి అయ్యాక నువ్వు పూర్తిగా మారిపోయావు"

గవ్రరాజు పెద్దపెట్టున నవ్వాడు.

"నువ్వు గ్రహించావన్నమాట... భేష్! ఇదీ ఒకరకంగా శుభసూచకమే. పిచ్చి గోపాల్ ... నేను మారానుగాబట్టే మంత్రిని కాగలిగాను- తెలిసిందా?"

"ఇలాంటి మార్పులు ఆరోగ్యకరంకాదు"

"అలాగని నేను అనుకోను"

"నువ్వు మారావని ఎదుటివాడు కూడా మారాలనుకోవడం అవివేకంకాదూ?"

"పరిస్థితుల్నిబట్టి మారడం వివేకవంతుల లక్షణం"

"ఈ మార్పులు నావల్లకాదు. నాకు ఇష్టంలేదు కూడా"

"ఇష్టాలకోసం కష్టాలుకొని తెచ్చుకోవడం ఎంతనష్టమో నీకు ఇప్పుడుతెలీదు" గోపాల్ ఏమీ మాట్లాడలేదు. గవ్రరాజు మాటలు అతనికి ఒపట్టాన అర్థంకావడంలేదు. గవ్రరాజు తనని ఒప్పించేందుకు ప్రయత్నిస్తున్నాడో లేక పరోక్షంగా హెచ్చరిస్తున్నాడో తెలియడంలేదు.

"నీకంటే నేను జీవితాన్ని ఎక్కువచదివినవాణ్ణి. ఇష్టానిష్టాలకోసం కష్టాలపాలయ్యేకంటే ఇష్టాలనే మార్చుకోవడం మంచిదని అనుభవంతో నేర్చుకున్నాను. ఈ స్థాయికి ఎదగగలిగాను" గవ్రరాజు తాపీగా చెప్పాడు.

"ఇందుకు అభిమానాన్ని చంపుకోవాల్సి వుంటుంది"

"అక్కడే నువ్వు పొరపాటుపడుతున్నావ్. చంపుకోవాల్సింది అభిమానాన్ని కాదు... అహాన్ని"

"అది ఆయావ్యక్తుల వ్యక్తిత్వంమీద ఆధారపడివుంటుంది"

"అందుకే మిగతావాళ్ల విషయం వదిలేసెయ్యమంటున్నాను. నీగురించి ఆలోచించుకో"

"గవ్రరాజు! ఒకరకంగా మనిద్దరం ఒకేబాటలోవున్నాం. నువ్వు ప్రజలకి నాయకుడివి. నేను కార్మికనాయకుణ్ణి. నువ్వుచెప్పినట్టు నడుచుకోవడం నాయకత్వలక్షణమా?"

"నాయకులం అయినంతమాత్రాన వ్యక్తిగత స్వార్థాలు వుండకూడదా? మరి అలాంటప్పుడు మన జీవితాలకి అర్థం ఏమిటి?"

"వ్యక్తిగత స్వార్థం లేకపోవడం ఉత్తమం. ప్రస్తుతం అది అత్యాశే అవుతుంది. కనీసం మన స్వార్థానికి ఎదుటివారిని బలిపెట్టడమన్నా మానుకోవడం మనధర్మం"

"రకరకాల వ్యాపకాలతో రెండు చేతులా డబ్బుసంపాదిస్తున్న నువ్వు స్వార్థంగురించి మాట్లాడటం వింతగానే వుంది"

"ఎన్ని వ్యాపకాలున్నా జనంనోళ్లు కొట్టిమాత్రం సంపాదించడంలేదన్న సంగతి నువ్వు గుర్తుంచుకోవాలి"

"సరే... నీకు డబ్బెంతకావాలో చెప్పు"

"బదిలీలు ఆపివేస్తే నేనే ఆపనిచెయ్యగలను"

ఎంత ప్రయత్నించినా గోపాల్ లొంగలేదు. గవ్రరాజుకి ఆశాభంగమే మిగిలింది. చివరికి ప్రభుత్వమే దిగివచ్చింది. అక్రమబదిలీలన్నీ రద్దుఅయ్యాయి. వారంరోజుల్లో సమస్య పూర్తిగా సద్దుమణిగింది.

ఒకరకంగా ఇది గోపాల్ విజయం. కాని అక్కడినుంచే అతనికి గడ్డుకాలంమొదలైంది.

తోటిమంత్రి సహాయంకోరితే తలదూర్చి చివరికి అభాసుపాలయినందుకు గవ్రరాజు కుంగిపోయాడు. ఎన్.జి.ఒ.ల సమస్యలు గవ్రరాజు మధ్యవర్తిత్వంచేసి విజయం సాధించడంతో రవాణాశాఖామంత్రి ఈసారి గవ్రరాజుని ఆశ్రయించాడు. పైగా గోపాల్ గవ్రరాజుకి సన్నిహితుడు అనితెలిసేసరికి గవ్రరాజుసాయంతో సమస్యపరిష్కారమవుతుందని రవాణామంత్రి ఆశించాడు. కాని ఎదురుదెబ్బ తగిలింది. తోటి




మంత్రిదగ్గర గవర్రాజు మాటపోయింది. మొదట రవాణామంత్రికి ఈ సమ్మెమాన్పించే పూచీనాదని ఎంతగానో భరోసాఇచ్చాడు. అదంతా గోపాల్ తనమాట జవదాటడన్న నమ్మకంతోచేశాడు. కాని ఆశించింది ఒకటైతే చివరికి జరిగింది వేరొకటి. పైగా పరువుపోయింది. ఇందుకు గోపాల్ తగినమూల్యం చెల్లించితీరాలని గవర్రాజు నిర్ణయానికివచ్చాడు. అతనిమీద ప్రతీకారం తీర్చుకునేందుకు సమయంకోసం కాచుక్కూర్చున్నాడు.

ఆ అవకాశం ఇప్పుడు వచ్చింది. రిబ్బను కత్తిరించడంపూర్తి అయింది. క్యాంటీన్ పక్కనే చిన్న స్టేజీ నిర్మించారు. గవర్రాజు ఆ వేదికమీదికి ఎక్కి ఉపన్యాసం ఇచ్చాడు.

''మిత్రులారా...

నేను ఇవ్వాళ మన పట్టణంలో మొట్టమొదట ఈ క్యాంటీన్‌నే ఎందుకు ప్రారంభించానో మీకు తెలుసు''

జనంలో గుసగుసలు ...

గవర్రాజుమాత్రం తన సహజధోరణిలో మాట్లాడుతున్నాడు- ''సామాన్య ప్రజల కనీస అవసరాలకి, సౌకర్యాలకి నేను ఎంతో ప్రాధాన్యమిస్తాను. పట్టణాల్లో టీస్టాల్స్ డిమాండు ఏమిటో మీకందరికీ తెలుసు. తెల్లవారిలేస్తే చుట్టుపక్కల పల్లెల్లో మూడొంతులమంది పట్టణంలోనే వుంటారు. కేవలం బస్తీలో టీతాగి తిరిగి వెళ్లిపోయేవాళ్లు నాకు చాలామంది తెలుసు. ఈ సెంటర్‌లో మరో టీస్టాల్ అవసరం ఎంతోవుందనిపించింది. అందుకే దీన్ని ప్రారంభించేందుకు ఒప్పుకున్నాను''

జనం చప్పట్లు కొట్టారు.

గవర్రాజు స్టేజీ దిగబోతుండగా గోపాల్ మద్దతుదారులు నల్లజెండాలతో అక్కడికి చేరుకున్నారు. వందమందిదాకాఉన్నారు. వాళ్ళంతా గవర్రాజుకి వ్యతిరేకంగా నినాదాలు చేస్తున్నారు. గవర్రాజు ఒక్కక్షణం ఆగి తలెత్తి దూరంగా చూశాడు. గోపాల్ కనిపించాడు. అతని పక్క ఉన్నదెవరో పోల్చుకోవడానికి కొంచెం సేపు పట్టింది. గోపాల్‌వెంట త్రివిక్రమరావు ఉన్నాడని తెలిసేసరికి పుండుమీద కారం చల్లినట్లయింది గవర్రాజు మనస్సు.

'గోపాల్ అపోజిషన్ శిబిరంలో చేరాడన్నమాట' గవర్రాజు మనస్సు గొణిగింది. అవతల నినాదాల జోరుపెరిగింది. క్యాంటీన్ రాజకీయాలే గవర్రాజు జీవితం అంటూ గోపాల్ మద్దతుదారులు ఎద్దేవాచేశారు. ఊరినిండా టీస్టాల్స్ ఓపెన్ చేయడమేనా నీలక్ష్యం అంటూ త్రివిక్రమరావు నిలేశాడు.

కుతకుత ఉడుకుతున్న మనస్సుతో అక్కడ ఇక ఒక్కక్షణం కూడా ఉండలేకపోయాడు గవర్రాజు. గబగబా స్టేజీదిగి వెళ్ళి కారెక్కి కూర్చున్నారు. ఆయనవాలకం గవర్రాజు వర్గీయులకు అశనిపాతం అయింది. కారువెళ్ళిపోయింది. కాని అక్కడ గొడవ మాత్రం సద్దుమణగలేదు. రెండు వర్గాలు ఘర్షణకి దిగాయి పోలీసులు రంగప్రవేశం చేసి గోపాల్‌ని, త్రివిక్రమరావుని, మరికొంతమందిని అదుపులోకి తీసుకున్నారు.

ఓ గంట తర్వాత త్రివిక్రమరావుని వదిలేశారు.

గవర్రాజులో అశాంతి పెరిగిపోయింది. గోపాల్‌ని త్రివిక్రమరావు వలవేసిపట్టుకోగలిగాడని తెలిసిన దగ్గరనుంచి ఆయన రక్తం సలసలకాగుతోంది.

ఆరోజుకి మంత్రిగారి కార్యక్రమాలన్నీ రద్దయ్యాయి. గవర్రాజు తన సన్నిహితులతో ఒక పూటంతా గోపాల్ విషయమే చర్చించాడు.

గోపాల్ చేసింది ఎంత వరకు సబబు అనేవిషయం ఆయన అంతగా పట్టించుకోలేదు. రాజకీయాల్లో సాధ్యాసాధ్యాలనే పదాలకి తావులేదు. స్వలాభం నుంచే రాజకీయం పుట్టింది. అవసరం దాని ఊపిరి. అవకాశం దాని గుండెకాయ. స్నేహానికి, శత్రుత్వానికి ఈ ప్రపంచంలో అతీతమైనది ఒక్క రాజకీయమే. ఇది గవర్రాజు సిద్ధాంతం. ఈ సిద్ధాంతమే గోపాల్‌ని మార్చి ఉంటుందనుకున్నాడు.

సరిగ్గా ఆ సాయంత్రమే...

చీకటిపడుతున్నవేళ గోపాల్ టీస్టాల్ ముందు జనం గుమిగూడి వింతని చూసినట్టు చూస్తున్నారు. అక్కడ దాదాపు పాతికమంది పోలీసులు దగ్గరుండి టీస్టాల్‌ని నేలమట్టం చేయిస్తున్నారు. ఈ వార్తతెలిసి త్రివిక్రమరావు మందీ మార్బలంతో అక్కడికి వచ్చాడు. వాళ్ళల్లో చాలామంది గూండాలే వాళ్ళంతా త్రివిక్ర

మరావు వాలంటీర్లుగా, మద్దతుదారులుగా, చె లామణి అవుతుంటారు.

టీస్టాల్ సగంపైగానేలమట్టం అయింది. త్రివిక్రమరావు పోలీసుల్ని వారిస్తున్నాడు. పోలీసులకి వ్యతిరేకంగా ఆయనవెనుకనుండి నినాదాలు వినిపిస్తున్నాయి. త్రివిక్రమరావు ఈ ముఠాని ఇలాంటి సందర్భాల్లోనే రంగంమీదికి తెస్తాడు.

పోలీసులు తమపని తాము చేసుకుపోతున్నారు. ఇంతలో ఆ ముఠాలోనుంచి కొందరు పోలీసులమీదికి రాళ్ళు రువ్వారు. ఇద్దరు పోలీసులుగాయపడ్డారు. రాళ్ళ వర్షం మొదలైంది. పోలీసులు లాఠీలకి పని చెప్పారు. అందిన వాన్ని అందినట్టు బాదారు. కండబలంవున్న రౌడీలు మాత్రం పోలీసుల్ని చితకతన్నారు. పరిస్థితి విషమిస్తోంది. త్రివిక్రమరావుకి కావాల్సింది ఇదే. పరిస్థితి విషమించేదాకా సాగదీశాడు. తీరా విషమించాక పక్కకి తప్పుకున్నాడు.

నిముషాల్లో సెంటరు అంతా గందరగోళంగా మారిపోయింది. సోడా సీసాలు గాలిలో లేస్తున్నాయి. పోలీసులు భాష్పవాయుగోళాలు విసురుతున్నారు. అల్లరిమూక గులకరాళ్ళు, గాజుపెంకులు విసిరేస్తున్నది.

ఒక కానిస్టేబుల్ ముఖంలోనుంచి గాజు పెంకు దూసుకుపోయింది. అతను కెవ్వున అరుస్తూ కుప్పలా కూలిపోయాడు. స్టేషన్ నుంచి అదనపు బలగం వచ్చింది. పోలీసుల చేతుల్లో తుపాకులు పేలాయి. రోడ్డున వెళుతున్న ఇద్దరు అమాయకులు తూటాలకు బలిఅయ్యారు. ఇందులో ఒక మహిళ కూడా ఉంది.

త్రివిక్రమరావు పంటపండింది. అప్పటికప్పుడు విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి గవర్రాజుమీద ఆరోపణలు సంధించాడు. వ్యక్తిగత ద్వేషంతో టీస్టాల్మీద దాడి చేయించి ఇద్దరి మరణానికి కారకుడైన గవర్రాజు తక్షణం మంత్రిపదవికి రాజీనామా చెయ్యాలని త్రివిక్రమరావు డిమాండు చేశాడు. పర్యటన తొలిదశలో ఒక బహిరంగసభలో చిన్నపిల్లవాడి మరణానికి కారకుడైన గవర్రాజు హంతకుడు అని త్రివిక్రమరావు ఆరోపించాడు. ఈ రెండు దారుణ సంఘటనలపైన దర్యాప్తు జరిపించాలని ఆయన ప్రభుత్వాన్ని కోరాడు. 'జనచైతన్యయాత్ర పేరుతో గవర్రాజు సాధించిందేమిటి? నిలువెత్తు పూలదండలు, ఊకదంపుడు ఉపన్యాసాలు. ఈ పర్యటన వెనుక గవర్రాజు ఉద్దేశం మరేదో ఉంది. ఈ మొత్తం వ్యవహారాన్ని కూలంకషంగా విచారణ జరిపించాలి' అని త్రివిక్రమరావు విలేకరుల సమావేశం ముగించాడు.

మర్నాడు అన్ని పత్రికల్లో వార్తవచ్చింది. పూర్తిగా స్థానికమైన క్యాంటీన్ రాజకీయం త్రివిక్రమరావు పుణ్యమా అని జనరల్ వార్తఅయింది. గవర్రాజు రాజీనామా చేయాలన్న త్రివిక్రమరావు డిమాండునే చాలా పత్రికలు బ్యానర్ చేశాయి.

పట్టణంలో ఈ వార్త చర్చనీయాంశమైంది.

త్రివిక్రమరావు పోలీసు ఉన్నతాధికారులని కలిశాడు. గోపాల్ అరెస్టు గురించి వివరించాడు. రాజకీయదురుద్దేశంతో టీస్టాల్ పడగొట్టేందుకు అడ్డం లేకుండా అతన్ని అరెస్టు చేశారని చెప్పారు. సాయంత్రానికి గోపాల్ విడుదల అయ్యాడు.

గవర్రాజు ఆరోజుకూడా తన కార్యక్రమాలు రద్దు చేసుకుని మధ్యాన్నమే రాజధానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. తన పర్యటన చివరికి ఇలా అభాసుపాలైనందుకు ఆయన లోలోన ఎంతో బాధపడ్డాడు. అధిష్టానవర్గానికి సంజాయిషీ ఇచ్చుకోవాల్సిన పరిస్థితి...

మర్నాడు గోపాల్ అదేస్థలంలో మళ్ళీ టీస్టాల్ తెరిచాడు. త్రివిక్రమరావు ప్రారంభోత్సవం చేశాడు- విజయగర్వంతో లోలోన నవ్వుకుంటూ.



ఆకాశంలో చంద్రుడు విరగబడి నవ్వుతున్నాడు. ఆ నవ్వులే భూమిమీద వెన్నెలై విరగ




బూస్తున్నాయి.

ఊరంతా నిద్రలోకి జోగుతున్నవేళ...

మోహిని అద్దెకు తీసుకున్నఫ్లాటు అది. డబుల్‌కాట్‌బెడ్‌మీద గవర్రాజు కూర్చునివున్నాడు. ఆయన ఒళ్ళో మోహిని.. మోహిని మెడలో వజ్రాలహారం... ఆ హారంతో ఆమె అందం రెట్టింపుగా కనిపించింది గవర్రాజుకి. హారం ధగధగలముందు చంద్రుని నవ్వులే వెలాతెలాపోతున్నాయి. గవర్రాజు గర్వంగా ఆమెవంక చూస్తున్నాడు.

మోహిని మనస్సు ఆనంద డోలికల్లో ఓలలాడుతోంది. గవర్రాజు ఆమెనీ, ఆమెమెడలోవున్న వజ్రాలహారాన్ని మార్చిమార్చి చూస్తున్నారు. ఆమె కళ్ళల్లో కాంతులు తన ప్రతిభనిమెచ్చుకుంటున్నట్టు అనిపించాయి గవర్రాజుకి.

గవర్రాజు కాక్‌టెయిల్ సేవిస్తున్నాడు. సిప్ సిప్‌కీ మోహిని జీడిపప్పు ఆయన నోటికందిస్తూ సాయపడుతోంది.

"ఇప్పటికైనా గురికుదిరిందా నామీద?" గవర్రాజుకి ఇప్పుడిప్పుడే నిషా ఎక్కుతోంది.

"అంటే?" ఆమె అదోలా చూస్తూ అడిగింది.

"నువ్వన్నా నీమాటన్నా నాకువిలువలేదని ఆడిపోసుకున్నావ్‌గా"

"వాట్‌డియర్... కోపంలో ఏదో అన్నాను. అవన్నీ గుర్తుంచుకోవాలా?" గవర్రాజు మెడచుట్టు చేతులేసి గారాలుపోయింది.

"మాటపట్టింపు నాకు జాస్తి" అప్పుడే ఒక పెగ్ పూర్తిచేశాడు.

"తోటివాళ్ళంతా చక్కగా సంపాదించుకుంటూ నగా, నట్రా కొనుక్కుంటుంటే నాకూ బాధేసి అన్నాను. ఆ మాత్రానికే నువ్విలా..."

"ఒకళ్ళతో మనకిపోత్తేమిటి? వాళ్ళకి మనకి ఆవగింజలో అరభాగం కూడా పోలికవుండకూడదు. అందుకే వాళ్ళ ఫక్కీలో కాకుండా నేను వేరేమార్గంలో నెక్లెస్ సంపాదించాను"

"మీరు తలుచుకుంటే ఏదైనా చెయ్యగలరని నాకు ముందే తెలును".

"దీనికోసం నేనెంతకష్టపడ్డానో తెలుసా? పైగా ఎన్నెన్నో విమర్శలు..."

"ఇంతడబ్బు వారంలో ఎట్లా సంపాదించారు?"

"కష్టపడి రాత్రింబవళ్ళు చెమటోడ్చి.."

"చందాలు పోగుచేశారా?"

"అలాగని పార్టీకి తెలిస్తే ఊరుకుంటారా?"

"హుండీలు పెట్టారా?"

"అదీ బహిరంగమే అవుతుంది"

"మరి ఎలా సంపాదించారీ నెక్లెస్?"

"ఏం? నువు తెలుసుకోవడం అంత అవసరమా?"

"ఏం... నాకు చెప్పకూడదా? మీ తెలివితేటలకు మరోసారి నీరాజనాలు పడదామని... నాదగ్గర కూడా మీకు రహస్యాలు ఉంటే చెప్పొద్దులెండి"

"ఓసోస్.. ఇంతలోనే అంతటెక్కా? నీదగ్గర రహస్యాలు దాచగలిగే శక్తిని ఎప్పుడో హరించేశావుగా"

"అది చెప్పండి ఇది చెప్పండి, అంటూ నేనేనాడూ మీవెంటపడలేదు"

"అవున్లేవోయ్... అదంతా నాబలహీనతని ఒప్పుకుంటున్నాగదా. ఇంతకీ ఈ రవ్వల నెక్లెస్ ఎలా వచ్చిందో చెప్పాలి- అంతేగా?"

"చెప్పకపోయినా నేనేం బాధపడను. ఏదో మీరు పాపం కష్టపడి చెమటోడ్చి సంపాదించానంటుంటే జాలికొద్దీ అడిగానంతే"

"పిచ్చిదానా... నీ మనస్సు నాకు ఆ మాత్రంతెలీదా! పర్యటనలో వేలకివేలు పూలదండలు వచ్చాయి. వాటిని వేలం వేయించాను. నా ప్రాపకంకోసం తపించే వాళ్ళంతా నాదృష్టిలోపడేందుకు వాటిని వేలం వెర్రిగా పాటపెంచేసి కొనేశారు. ఆ డబ్బుల్తో నీకోరిక నెరవేరింది"

గవర్రాజు చెప్పింది విని మోహిని ఆశ్చర్యపోయింది. ఇంతతేలిగ్గా లక్షలు సంపాదించవచ్చునని ఇప్పుడే తెలిసిందామెకి. ఆ మాటే గవర్రాజుతో అంది.

"అవును డియర్... తెలివితేటలు ఉండాలేగాని రాజకీయాల్లో జనంమీదపడి బతకటం చాలా తేలిక. ఎటొచ్చీ ఆ సంగతి జనానికి తెలియకుండా జాగ్రత్తపడాలి"

అతని ప్రతిభని మోహిని మెచ్చుకోకుండా



ఉండలేకపోయింది. ఆమె పొగడ్తలతో అతన్ని ముంచెత్తింది. గవర్రాజు పొంగిపోయాడు.

అప్పటికే క్వార్టర్ బాటిల్ పూర్తయింది. గవర్రాజు కళ్ళల్లో నిషా... మాటల్లో నిషా.. వారంరోజుల తర్వాత మోహిని పొందుకోసం అతని శరీరం తపిస్తోంది. ఆమెని తనవైపు తిప్పుకుంటూ అడిగాడు-

"ఇంతకీ నీకు ఈ హారం నచ్చిందో లేదో చెప్పలేదు"

హారం చూసి మోహిని ఉబ్బితబ్బిబ్బు అవడం మొదట్లోనే గమనించాడు. ఏదన్నా వంకపెడుతుందేమోనన్న అతని సంశయం తీరిపోయింది. హాయిగా గాలిపీల్చుకున్నాడు. తన ప్రతిభని మోహిని స్వయంగా అంగీకరించింది. హారం బాగుందన్న సంగతికూడా ఆమె నోటిమీదుగా వినాలని అతని తాపత్రయం. మోహిని ఓ నిముషంపాటు ఆలోచించింది. మెడలో హారాన్ని తీసి పట్టుకుంది.

"నాకు నచ్చింది... చాలా బాగా నచ్చింది. మరి మీకు?"

"వేసుకునేదానివి నువ్వు- నీకునచ్చాలి గదా"

"అవుననుకోండి. మీకు నచ్చితే నాకు నచ్చినట్టుకాదా?" నన్నాయినొక్కులు నొక్కడం మోహినికి వెన్నతోపెట్టిన విద్య.

"నాకు నచ్చితేనేగదా తెచ్చింది"

"ఇక్కడ మరో రెండు వజ్రాలువుంటే ఇంకెంతబావుండేదో" హారాన్ని గవర్రాజువైపు చూపిస్తూ అంది. గవర్రాజు ఏమీ మాట్లాడలేదు.

"కిందటిసారి మీ ఆర్థిక మంత్రిగారి భార్య మెడలో చూశాను అలాంటి హారం. చాలా బావుంది"

సమాధానం చెప్పేందుకు గవర్రాజు ఓ నిమిషం ఆలోచించాల్సి వచ్చింది. ఈ విషయంలో ఆమెని సమాధానపరచడం అంతతేలికైన పనిగా అనిపించలేదతనికి. జరిగిన విషయం చెప్పి ఆమెని తృప్తిపరచడం మినహా మరో మార్గం లేదు.

"నిజమే డియర్... ఇంకో రెండు వజ్రాలు ఉండివుంటే ఆ నెక్లెస్ నీమెడకి మరెంతగానో నప్పేది. అలాంటిదే తీసుకోవాలని మొదట అనుకున్నాను. తీరా నా పర్యటనలో అనుకోని అవాంతరం వచ్చిపడింది. కొంత నష్టపోయాను"

"నష్టమా... ఏమిటది?" కనుబొమలు ముడుస్తూ ఆశ్చర్యంగా అడిగింది.

"వెళ్ళిన మొదటిరోజే ఒక సభలో ప్రసంగిస్తుంటే తొక్కిసలాట జరిగి ఓ కుర్రాడు చచ్చిపోయాడు. జనం రెచ్చిపోతారేమోనని భయంవేసింది. సమయస్ఫూర్తితో లౌక్యం చూపాల్సివచ్చింది" గవర్రాజు మాటలు ముద్దగా వస్తున్నాయి. మోహిని గ్లాసు తీసిపక్కనపెట్టింది.

"ఏం చేశారు అప్పుడు మీరు?" ఆసక్తితో అడిగింది.

"ఆ సమయంలో నా మెడలో ఒక పూలదండ, నోట్లదండ ఉన్నాయి. రెంటికీ వేలాది రూపాయల విలువున్నా ఆ దండల్ని త్యాగంచెయ్యక తప్పలేదు. దండ ఆశవం మెళ్ళోవేసి రెండు కన్నీటిబొట్లు రాల్చాను. జనం శాంతించారు. అప్పటికి గండం గడిచింది. ఆ కుర్రాడు వయస్సులో చిన్నాడే అయినా చచ్చి నన్ను సాధించినంతపనిచేశాడు. ఆరోజు ఆ దండలేగనక మిగిలిఉంటే నువ్వీనాడు కోరుకున్నట్టు మరో రెండు వజ్రాలు నీమెడని ముద్దాడుతుండేవి"

"ఏమిటి డియర్... చేతికి చిలుము వదిలే లౌక్యం ప్రదర్శించకపోతేనేం?"

"ఏం చేసేది చెప్పు! అప్పటి పరిస్థితి అది. నీకో విషయం చెబుతాను విను. రాజకీయం ఒక రావణకాష్ఠం. దాన్ని నమ్ముకుని బతికేవాడికి, హంతకునికి అట్టే తేడా ఉండదు. హత్యచేసేవాడు అన్నిటికీ సిద్ధపడే ఆపని చేస్తాడు. తర్వాత వేలకి వేలు కుమ్మరించి కేసు మాఫీ చేయించుకుంటాడు. మన పరిస్థితీ అంతే! ఈ రంగంలో ఉన్నప్పుడు ఇలాంటి అవాంతరాలు సహజం. వాటన్నిటికీ సిద్ధపడే ఉండాలి. సమయానుకూలంగా కొన్నింటిని త్యాగంచేస్తుండాలి"

మోహిని చాలా శ్రద్ధగా విన్నది. గవర్రాజు చెప్పింది కూడా సబబుగానే తోచింది.

"పర్యటన మొదటిరోజు అలా జరిగింది. చివరి రెండురోజులు అసలు సభలకే వెళ్ళలేక




# నాగార్జునా సిమెంట్సువారి మినీ హాస్య కథ

ఉత్పాదకులు **యన్.సి.యల్. ఇండస్ట్రీస్** లిమిటెడ్

అదొక ఎలక్షన్ ప్రచారసభ. సభాస్థలి అంతా ఇసుక వేస్తే రాలనంత జనం. ఆ ఎలక్షన్లలో పోటీలో ఉన్నవి రెండు ప్రధాన పార్టీలు రంగంలో ఉన్నాయి. ఒకటి గద్దముక్కు పార్టీ, రెండు కుందేలు పార్టీ. ఇది గద్దముక్కు పార్టీ వారి ప్రచారసభ. ఈ పార్టీలో ప్రధాన అభ్యర్థి, ఈ నియోజకవర్గంలో పోటీ చేస్తున్నాడు. నెగ్గితే ముఖ్యమంత్రి కావాల్సిన అర్హతలున్న వాడు. జనం ప్రభంజనంలా ఉన్నారేమో అభ్యర్థి అపర కర్ణుడైపోతున్నాడు. వాగ్దానాల వర్షం కురిపిస్తున్నాడు.

నేను గెలిచి ముఖ్యమంత్రినైతే, కిలో బియ్యం రూపాయికే అందుబాటయ్యేలా చూస్తాను. అంతేకాదు, ఇళ్ళులేని వారందరికీ, పక్కా ఇళ్ళు కట్టిస్తాను. నా నియోజకవర్గంలో ఉన్న నిరుద్యోగులందరికీ, కనీసం దరఖాస్తు కూడా వేయనవసరం లేకుండా ఉద్యోగాలిప్పిస్తాను. జనం కరతాళధ్వనులు ఆ మైదానమంతా మారుమ్రోగాయి. ఉత్సాహం రెచ్చిపోయింది. వక్తకి ఈ ఎన్నికల్లో నన్ను గెలిపించిన పక్షంలో, ఈ నియోజకవర్గంలోని, ఇళ్ళన్నింటికీ గొళ్ళాలు పీకించేస్తాను. ఇది విని జనం విస్తుబోయారు. తేరుకుని, ఓ అమాయకుడు ప్రశ్నించాడు. "గొళ్ళాలు పీకించడం ఎందుకు?" అని.




MAM 118

అభ్యర్థి నవ్వుతూ సమాధానమిచ్చాడు. "నా పాలనలో అసలు దొంగతనాలే లేకుండా చేసేస్తాను. కనుక మీరంతా తలుపులు వేసుకోకుండానే నిద్రపోవచ్చు. అందుకని ఇక మీ ఇళ్ళకి గొళ్ళాలు అనవసరం కదా! అందుకే పీకించేస్తాను." ప్రేక్షకుల సంతోషం మిన్నుముట్టింది. సంతోషం పట్టలేక వాళ్ళంతా నృత్యాలు చేశారు. రెండురోజుల తర్వాత ఎలక్షను. మూడోరోజున ఫలితం. వాగ్దానాల వర్షం కురిపించిన గద్దముక్కు పార్టీ అభ్యర్థి చిత్తుగా ఓడిపోయాడు. కనీసం డిపాజిట్ కూడా దక్కలేదు. కుందేలు పార్టీ అభ్యర్థి, లక్ష ఓట్ల మెజారిటీతో గెలిచాడు. ఆశ్చర్యంలో దిమ్మతిరిగిపోయిన గద్దముక్కు పార్టీ అభ్యర్థికి, ఆ పార్టీ మెంబరొకడు అసలు విషయం వెల్లడించాడు. మీకన్నా వాగ్దానాలు కురిపించారు. కానీ అపోజిషన్ పార్టీ వాళ్ళు ఓటర్ల ఇళ్ళు బాగుచేయించుకోవడానికి, ఇంటికి పది బస్తాల నాగార్జున సిమెంట్ ఇస్తామని చెప్పారట. అయితే ఇన్నాళ్ళ నా రాజకీయ చరిత్రని, అపోజిషన్ వాళ్ళు, సిమెంట్ బస్తాలో కొట్టేశారన్నమాట. అన్నాడు అభ్యర్థి. అవును సార్, నాగార్జున సిమెంట్ నాణ్యతముందు, బంగారం కూడా దిగదుడుపేనన్నాడు పార్టీ మెంబరు. తెల్లమొహం వేశాడు అభ్యర్థి.

పోయాను. ఇది కూడా పెద్ద దెబ్బే"

"కానివ్వండి ఏం చేస్తాం. మనకి ఇంతవరకే ప్రాప్తం అని సరిపెట్టుకుందాం"

"ఏమిటి... నువు పూర్తిగా తృప్తిపడినట్టు లేదు"

"ఇక ఇప్పుడు చేసేది మాత్రం ఏముంటుందిగనుక"

"అదేమిటోయ్... అంత డీలాపడిపోతావ్. నీకోసం అంతగా రెక్కలు ముక్కలు చేసుకుని రవ్వల నెక్లెస్ తెచ్చిచ్చినవాడిని. నువ్విలా అసంతృప్తితోవుంటే నాకు ఎలావుంటుంది. అయిందేదో అయిపోయింది. ఈ లోటుతీర్చడానికి నేనేం చెయ్యాలో చెప్పు. ఏదైనా చిన్నకోరిక కోరుకో- తీరుస్తా"

గవర్రాజు ఇప్పుడిప్పుడే దారిలోకి వస్తున్నాడు. మోహిని కూడా ఈ పరిస్థితి కోసమే ఎదురుచూస్తోంది. గవర్రాజు అడిగాడుకదాని వెంటనే బైటపడటం ఆమెకి ఇష్టం లేదు. అతనిచేత ఒకటికి నాలుగుసార్లు చెప్పించి హామీ తీసుకోవాలి; ఆ తర్వాత తన మనసులో మాట బయటపెట్టాలి అనుకుంది.

"ఏమోబాబూ... ఏదన్నా కోరుకోవడమంటేనే భయంగా ఉంది"

"అదేం?" గవర్రాజుకి అంతు చిక్కలేదు.

"ఏరికోరి రవ్వలనెక్లెస్ కోరుకున్ననేరానికి ఏంచేశారు చెప్పండి? పెద్దశిక్ష వేశారు. ఏళ్ళతరబడి ఎదురుచూపులతో ఊరించారు. అంతగా ఎదురుచూసి ఇప్పుడు మెడలో వేసుకున్నా వేసుకున్నట్టే ఉండదు"

"అవును డియర్... ఆడదాని కోరిక పాదరసంలాంటిది. అప్పటికప్పుడు తీరితేనే దానికి విలువ"

"మీకు అన్నీతెలును. కాని అమలులో మాత్రంపెట్టరు"

"ఈసారి అలా జరగదని హామీ ఇస్తున్నాను... నరేనా" మోహిని చేతిలో చెయ్యేసి మరో భరోసా ఇచ్చాడు. ఎలా ప్రారంభించాలా అని మోహిని ఆలోచనలోపడింది. క్షణాలు దొర్లుతున్నాయి. గవర్రాజు మోహినిని రెండు చేతులతో పొదివిపట్టుకుని ఆమె పెదాలు ముద్దాడుతున్నాడు. గవర్రాజు మంచిమూడ్‌లో ఉన్నాడు. గ్లాస్‌లో కొంచెం విస్కీ వొంచింది మోహిని. ఐస్‌వాటర్ కలిపి గవర్రాజు పెదాలకి అందించింది. గవర్రాజు ఈ లోకాన్నే మరిచిపోతున్నాడు.

మోహిని గవర్రాజు భుజంమీద మోచెయ్యి ఆనించింది. రెండో చేత్తో అతని గుండెమీద నవరిస్తోంది. గవర్రాజు మనస్సు ఆనందానుభూతిలో తేలిపోతోంది.

"నాకంటే మీకు ఆప్తులు ఎవరూలేరని అదేపనిగా చెబుతుంటారుగదా..." అంటూ ప్రారంభించింది మోహిని.

"అవును... ఇప్పుడూ చెబుతాను- ఢంకా భజాయించి మరీచెబుతాను" అంటూ మంచంపట్టె మీద చేత్తో గుద్దుతున్నాడు గవర్రాజు. మోహిని అతన్ని వారించింది.

"నువ్వు నాకు ఆప్తురాలివి కాకపోతే నెలకి రెండువేల రూపాయల అద్దె ఇచ్చి నిన్నీఫ్లాటులో ఎందుకు వుంచుతాను. నలుగురినోళ్ళల్లో నానుతూ నీమెడలో ఆ నెక్లెస్ ఎలా దిగేస్తాను. ఇంతకంటే సాక్ష్యం ఇంకేం కావాలి చెప్పు?" గవర్రాజు ఆవేశంగా అంటున్నాడు.

"అందుకే డియర్... నువు నాకోసం ఇంతగా శ్రమిస్తున్నావ్‌గదా! నేనునీకు ఏవిధంగానైనా సాయపడటంలేదేనని నామనస్సు ఈమధ్య తెగబాధపడుతోంది. నన్నింతగా ప్రేమించే నీకు నీదైనందిన రాజకీయాల్లో చేదోడు వాదోడుగా ఉంటూ నీకు కొంచెంలో కొంచెమైనా శ్రమతగ్గించాలని నా అంతరాత్మ చెబుతోంది" ఒక్కొక్క మాట అంటూనే గవర్రాజు ముఖంలోకి నిశితంగా చూస్తోంది. అతని ముఖంలో రంగులు మారుతున్నట్టు గ్రహించింది.

గవర్రాజు ఒక్కక్షణం తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె చెబుతున్నదేమిటో ఓపట్టాన తలకెక్కలేదు.

మోహిని గవర్రాజు ముఖంలోకి మత్తుగా చూస్తోంది. అతని తలలోకి వేళ్ళు పోనిచ్చి చుబుకాన్ని చుంబించింది. గవర్రాజు అదుపు తప్పుతున్నాడు. మోహిని అతన్ని అదుపులో పెడుతోంది.

"మీపార్టీ ఆడవాళ్ళ ఆదరణ కోల్పోతున్నదని మీరే చెప్పారు- గుర్తుందా? పార్టీ సంగతి వదిలెయ్యండి. ఈసారి ఎన్నికల్లో మీ నియోజక




పర్గంవరకైనా ఆడవాళ్ళ ఓట్లు చేజిక్కించుకోక పోతే మీ పరిస్థితి ఏమిటా అని నాకు ఇప్పటి నుంచే దిగులుపట్టుకుంది. మీ మంచిచెడ్డలు నాకు కాకపోతే మరెవరికిపడతాయి? ఈ విషయం మీతో మాట్లాడాలని ఎప్పటినుంచో అనుకుంటున్నాను. సమయం కుదరక వాయి దాపడుతూ వచ్చింది. ఆలోచించండి... మీ కంటూ ఓట్లు ఆకర్షించేందుకు మహిళా ప్రతి నిధులు ఎవ్వరూలేరు. పర్వతవర్ధని ఉన్నా ఆమె స్వార్థం ఆమెది. ఈ పరిస్థితుల్లో మీ బాగోగులు నా భుజాలమీదే వేసుకోవాలనుకు న్నాను... ఏమంటారు?''

చెప్పడం ఆపి గవర్రాజు ముఖంలోకి చూ సింది మోహిని.

అతనిలో ఆలోచన మొదలైంది. మోహిని చెబుతున్న ఒక్కొక్క మాటా ఒక పెగ్ స్కాచ్ విస్కీ అంతబలంగా పనిచేస్తోంది. మందులో ఉన్నప్పుడు 'తన', 'మన' అనే సెంటిమెంట్ గవర్రాజుమీద బాగా పనిచేస్తుందని మోహినికి తెలుసు. అందుకే ఆ అస్త్రం ప్రయోగించింది. గవర్రాజు మనస్సులో ఘర్షణ మొదలైంది.

మోహిని చెప్పిన విషయాలన్నీ తరిచి తరచి ఆలోచించాడు. ఆమె చెప్పినదాన్లో ప్రతి అక్షరమూ నిజమేననిపించింది.

''ఏ కాలక్షేపమూలేకుండా జీవితం ఇలా నిస్సారంగా గడపటం నాకు ఏ మాత్రం ఇష్టంలేదు. రాజకీయాల్లో చేరి మీకు చేదోడువా దోడుగా వుండాలని నిర్ణయించుకున్నాను'' మోహిని చెప్పాల్సిందంతా చెప్పేసింది. ఇక అతని సమాధానమే రావాలి. గవర్రాజు ము ఖంలోకి చూస్తోంది. ఎంతసేపైనా అతని నుంచి సమాధానంలేదు. మోహినిలో సహనం నశించింది. క్షణంలో మంచంమీదనుంచి లేచింది.

''ఏమిటి - మీకిష్టంలేదా? లేకపోతే మానె య్యండి ఫర్వాలేదు''

మోహిని రుసరుసలాడితే గవర్రాజు డీలాప డిపోతాడు. అది అతని బలహీనత. వెంటనే జవాబిచ్చాడు.

''ఇష్టంలేకకాదు. నిన్ను ఎట్లా రంగప్రవేశం చేయించాలా అన్నదే అర్థంకావడంలేదు''

మోహిని ముఖం చాటంత అయింది. కిలకి లనవ్వుతూ వచ్చి గవర్రాజుని కౌగిలించు కుంది. ముఖాన్ని ముద్దులతో ముంచెత్తింది. అతను ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

మోహిని ఒకటికి పదిరకాల మార్గాలు సూ చించింది. గవర్రాజు అనేక ధర్మసందేహాలు లేవనెత్తాడు. చివరికి ఇద్దరూ ఒక అంగీకారాని కి రాగలిగారు.

గవర్రాజు ఇంతత్వరగా ఒప్పుకుంటాడని మోహిని అనుకోలేదు. రవ్వలనెక్లెస్ వచ్చిన వేళా విశేషం తన పథకానికి నజావుగానే నాందిపడిందని భావించిందామె. రవ్వలనె క్లెస్‌లో కొరవడిన రెండు వజ్రాలే తన రాజకీ యజీవితానికి సోపానాలు అనుకుంది.

ఆమె మనస్సు చాలావేగంగా ఆలోచిస్తోంది. తన రాజకీయ భవిష్యత్ వ్యూహానికి మనస్సు లోనే రూపకల్పనచేస్తోంది.

ఇంతలో ఫోన్‌మోగింది. మోహిని రిసీవ్‌చే సుకుంది. అవతలివైపు నుంచి వీరభద్రం. మోహిని కొంచెం ఇబ్బందిపడింది. అవతల వీరభద్రం పిలుస్తున్నాడు అదేపనిగా.

''హలో ... ఆఁ ... చెప్పండి ...'' అంది ఇబ్బందిగానే. వీరభద్రం నాలుగుముక్కల్లో ముగించి ఫోన్ కట్‌చేశాడు.

''ఎవరది?'' గవర్రాజు ప్రశ్నకి ఆమె టక్కున జవాబిచ్చింది - రాంగ్ నంబర్ అంటూ.

మరో పదినిమిషాలకి గవర్రాజు కొంచెం రిలాక్స్ అయ్యాడు. సిగార్ ముట్టించాడు. మళ్లీ హుషారువచ్చింది. ఉన్నట్టుండి అతనికి మందాకిని గుర్తొచ్చింది.

''అవునూ .. నేను ఎన్నిసార్లు వచ్చినా మీ చెల్లెలు కనిపించదేం?'' అనుమానంగా అడి గాడు.

''ఎప్పుడో ఒకప్పుడు గవర్రాజు అడుగుతా డని మోహినికి తెలుసు. అందుకే సమాధా నంకూడా ఎపుడో సిద్ధంచేసుకుని వుంచు కుంది. అబద్ధం ఆడటానికిముందు నిష్ఠూరం ఆడటం మోహిని అలవాటు. అందుకే అన్నది - ''నా చెల్లెలు ఇప్పటికి గుర్తుకొచ్చిందన్న మాట?''

''లేదు ... రోజూ అడుగుదామనే అను

ఉంటాను - తరా మరిచిపోతున్నాను''

"అవున్లెండి ... మేమంటే ఎంతశ్రద్ధో దీన్ని బట్టే తెలుస్తోంది''

గవర్రాజు ఏమీ మాట్లాడదలుచుకోలేదు. మౌనం వహించాడు. ఇందులోనూ తనదే తప్పు అని అనిపించింది. మోహిని నిష్ఠూరం చెయ్యడంలో అర్థంవుందనిపించింది. అందుకే మాట్లాడలేదు. కాస్సేపాగి మోహిని చెప్పింది - మందాకిని ఇంతవరకు ఈ వూరురానందున ఈవూరు తనకెంతగానో నచ్చింది. వచ్చినదగ్గరనుంచి ఇంట్లో ఒక్కక్షణంకూడా వుండటంలేదు. దాదాపు రోజూ మోహిని కూడా వెంటవెళుతోంది. గవర్రాజు వస్తాడని ఈరోజు ఆమె వెళ్లలేదు. మందాకిని ఒక్కతే వెళ్లింది.

"మీరు ఇంతవరకు నాచెల్లెల్ని చూడనేలేదుగా. మీరు వస్తారని చెబితే నిన్న ఓగంట సేపు ఎదురుచూసింది కూడా. మీరాకపోకలేమో వానరాకడ, ప్రాణం పోకడ తెలీవన్నట్టు వుంటాయి''

"ఫర్వాలేదులే. కానివ్వు ... రేపు ఎప్పుడైనా వీలుదొరికినప్పుడు వస్తాను''

"రేపు వెళ్లిపోతాను అంటున్నది''

"ఏం ... అంతతొందర?''

"ఏమో మరి ... ఎవరి తొందరలువాళ్లవి''

"వెళ్లొచ్చులే ... నువు వుండమనలేదా?''

"నేనైతే అసలు ఎప్పటికీ ఇక్కడే వుండిపొమ్మన్నాను.''

"ఏమంది?''

"మీరు కూడాచెప్పి చూడండి. మీరు చెబితే వినొచ్చని నాకనిపిస్తున్నది''

"సరే ... అయితే రేపుగట్టిగా ఇంటిదగ్గర వుండమనిచెప్పు - నేనొస్తాను''

గవర్రాజుతో మాట్లాడుతున్నదేగాని మోహిని మనసంతా ఎక్కడెక్కడో ఆలోచిస్తోంది. ఏ క్షణంలోనైనా ఫోన్ మోగవచ్చు. ఫోన్‌మోగిన మరుక్షణం ఒక నాటకానికి తెరలేస్తుంది. తెరలేచిన దగ్గరనుంచి మళ్లీ తెర దించేవరకు ప్రధానసూత్రధారి తనే. ఈ నాటకాన్ని రక్తికట్టించడం తన కర్తవ్యం, ఒక బాధ్యత. వీరభద్రానికి ఇచ్చినమాట నిలబెట్టుకోవాలంటే ఇది తప్పనిసరి.

అబద్ధం చెప్పడం తనకి ఏమంతకష్టం కాదు. కాని ఎందుకో ఈ నాటకం అంటేనే గుండెల్లో వణుకుపుడుతోంది. దీని జయాపజయాలు పూర్తిగా తనమీదే ఆధారపడివున్నాయి. గవర్రాజువైపు ఒకసారి చూసింది. అతనిమీద జాలేసింది. అతన్ని ఇప్పటికి ఎన్నిరకాలుగా మోసగించింది. అతనిదగ్గర తను చెప్పేది ప్రతిదీ అబద్ధమే. ఇవన్నీ చాలవన్నట్టు ఇప్పుడు మరొక నాటకం. ఈ మాయదారి జీవితం ఇంకెన్నాళ్లు? అవతల వీరభద్రం, ఇవతల గవర్రాజు - రెండూ రెండుకత్తులు. వీళ్లిద్దరిమధ్య తను. వాళ్లిద్దరికీ స్వార్థమే వూపిరి. అదే తనకిప్పుడు జీవిత ధ్యేయం అయింది. మనస్సు తీవ్రంగా ఆలోచిస్తుండటంతో మోహిని కళ్లు భారంగా వున్నాయి. దిండుమీద తలఆనించి, కళ్లుమూసుకుని అలాగే కూర్చుండిపోయింది.

అయిదు నిముషాలు ఆగదిలో నిశ్శబ్దమే మిగిలింది. గవర్రాజు లేచి ప్రయాణమయ్యాడు. వెళ్లబోతూ మోహిని భుజంమీద చెయ్యేశాడు. ఆమె తలఎత్తిచూసింది. కళ్లల్లో అదోరకం నిర్వేదం గూడుకట్టుకునుంది. గవర్రాజు వెళ్లబోయేవాడల్లా ఆగిపోయాడు.

"ఏమిటి అలావున్నావ్?'' అంటూ ఆమెని లేపాడు.

ఏంచెప్పాలో తెలీలేదు. ఏమని చెబుతుంది తనలోని అంతర్మథనం? అతని గుండెలమీద మౌనంగా వాలిపోయింది.

"నువ్వు ఇందాక అడిగినదానిగురించి బెంగపడుతున్నావా?''

కాదన్నట్టు తలూపింది.

ఇంతలో ఆమె కర్ణపుటాల్ని ఛేదిస్తూ గదిలో ఫోన్‌మోగింది. మోహిని ఫోన్ ఎత్తింది. గవర్రాజు అలాగే నిలబడివున్నాడు. అవతలివైపు నుంచి మగగొంతు మాట్లాడుతున్నట్టు స్పష్టంగా తెలుస్తున్నది. మాటలు మాత్రం అర్థంకావడంలేదు. ఏకబిగిన నిముషంపాటు అవతలి నుంచి మాటలు వినిపించాయి. క్షణం క్షణం మోహిని ముఖంలో రంగులుమారుతున్నాయి. మధ్య మధ్యలో గవర్రాజువైపు అయోమయంగా చూస్తోంది. ఆమెలో కంగారు అధికమవుతోంది.

"ఎవరు మోహినీ ... ఏమైంది?" అతనికే మీ అర్థంగాక ఆత్రంగా ప్రశ్నించాడు.

ఆ మాటలు వినిపించుకునే స్థితిలో లేదామె. 'ఎవరు నువ్వు?' అంటూ రెండుమూడు సార్లు ఫోన్‌లో ప్రశ్నించింది. ఆ ప్రశ్నకి అవతలినుంచి సమాధానం రాలేదని ఆమె ముఖకవళికలే చెబుతున్నాయి. ఫోన్‌లో డయల్‌టోన్ వినిపించడంతో ఆమె నిరాశగా రిసీవర్ని హుక్‌మీదపెట్టేసి అక్కడే కుప్పలా కూలిపోయింది. గవర్రాజు ఆమెని సమీపించాడు. ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది.

"మోహినీ ... ఏమిటి ... ఏమైంది?" ఆమె భుజాలు పట్టుకుని కుదుపుతూ పదేపదే అడిగాడు. ఏడుపుమినహా ఆమెనుంచి ఎలాంటి సమాధానమూ రాలేదు. మోహినిని ఓదార్చడం అతనివల్లకాలేదు.

మోహిని కళ్లవెంట నీళ్లు గవర్రాజు ఎన్నడూ చూడలేదు. నవ్వుతూ తుళ్లుతూవుండే మోహిని రూపమే అతనికి తెలును. కాకపోతే అప్పుడప్పుడు ఆమె కళ్లల్లో ఎర్రజీరలూ పరిచయమే. కాని శోకమూర్తిగా మోహినిని అతనెన్నడూ చూడలేదు. కనీసం ఊహించనైనాలేదు. అందుకే ఈ పరిస్థితి అతనికి చాలా ఇబ్బందిగావుంది. మోహినిని ఓదార్చేందుకు నానా తంటాలుపడ్డాడు. పావుగంటకిగాని ఆమె తేరుకోలేదు. అప్పుడు మళ్లీఅడిగాడు - అసలు విషయమేమిటో చెప్పమని. కళ్లల్లోనుంచి ఇంకా నీటిధారలు ఆగలేదు. వెక్కిళ్లమధ్య ఆగిఆగి చెప్పింది-

"నా చెల్లెల్ని కిడ్నాప్‌చేశారు"

గవర్రాజునెత్తిన పిడుగుపడ్డట్టయింది. తన ముఖంమీదనే హైపవర్ గ్రెనేడ్ పేల్చినంతగా అదిరిపడ్డాడు. నిముషంపాటు అతని మెదడు మొద్దుబారిపోయింది.

వెక్కిళ్లమధ్య మోహిని పాడిపాడిగా ఏడుస్తూనేవుంది. గవర్రాజు ఒంట్లోమత్తు పూర్తిగా దిగిపోయింది. అతని మనస్సు రకరకాలుగా ఆలోచించసాగింది. ముఖ్యంగా ఈ కిడ్నాప్‌కీ, తన రాజకీయభవితవ్యానికీ ఎక్కడన్నా లింకు వుండివుంటుందేమోనన్న సందేహం అతని బుర్రని తొలిచేస్తున్నది. ఫోన్‌చేసినవ్యక్తి ఎవరు? అతనికి మందాకిని ఎలాతెలుసు? మందాకిని మోహిని చెల్లెలు అని ఎలాతెలుసు? అతని లక్ష్యం ఏమిటి? - మొదటి మూడుప్రశ్నలకి జవాబు మోహినిదగ్గరలేదు. గవర్రాజుకి ఆమె చెప్పిందల్లా ఒక్కటే - "పాతిక వేలు ఇచ్చి విడిపించుకుపొమ్మన్నాడు" ఆమె ఏడుపు ఆపలేదు.

గవర్రాజు మోహినిని సముదాయించాడు. మెల్లిగాలేపి మంచంమీద కూర్చోబెట్టాడు. ఆమెలో తెరలుతెరలుగా దుఃఖం పొంగుకువస్తోంది. గవర్రాజు భుజంమీద చేతులేసి ఏడుస్తూనే అంది "ఏమండీ - మాట్లాడండీ ... ఏం చేద్దామో చెప్పరేమండీ?" ఏడ్చి ఏడ్చి ఆమె గొంతు బొంగురుపోయింది.

"అదే ఆలోచిస్తున్నాను. వాళ్లు ఎవరైవుంటారో అంతుచిక్కడంలేదు" గవర్రాజులో ఆందోళన గూడుకట్టుకుంది.

"నాకీ ఊళ్లో మీరు తప్పలోకమేతెలీదు. నా చెల్లెలు నిన్న మొన్నవచ్చింది. మాకు ఇక్కడ శత్రువులు ఎవరుంటారు చెప్పండి?"

అంటే ఏమిటి మోహిని ఉద్దేశం? తన రాజకీయ శత్రువులెవరో ఈపని చేశారనా? ఈ ఆలోచనే అతని మనస్సులోనుంచి ప్రశ్నరూపంలో బైటపడింది.

"మీరే ఆలోచించండి... మీ జీవితం కత్తుల బోను అనీ, మిమ్మల్ని రాజకీయంగా పతనం చేసేందుకు వేలాది కళ్ళు అనునిత్యం మీచుట్టు తిరుగుతుంటాయని మీరే చెబుతుంటారు గదా" మోహిని మాటలు అతనిలో మరింతగా గుబులు పుట్టిస్తున్నాయి. మోహినికి అంటూ శత్రువు లెవరు వుంటారు? మందాకిని ఈ వూరికి కొత్త.

"మీరంటే గిట్టని వాళ్ళు మనల్ని చూసి ఈర్ష్యతో ఈ పనిచేసి వుంటారు"

మోహిని మాటలు గవార్రాజు మీద పనిచేయడం ప్రారంభించాయి.

"నిన్నమొన్నటి మీ పర్యటన మీ ప్రత్యర్థుల పక్కలో బల్లెం అయివుంటుంది"

ఏడ్చిఏడ్చి మోహిని రొప్పుతోంది. ఆమె గుండె ఎగిరెగిరిపడుతోంది. కళ్ళు వుబ్బాయి. బుగ్గలమీద నీటిచారికలు ఎండిపోయాయి.

"మీరు శ్రద్ధ తీసుకుని పోలీసు రిపోర్టు ఇవ్వండి"



ఒక్కక్షణం ఆమె ముఖంలోకి చూశాడు. పోలీసు రిపోర్టు ఇవ్వాల్సిన వ్యవహారంకాదిది. ఏమని ఇస్తాడు? ఎవరని ఇస్తాడు? ఆమెకీ, తనకీ ఏమిటని సంబంధం? రాజకీయపరంగా తనకెన్నో చిక్కులు ఎదురు అవుతాయని నిర్ధారించుకున్నాడు. అలాగని పట్టించుకోకుండా కూర్చుంటే... రేపు ఆవిడ ప్రాణాలు పోతే... వ్యవహారమంతా పబ్లిక్ అవుతుంది. పత్రికలకు ఎక్కిన ఏ గొడవా అంత తేలికగా సమసిపోదు. ఎవరీ మందాకిని? ఎవరీ మోహిని? అంటూ తీగెలాగుతారు. అప్పుడు తన గుట్టురట్టు అవుతుంది. తన రాజకీయజీవితంలో ఇది మాయనిమచ్చగా మిగిలిపోతుంది.

అన్నికోణాల్లోనుంచీ గవర్రాజు సమస్యని పరిశీలిస్తున్నాడు నిశితంగా.

"చెప్పండి... పోలీసుల సాయం తీసుకుంటారా?"

"ఈ వ్యవహారాన్ని పోలీసుల చేతిలో పెడితే మన వ్యవహారమే రచ్చకెక్కుతుంది తెలుసా?" మోహినిలో ఏడుపు పొర్లుకువచ్చింది. గవర్రాజు సముదాయించబోయాడు.

"ఐతే నా చెల్లెలి గతి అంతేనా?" గవర్రాజుని దీనంగా అర్థిస్తోంది.

ఎన్నివిధాలుగా ఆలోచించినా గవర్రాజుకి ఒక్కటే సరైన పరిష్కారం కనిపించింది. పాతికవేలు మనవి కాదు అనుకుంటే ప్రస్తుతానికి గండం గట్టెక్కుతుంది. ఈ డబ్బు అయినా సొంత జేబునుంచి ఖర్చుపెట్టాల్సిన పనిలేదు. సమయానికి వీరభద్రం ఇచ్చిన పాతికవేలూ ఇందుకు ఉపయోగపడతాయి. ఇటు పరువు మిగులుతుంది. అటు మోహినినీ సంతోషపెట్టినట్టు వుంటుంది.

"ఏడవకు మోహిని... లే... రేప్పొద్దునే ఆ డబ్బు వాడి మొఖాన కొట్టి మందాకినిని విడిపించుకుందాం- సరేనా?"

"అవని కూడా మీరే దగ్గరవుంది..." మోహిని మధ్యలోనే ఆపింది.

గవర్రాజు ఖంగుతిన్నాడు. ఈ వ్యవహారం ఏమీ తనకి అంటకుండా జాగ్రత్తపడాలని అనుకుంటుంటే మోహిని అలా అడగటం అతనికి ఇబ్బంది కలిగించింది.

"ప్లీజ్ మోహినీ... దయచేసి నన్ను ఇరకాటంలో పెట్టొద్దు. ఎందుకు చెబుతున్నానో అర్థంచేసుకో. నేను మనగురించే ఆలోచిస్తున్నాను. నేరుగా నేను జోక్యం చేసుకోవడం మనిద్దరికీ అంతమంచిదికాదు. రేపు ఉదయాన్నే భరత్‌కి డబ్బిచ్చి పంపుతాను. నువ్వు ఒక్కదానివీ వెళ్లిరావడమే మంచిది" మొత్తానికి మోహినికి నచ్చచెప్పగలిగాడు.

★ ★ ★

సరిగ్గా ఆ సమయంలోనే భూపాలరావు గెస్ట్‌హౌస్‌లో వుంది మందాకిని. ఆమె వీడియో చూస్తున్నది. భూపాలరావు ఆమెనే గమనిస్తున్నాడు.

మందాకిని చాలా సరదాగా వుంటుంది. ఎదుటివారిముందు మోహిని పెద్దరికం ప్రదర్శిస్తుంది. ఆ హుందాతనంతోనే ఆమె మనుషుల్ని కట్టిపడేస్తుంది. కాని మందాకిని అలా కాదు. కలుపుగోలుగా వుంటుంది. దానికితోడు చలాకీతనం అన్నివయసులవారినీ ఇట్టే ఆకర్షిస్తుంది.

ఆరోజు పార్టీలో వీరభద్రం భూపాలరావుకి పరిచయం చేశాక మోహిని సలహాతో మందాకిని చొరవ తీసుకుంది. ఆ రోజు భూపాలరావుని ఇంటి దగ్గర దించి అదే కారులో మందాకిని వెళ్ళిపోయింది. ఆ కారు అప్పగించేందుకు మర్నాడు ఉదయమే మందాకిని భూపాలరావు ఇంటికెళ్ళింది. ఆమె చెప్పేదాకా కారు సంగతే గుర్తురాలేదు అతనికి. కారు తాళాలు ఇచ్చేసి వెనుదిరిగింది. "అప్పుడే వెళ్ళిపోతారా?" అన్న భూపాలరావు మాటలతో మందాకిని ఆగిపోయింది. నవ్వుతూ ఆయన ముఖంలోకి చూసింది. ఆయన లోనికి ఆహ్వానించాడు. రెండుమూడు గదులు దాటాక విశాలమైన హాలులోకి ప్రవేశించారు. అది ఆయన డ్రాయింగ్‌రూం అని అలంకరణలను బట్టి అర్థం చేసుకుంది మందాకిని. అంతపెద్ద భవంతిలో ఎక్కడా జనసంచారం కనిపించడంలేదు. కూర్చోమని సోఫా చూపించాడు. ఆమె కూర్చుంది. భూపాలరావు మరో సోఫాలో కూర్చున్నాడు. రెండునిముషాలు గడిచాయి. వాళ్ళిద్దరి మధ్యా నిశ్శబ్దమే రాజ్యమేలింది. "రాత్రి మీకు థాంక్స్ కూడా చెప్పలేదు"




సంభాషణ మొదలు పెట్టడా [illegible]
పాయింట్ దొరికింది. మందాకినికి అనలా విషయమే గుర్తులేదు.

"అది థాంక్స్ చెప్పాల్సినంత ఘనకార్యమా?" నవ్వుతూ అన్నది.

"అలాగని కాదు చెప్పడం నా కనీస మర్యాద కదా"

"మరైతే నేనూ ఇప్పుడు మీకు థాంక్స్ చెప్పాలి" అన్నదామె.

అర్థంకాక ఎందుకన్నట్టు చూశాడు ఆమె వైపు.

"మీ కారు తీసుకెళ్లారు గదా"

"ఓస్... ఆ మాత్రానికే..." అంటూ నవ్వేశాడు భూపాలరావు. ఆమె కూడా నవ్వింది. భూపాలరావు వయస్సు ముప్పయ్ ఐదు నలభై మధ్య వుంటుంది. డబ్బు బలంతో రాజకీయాల్లోకి వచ్చి, ఆ బలంతోనే పైకి రాగలిగాడు. ఆయనకి నా అన్నవాళ్ళెవరూ లేరు. భార్య చనిపోయింది. పిల్లలు లేరు. మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. సొంతవూళ్ళో ఆస్తులన్నీ అమ్ముకుని పట్టణంలో సెటిలయ్యాడు.

నౌకర్ని పిలిచి కాఫీ తెమ్మన్నాడు. ఐదు నిముషాల్లో కాఫీ వచ్చింది. ఇద్దరూ కాఫీ తాగడం మొదలెట్టారు.

"అప్పుడప్పుడు వస్తూ వుండండి" మర్యాద పూర్వకంగా చెప్పాడు భూపాలరావు.

"ఓ... తప్పకుండా" చెప్పిందామె. కాఫీ తాగడం పూర్తయింది.

"మీరు వుండేది ఎక్కడ?" మామూలుగానే అడిగాడు. అయినా మందాకిని కొంచెం ఇబ్బంది పడింది. కాసేపు తటపటాయించి ఫోన్ నంబరు చెప్పింది. తానే వచ్చిపోతుంటానని చెప్పి సెలవు తీసుకుని బయలుదేరింది.

"ఎలా వెళతారు?" భూపాలరావు ప్రశ్నించాడు. ఆమెతోబాటు మెయిన్‌గేటు దాకా వచ్చాడు.

"ఆటోలో వెళతాను" అంది.

"పోనీ నేను కారులో డ్రాప్ చెయ్యనా?"

"అబ్బే అక్కర్లేదు... నేను వెళతాను" అంటూ బైటపడింది. రోడ్డుమీదికి వచ్చి ఆటో ఎక్కింది. ఆ తర్వాత అప్పుడప్పుడు భూపాలరావుని కలుస్తూనే వుంది. ఆయన రెండుసార్లు

[illegible]
రావు తనపట్ల ఆకర్షితుడవుతున్నాడని ఆయన వైఖరినిబట్టి మందాకిని అర్థం చేసుకుంది. ఎప్పుడన్నా రెండురోజులు కనిపించకపోతే భూపాలరావు ఫోన్ చేస్తాడు.

మందాకిని ఆయనలో ఆలోచనలు రేకెత్తిస్తోంది. చాలా ఏళ్ల తర్వాత అతని మనస్సు ఆడదాని వైపు మొగ్గు చూపుతోంది. మందాకినిని నువు అంటూ చనువుగా మాట్లాడుతున్నాడు. రోజులు గడుస్తున్నాకొద్దీ ఆమెని రోజుకి ఒకసారైనా చూడాలనిపిస్తోంది ఆయనకి.

వీడియో ఫిల్మ్ పూర్తయింది. భూపాలరావు మరో కేసెట్ ఆన్ చేశాడు. మందాకిని వారించలేదు. ఇద్దరూ పక్కపక్కనే కూర్చుని వీడియో చూస్తున్నారు. ఇద్దరి మనసుల్లో చెప్పలేని ఆందోళన. ఎవరికి వారు యాధృచ్ఛికంగా వీడియో చూస్తున్నారేగాని మనస్సులు మాత్రం వేరే ఆలోచనలో వున్నాయి.

ఉన్నట్టుండి భూపాలరావు మందాకిని భుజం మీద చెయ్యేశాడు. ఆమె ఆలోచనలకి అంతరాయం కలిగింది. భూపాలరావు వైపుతలతిప్పి చూసింది. కాని వారించలేదు. భూపాలరావు కళ్ళు ఆమెవైపు ఆశగా చూస్తున్నాయి. ఆ కళ్లల్లో కోరిక ఆమెకి అర్థమైంది. అతనికి మరింత దగ్గరగా జరిగింది. భూపాలరావు కోరిక రెక్కలు విచ్చుకుంది.

"మందాకినీ నువు రోజూ వచ్చిపోతుంటావు కదూ?" అతని మాటలు కూడా మత్తెక్కాయి.

"మనకి అంత అదృష్టం లేదండీ" భూపాలరావు మెడచుట్టు వేసిన చేతుల్ని విడదీస్తూ అంది.

"ఏం... ఎందుకని?" నిరాశగా అన్నాడు.

"మా అక్క రేపే నన్ను వూరు పంపేస్తానంటోంది"

"అదేమిటి... ఎందుకలా?" మందాకిని చెబుతున్నదంతా నమ్మేస్తున్నాడు.

"ఎందుకేముంది... వూరు చూసిపోదామని వచ్చాను... చూశాను ఇక వెళ్లాల్సిందేగా"

"నిజంగా నీకు వెళ్ళాలని వుందా?"

"ఏం... అలా అడిగారు?"

"నాకైతే నువ్వు వెళ్ళడం అనలే మాత్రం ఇష్టంలేదు. ఇట్టే పరిచయమై అట్టే వెళ్లిపో వడం ఏమిటి? మన పరిచయానికి ఏమాత్రం అర్థంలేనట్టే"

"నాకూ అలాగే అనిపిస్తోంది. కాని అక్కేమో..."

"బలవంతం చేస్తోందంటావ్"

"అనికాదు... ఆమె మాట వినాలి కదా"

"వినకపోతే కొంపలు మునుగుతాయా?'

"ఆమెకి కోపం వస్తుంది"

"ఆమె మాట వినకపోతే కోపం వస్తుంది. అంతేగా?"

"అవును"

"ఆమెకి కోపం రాకుండా మాట వినేశెయ్"

"అంటే వెళ్ళిపోక తప్పదు మరి"

"ఆమె మాట విను... అంతవరకే. ఆ తర్వాత ఏంజరిగేదీ ఆవిడకి తెలీనివ్వకు" మందాకినికి ఏమీ అర్థంకాలేదు. అయోమ యంగా చూసింది అతనివైపు.

"మీ అక్కదృష్టిలో నువు వూరెళ్ళిపోతావ్. కాని నువు మాత్రం..." ఆగిపోయాడు నవ్వు తూ. మందాకినిని తన కౌగిట్లోకి తీసుకుంటూ, 'నువు మాత్రం ఇక్కడే వుండిపోతావ్' అన్నా డు.



"ఏమిటి మీరనేది?" అతని చేతుల్ని విడదీసుకుని దూరంగా జరుగుతూ అంది. తన మనస్సులో మాటని భూపాలరావునోటి నుంచి చెప్పించేందుకే ఈ ప్రయత్నమంతా.

"నీకెలాంటి అభ్యంతరమూ లేకపోతే నువ్వీ గెస్ట్‌హౌస్‌లో వుండు"

మందాకిని మనస్సు లోలోన ఎగిరి గంతేసింది. కాని అదేమీ బైటపడనీయలేదు. ఒక నిముషం ఆలోచించింది.

"మీరు నిజంగానే అంటున్నారా ఈమాట?" అతనికి దగ్గరగా జరుగుతూ అంది.

"ఏం— అలా అడిగావ్? నామీద అనుమానమా?"

"అదేం లేదు. ఇది నిజమా కలా అన్న అనుమానంవచ్చి..."

"ఇది కలకాదు... నిజమే— సరేనా?"

"నావల్ల మీకు ఇబ్బందులేమన్నా..."

"అలాంటి బెంగేమీ నీకొద్దు"

"నామీద మీకెందుకీ ఇంట్రెస్టు?"

"ఏమో... తెలీదు. నీ చొరవ, నీ మాటకారితనం నన్ను లొంగదీశాయేమో." ఆమె పెదాల మీద ముద్దాడాడు. మందాకిని అతన్ని చుట్టేసింది.

వీడియో దానిదోవన అది నడుస్తూనే వుంది.

* * *

మధ్యాహ్నమైనా మోహిని రాకపోయేసరికి వీరభద్రంలో ఆత్రుత ఎక్కువైంది. అతని మనస్సు రకరకాలుగా ఆలోచిస్తోంది. వ్యవహారం బెడిసికొట్టిందేమోనన్న అనుమానం క్షణక్షణం బలవదుతోంది. మందాకినిని ఎవరో కిడ్నాప్‌చేశారని మోహిని చేత నాటకం ఆడించింది వీరభద్రమే. గవర్రాజు వూళ్లోలేని సమయంలో ఈ నాటకానికి అంకురార్పణ జరిగింది.

గవర్రాజు పర్యటన ముగించుకుని వచ్చిన రెండురోజుల్లో వీరభద్రం కాంట్రాక్టు మీద సంతకాలయ్యాయి. ఒప్పందంప్రకారం పాతిక వేల రూపాయలు వీరభద్రం ముట్టజెప్పాడు.

అతని నిజాయితీకి, చిత్తశుద్ధికి గవర్రాజు పొంగిపోయాడు. కాని ఆ సంతోషం ఎంతోసేపు నిలవలేదు. మళ్ళీ ఆ డబ్బుని అణాపైసలతో సహా రాబట్టుకునేందుకు వీరభద్రం పథకంవేశాడన్న సంగతి గవర్రాజుకి తెలీదు. అందులో మోహిని ప్రధాన సూత్రధారి అన్న విషయాన్ని గమనించలేదతను. ఆ పాతికవేలూ మళ్ళీ చేతులు మారాయి. మోహినికి చెప్పినప్రకారం మర్నాడు పొద్దునే భరత్‌చేత ఆ డబ్బు మోహినికి పంపాడు. అంతవరకు సజావుగా సాగిన నాటకాన్ని మోహిని మరో మలుపుతిప్పింది. ఇది వీరభద్రం వూహించని మలుపు.

ఉద్దేశపూర్వకంగానే తాత్సారంచేసి మధ్యాహ్నానికి వీరభద్రం దగ్గరికి వెళ్ళింది. రాత్రి చాలాసేపు ఏడవటంతో కళ్ళు ఉబ్బివున్నాయి. ఆమెని చూడగానే వీరభద్రంలో ఆత్రుత ఇంకా పెరిగింది. ఆమెవైఖరి అతన్ని నిలువునా నీరుకార్చింది. ఇదేమీ బైటికి కనిపించకుండా జాగ్రత్తపడ్డాడు.

"నీవు పొద్దునే వస్తావనుకున్నాను"

మోహిని మౌనంగా తలదించుకుంది. ఆమె మౌనం అతన్ని కలవరపెడుతోంది.

"ఏమిటి... ఏమైంది?" ఆందోళన నిండిన స్వరంతో అడిగాడతను.

ఒక్క నిముషం నిశ్శబ్దం తర్వాత మోహిని మెల్లగా నోరు విప్పింది. "మన పథకం బెడిసికొట్టింది."

ఈ మాటవిన్న తర్వాత అతనిలో ఆందోళన, ఆత్రుత సద్దుమణిగాయి. మొదటినుంచీ అనుమానించడంతోబాటు మోహినిని చూడగానే ఆ అనుమానం బలపడింది. అందుకే ఆమెనోటినుంచి ఆ మాటరాగానే అతనిలో ఇక ఏ ఆందోళనా కానరాలేదు. పైగా తాపీగా రిలాక్స్ అయ్యాడు.

"ఎందుకిలా జరిగింది?" పరిస్థితిని సమీక్షించి ఈసారి ఏ పొరపాటు జరగకుండా జాగ్రత్తపడాలనుకున్నాడు.

"గవర్రాజు మనం అనుకున్నంత వెర్రివాడు కాదు— గడుసుపిండం" మోహిని మాటలు నిదానంగా బైటపడుతున్నాయి. ప్రతి మాటా ఎంతో ఆలోచించిగాని బైటికి వదలడంలేదు. వీరభద్రం ఏకొంచెం అనుమానపడినా మొదటికే మోసం తప్పదని ఆమెకి




తెలును. అందుకే ఆడుతున్నది నాటకమైనా, తన నటన అనుమానాస్పదంగా కాకుండా జాగ్రత్తపడుతోంది.

"అతనికి ముందే తెలిసిపోయిందా?" తాపీగా సిగరెట్ పీలుస్తూ అడిగాడు వీరభద్రం.

"ప్చ..." తనలోని తొట్రుపాటు బైటపడకుండా వీలైనంతవరకు పొడిపొడిగానే సమాధానం చెబుతోంది.

"నువు చెప్పింది నమ్మలేదా?"

"నమ్మడం పూర్తిగానే నమ్మాడు. ఈ విషయంలో నేను చేయాల్సిందంతా చేశాను. ఏమాత్రం అనుమానించలేదు"

"మరి ఎక్కడ పొరపాటు జరిగింది?"

"మందాకిని కిడ్నాప్ అయితే నాకెలాంటి సంబంధంలేదన్నాడు" వీరభద్రంవైపు చూసింది. అతను సీలింగ్‌ఫాను వైపుచూస్తూ సిగరెట్ పొగవదులుతున్నాడు.

"వస్తే అదే తిరిగొస్తుంది. రాకపోతే ఆ విషయమే మర్చిపో అన్నాడు"

వ్యక్తిగత సంబంధాలకి గవర్రాజు ఎలాంటి ప్రాధాన్యం ఇస్తాడో వీరభద్రం ఆలోచిస్తున్నాడు. మనిషికీ మనిషికీ మధ్య అతను పాటించే వ్యత్యాసాలు అతని రాజకీయశైలికి అడ్డంవడుతున్నాయి. ఎటొచ్చీ దాన్ని బేరీజువెయ్యడంలో తాను తప్పటడుగు వేశాననుకున్నాడు వీరభద్రం. గవర్రాజు బలహీనత మోహిని. మళ్ళీ ఆమె చెల్లెలి విషయంలో ఇది వర్తించదు. తెలివితక్కువ పథకంవేసి దెబ్బతిన్నందుకు తనని తానే నిందించుకున్నాడు.

వీరభద్రందగ్గర సెలవుతీసుకుని మోహిని వెళ్ళిపోయింది. ఈ అంతర్నాటకంలోనూ ఆమె విజయం సాధించింది. ఆమె మనసంతా ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతోంది. ఇంటికెళ్ళగానే పాతికవేల రూపాయలు బైటికి తీసి తృప్తిగా చూసుకుంది. ఇది తన వ్యక్తిగత విజయం అనిపించి ఆమెలో మరింత ధైర్యంవచ్చింది. తనవ్యూహం ఇప్పుడిప్పుడే ఒక దారిన పడుతోంది. తలపెట్టిన ప్రతిపనీ సజావుగా సాగుతోంది. ఇంతకంటే శుభశకునం ఇంకేంవుంటుంది. రెట్టింపు ఉత్సాహంతో రోజులు గడుపుతోంది. ఆమె ఆశీర్వాదంతో మందాకిని భూపాలరావు గెస్ట్‌హౌస్‌లో మకాంపెట్టింది. అడుగడుగునా మోహిని సలహాలు, సూచనలకు అనుగుణంగా చెల్లెలు నడుచుకుంటోంది.




గవర్రాజు రాజధానిలో వుండే సొంతవూళ్ళో రాజకీయాలు నడిపిస్తున్నాడు. మున్సిపల్ ఛైర్మన్ ఇతను ఆడమన్నట్టు ఆడతాడు. గవర్రాజుకిక పట్టపగ్గాలు లేకుండాపోయాయి. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ప్రభాకర్‌ని డి.యస్.పిగా ప్రమోట్‌చేయించి, సొంతవూరికి బదిలీ చేయించుకున్నాడు గవర్రాజు. సొంత ఊళ్ళో ప్రభాకర్‌వుంటే తనకి కొండంత అండగా వుంటుందని భావించాడాయన.

గోపాల్‌కి అడుగడుగునా సమస్యలు ఎదురవుతూనే వున్నాయి. మున్సిపాల్టీవాళ్ళు ఆరోడ్డులో చెత్తంతాపోగేసి ఇతని టీస్టాల్ పక్కనే పడేస్తున్నారు. ఆ ప్రాంతమంతా దుర్గంధంతో నిండిపోయింది. ఎప్పుడూ జనంతో కిటకిటలాడే అతని టీస్టాల్ ముందు రానురాను జనం పలుచబడుతున్నారు. గోపాల్ కంప్లయింట్ ఇచ్చాడు. పోరంబోకు స్థలంలో చెత్తవేసుకోవడంలో తప్పులేదని మున్సిపాలిటీవాళ్ళు సమాధానమిచ్చారు.

మున్సిపాలిటీ పర్మిషన్ లేకుండా తమస్థలంలో టీస్టాల్‌పెట్టినందుకు మున్సిపాలిటీ అధికారులు గోపాల్‌కి నోటీసు ఇచ్చారు. వాస్తవానికి అతని టీస్టాల్ మున్సిపల్ స్థలంలోనే వుంది. కాని గవర్రాజు కుడిభుజంగా వున్నంత కాలం తనవెవరూ ఆ విషయం వేలెత్తిచూపలేదు. ఇందులో రాజకీయంతప్ప మరేమీ లేదనిపించింది. పదిరోజులు తిరిగేసరికి మళ్ళీ నోటీసు వచ్చింది.

నలహాకోసం త్రివిక్రమరావు దగ్గరకెళ్ళాడు. ఆయన గోపాల్‌కి ధైర్యం చెప్పాడు; అతని అండగా తాను వుంటానని వాగ్దానంచేశాడు.

రెండేళ్ళనుంచి అడ్డంరాని టీస్టాల్ఇప్పుడు ఎందుకు అడ్డంఅయింది? ఇందులో పాలకప క్షానికి చెందిన ఒకమంత్రిగారి ప్రచ్ఛన్నహస్తం వుంది. గోపాల్ టీస్టాల్‌కి ఎదురుగా వెలిసిన క్యాంటీన్‌కూడా మున్సిపల్ స్థలంలోనే వుంది. దీన్ని స్వయంగా మంత్రిగారే ప్రారంభించారు. మున్సిపాలిటీకి ఈ టీస్టాల్ ఏరకంగానైనా సమ స్యగా పరిణమిస్తే రెండు స్టాల్స్‌నీ ఎత్తే యించండి. ఆ రెండో టీస్టాల్ తొలగించిన మరుక్షణం గోపాల్ తన స్టాల్‌ని తీసివేస్తాడు- త్రివిక్రమరావు గోపాల్‌చేత ఆవిధంగా మరో ఉత్తరం రాయించాడు. మున్సిపాలిటీవాళ్ళు ఏక్షణానైనా టీస్టాల్ మీద దాడిచేస్తారేమోనన్న అనుమానం గోపాల్ అంతరంగంలో మెదులు తూనే వుంది.

ఒకరోజురాత్రి ఏడుగంటల సమయంలో గోపాల్ ఇంట్లో భోజనంచేస్తుండగా పోలీసు జీపువచ్చి ఇంటిముందు ఆగింది. గోపాల్ భోజనం మధ్యలోనే లేచి వచ్చాడు. డి.యస్.పి. ప్రభాకర్ స్వయంగా పోలీసుబల గంతో రావడం గోపాల్‌కి ఆశ్చర్యం అనిపించలే దు. ఇదంతా గవర్రాజు తెరవెనుక వుండి నడిపిస్తున్న రాజకీయం అని గోపాల్‌కి తెలు ను. ప్రభాకర్ గవర్రాజు నమ్మినబంటు. అందు కే ఎంతో శ్రద్ధతీసుకుని గవర్రాజు అతన్ని ప్రమోషన్‌మీద సొంతవూరు రప్పించుకున్నా డనీ తెలుసు.

గోపాల్‌ని జీపెక్కమన్నాడు ప్రభాకర్. ఎందుకు ఎక్కాలో చెప్పమని ప్రభాకర్ని నిలె య్యదలుచుకోలేదు. ప్రభాకర్ ఏదో ఒక సమా ధానం చెప్పకపోడు. అది సహేతుకమా కాదా అన్న విషయంమీద ఆ సమయంలో వాదోపవా దాలకి ఆస్కారంలేదు. ఏమీ మాట్లాడకుండా జీపెక్కాడు.

అయిదు నిముషాల్లో జీపు సెంటర్లో ఆగింది. గోపాల్ టీస్టాల్‌వైపు ఆతృతగా చూశాడు. అక్కడ జనం నిలబడి ఏదో వింత చూస్తున్నా రు. అక్కడ జరుగుతున్నదేమిటో తెలుసుకునే నరికి గోపాల్ ఒంట్లో రక్తం సలసలా కాగింది. దాదాపు పాతికమంది మునిసిపాలిటీవాళ్లూ, పోలీసులూ తన టీస్టాల్‌ని కూలగొడుతున్నారు. గోపాల్ పిచ్చిగా అరిచాడు. అయినా తను చూస్తుండగానే టీస్టాల్ నేలమట్టం అయింది. అక్కడ గుమికూడిన జనాన్ని పోలీసులు తరి మేశారు. గోపాల్‌ని స్టేషన్‌లో నిర్బంధించారు.

తెల్లారేసరికి సెంటర్‌లో నిరసన శిబిరం వెలిసింది. గోపాల్ మద్దతుదారులు పోలీసుల దౌర్జన్యానికి నిరసనగా నిరాహారదీక్ష ప్రా రంభించారు. త్రివిక్రమరావు దీనికి ప్రారంభో త్సవం చేశాడు. ఆ ఉదయమే త్రివిక్రమరావు పోలీసుస్టేషనుకి వెళ్ళి ప్రభాకర్‌ని కలిశాడు; గోపాల్‌ని ఎందుకు అరెస్టు చేశారో చెప్పమని నిలదీశాడు.

గోపాల్ నడుపుతున్న టీస్టాల్‌వల్ల సెంటర్‌లో ట్రాఫిక్‌కి అంతరాయం కలుగు తోందని ప్రభాకర్ జవాబిచ్చాడు. ముందుగా మాటమాత్రం చెప్పకుండా ఎందుకు నేలమ ట్టం చేయాల్సివచ్చిందని త్రివిక్రమరావు ప్ర శ్నించాడు. దాన్ని తొలగించాలని మున్సిపాల్టీ వాళ్ళు ఎప్పటినుంచో అడుగుతున్నా గోపాల్ పట్టించుకోలేదు. మున్సిపల్ అధికారులు రెండునోటీసులిచ్చినా గోపాల్ పెడచెవినపెట్టా డు. అందుకే తాము కలగజేసుకోవాల్సివ చ్చిందని ప్రభాకర్ తన చర్యని సమర్థించుకు న్నాడు.

ప్రభాకర్ ఎంతకీ దిగిరాకపోవడంతో త్రివిక్ర మరావు అదనపు పోలీసు సూపరింటెండెంట్ దగ్గరికెళ్ళాడు. రాజకీయ ప్రాబల్యంకోసం పాల కపార్టీ అరాచకం జరుపుతోందని, ఉన్నత స్థానా ల్లోని నిజాయితీవరులైన అధికారులు కలగజే సుకోకపోతే పట్టణంలో శాంతిభద్రతలకి భంగంవాటిల్లే ప్రమాదం ఉందని చెప్పాడు. ప్రభాకర్ చేస్తున్న జులుం గురించి పూసగుచ్చి నట్టు తెలిపాడు. గోపాల్ టీస్టాల్‌ని నాశనం చేసిన ప్రభాకర్ అక్కడే ఉన్న మరొక క్యాంటీన్ జోలికి వెళ్ళలేదని, నిజానికి రెండూ మున్సి పల్ స్థలంలోనే ఉన్నాయని చెప్పాడు. ఆ క్యాంటీన్‌కి గవర్రాజు ఆశీర్వాదం ఉండటంవ ల్లనే ప్రభాకర్ దానిజోలికి వెళ్ళలేదని త్రివిక్ర మరావు చెప్పాడు. ఒకసారి వచ్చి పరిస్థితిని అంచనా వేయాల్సిందిగా ఎ.ఎస్.పి.ని కోరా డు. గోపాల్‌ని పదిరోజులక్రితం అరెస్టు చేసినా




ఇంతవరకు విడుదల చేయడంగానీ, కోర్టులో హాజరుపరచడంగానీ జరగలేదని, ప్రభాకర్ దురాగతాలు రోజురోజుకీ ఎక్కువవుతున్నాయని చెప్పాడు. గోపాల్ మద్దతుదారులు నిరాహారదీక్షలు జరుపుతున్నారని, ఇవ్వాళ రేపట్లో పట్టణంలో బంద్ జరిగే అవకాశం లేకపోలేదని కూడా చెప్పాడు. పట్టణంలో శాంతి భద్రతల పరిస్థితి క్షీణించే అవకాశాలున్నట్టు ఎ.ఎస్.పి భావించారు. త్రివిక్రమరావు కోరిక ప్రకారం స్వయంగా వచ్చి పరిస్థితిని సమీక్షించగలనని మాటిచ్చారు.

మర్నాడే ఎ.ఎస్.పి ఆ ఊరెళ్ళారు. ప్రభాకర్ ఊహించని పరిణామమిది. అయినా తనకి మంత్రిస్థాయిలో అండదండలు ఉన్నాయన్న ధీమా ఉంది. అందుకే చలించలేదు. ప్రభాకర్ని వెంటపెట్టుకుని ఎ.ఎస్.పి సెంటర్కెళ్ళారు. గోపాల్ టీస్టాల్ని ఎందుకు కూల్చాల్సివచ్చిందో ప్రభాకర్ వివరించాడు. ఆ టీస్టాల్ లేకపోతే సెంటర్లో ఇప్పుడు రాకపోకలకు ఎలాంటి ఇబ్బందులు ఎదురు కావడంలేదని చెప్పాడు. ముందుగానే త్రివిక్రమరావు అంతా వివరించడంతో ఎ.ఎస్.పి. దృష్టి రెండో క్యాంటీన్పైపడింది. మరి దీని సంగతేమిటన్నట్టు చూశారాయన ప్రభాకర్వైపు. ప్రభాకర్వద్ద సరైన పాయింటులేదు. నిజం చెప్పకతప్పలేదు.

ఆ క్యాంటీన్ ఒకరకంగా గవర్రాజుగారిదని చెప్పాడు. అంతావిన్నాక త్రివిక్రమరావు చెప్పినదంతా నిజమేననిపించింది. ఎ.ఎస్.పి. నేరుగా స్టేషన్కి వెళ్ళారు. ఆయన వెనకే ప్రభాకర్ వెళ్ళాడు.

గోపాల్ని విడిపించాల్సిందిగా ఎ.ఎస్.పి. ఆదేశించాడు. శాంతిభద్రతలని కాపాడాల్సిన బాధ్యతగల పోలీసు అధికారులు రాజకీయనాయకులకి తొత్తులు కావడమంటే ఆత్మాభిమానం చంపుకున్నట్టే అవుతుందని, ఈసారి ఇలాంటి దుందుడుకు చర్యలకు పాల్పడితే క్రమశిక్షణాచర్యలు తీసుకోవాల్సివస్తుందని ప్రభాకర్ని హెచ్చరించారు. ప్రభాకర్ ముఖం చిన్నబోయింది. గోపాల్ విడుదల అయ్యాడు. త్రివిక్రమరావు మరోసారి విజయం సాధించాడు. ఆరాత్రి పొద్దుపోయాక ప్రభాకర్ గవర్రాజుకి ఫోన్చేసి జరిగిందంతా చెప్పాడు. గవర్రాజు మండిపడ్డాడు. ఎ.ఎస్.పి చండశాసనుడని, ఆయన ఉన్నంతకాలం తన ఆటలు సాగలాలవని చెప్పుకున్నాడు ప్రభాకర్. ఈసారికూడా త్రివిక్రమరావుదే పైచెయ్యి అయ్యేసరికి గవర్రాజు తట్టుకోలేకపోయాడు. సొంత ఊళ్ళో గోపాల్, త్రివిక్రమరావు కలిసి తిరుగులేని శక్తిగా రూపొందుతున్నారన్న ఆందోళన ఆయనలో అధికంకాసాగింది. వాళ్ళిద్దరూ ఏకమైతే తను దెబ్బతినడం ఖాయం. గోపాల్ టీస్టాల్ వ్యవహారం రెండుసార్లు బెడిసికొట్టింది. ఏంచేయాలో పాలుపోలేదు. ప్రభాకర్ని సలహా అడిగాడు. గోపాల్నీ, అతని టీస్టాల్ని వదిలేస్తేనే ప్రస్తుతానికి మంచిదని అతను అభిప్రాయపడ్డాడు. గవర్రాజు బాగా ఆలోచించాడు. తేనెతుట్టెని అనవసరంగా కదిలించి తలగోక్కునట్టు అనిపించింది. ప్రస్తుతానికి ఆ వ్యవహారం ఇంతటితో వదిలెయ్యడమే అన్నివిధాలా శ్రేయస్కరమన్న నిర్ణయానికి వచ్చాడు. సమయం వచ్చినప్పుడు గోపాల్ని పాతాళానికి తొసేందుకు ఏమాత్రం వెనకాడవద్దని మాత్రం చివర్లో సలహా ఇచ్చాడు గవర్రాజు. మరోసారి ఎ.ఎస్.పి సంగతి చెప్పాడు ప్రభాకర్. ఆ వ్యవహారం తాను చూసుకుంటానని గవర్రాజు భరోసా ఇచ్చాడు. ఆయన మాటమీద ప్రభాకర్కి కొండంత గురివుంది. అందుకే మరోవారంరోజుల్లో ఎ.ఎస్.పి.కి బదిలీ ఉత్తర్వులు అందినా అతనేమీ ఆశ్చర్యపోలేదు.

దేశప్రగతికోసం ప్రభుత్వాలు వార్షిక ప్రణాళికలు, పంచవర్షప్రణాళికలు రూపొందిస్తాయి. వాటికి అనుగుణంగా అవిరళకృషిచేసి దేశాన్ని ముందుకి నడిపించాల్సిన బృహత్తరబాధ్యత పాలకులమీద వుంది. అదేవిధంగా నాయకులకికూడా లక్ష్యాలంటూ వుంటాయి. ఎటొచ్చీ అవి ఆయావ్యక్తులనైతికవర్తనమీద ఆధారపడివుంటాయి.

ఎన్నోఏళ్ళుగా ప్రతిపక్షంలోవుంటూ ఢక్కామొక్కీలు తిన్న త్రివిక్రమరావుకి ఒక్కొక్కరుతువు ఒక్కొక్క ప్రణాళిక. ప్రతి రుతువూ అతనికొక అక్షయతూణీరం. రుతువు రుతువుకో లక్ష్యం సాధించడం అతని ప్రత్యేకత.

ఎండాకాలంవచ్చింది. అందులోనూ ఈసారి కార్పొరేషన్ ఎన్నికలు సమీపిస్తున్నాయి.

అందుకే ఈ వేసవికి త్రివిక్రమరావు దృష్టిలో ఎంతో ప్రాధాన్యం వుంది. రెండురోజులు తీవ్రంగా ఆలోచించాడు. ఈసారి తను వదిలే బాణం అటు గవర్రాజునీ దెబ్బతీయాలి, ఇటు తన పలుకుబడిని మరింత పెంచాలి. జాగ్రత్తగా ఆలోచించి పాచికలువిసిరాడు.

తెల్లారేసరికి పట్టణంలోని ముఖ్యమైన సెంటర్లలో తనపార్టీ తరఫున చలివేంద్రాలు ఏర్పాటుచేయించాడు. వాటికోసం అక్కడక్కడ తాటాకుపందిళ్ళు వెలిశాయి. వాటిపైన పార్టీ పతాకాలు రెపరెపలాడుతున్నాయి. ఒక్కొక్కదానిలో అరడజనుకుపైగా పెద్దపెద్ద కుండలు ఏర్పాటుచేయించాడు.

ప్రతిచోటా రోజువారీ కూలికి మనుమల్నిపెట్టాడు. తాను ఏర్పాటుచేసిన చలివేంద్రాలకి పెద్దయెత్తున ప్రచారం చేయించనిదే ప్రయోజనం వుండదనిపించింది. ప్రచారానికి ఏదో ఒక కారణంకావాలి. బాగా ఆలోచించాడు.

చలివేంద్రాల దగ్గర ఎవ్వరూ చుట్టలు, బీడీలు, సిగరెట్లు కాల్చరాదని రెండురోజులు మైకులు పెట్టించి వూరంతా ప్రచారంచేయించాడు. చలివేంద్రాలదగ్గర జనం గుమికూడకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. మంచినీళ్ళకోసం వచ్చే బాటసారుల్ని సైతం అల్లంత దూరానే సిగరెట్లు ఆర్పేసిరమ్మని చెబుతున్నారు. ఈ తంతు ప్రజల్లో బాగా ప్రచారం అయింది. ఎండాకాలంలో ఆమాత్రం శ్రద్ధతీసుకోకపోతే కష్టమేనని జనం చెప్పుకుంటున్నారు. త్రివిక్రమరావు చేసిన 'చలివేంద్రాల రాజకీయం' క్లిక్ అయింది. ఇందుకు అతని మనస్సు సంతోషిస్తున్నా మరిదేనికోసమో ఎదురుచూస్తోంది.

త్రివిక్రమరావు పరిస్థితిని నిశితంగా పరిశీలిస్తున్నాడు. నాలుగురోజులు గడిచినా పరిస్థితిలో ఎలాంటి మార్పులేదు. పట్టణంలో చలివేంద్రాలన్నీ మామూలుగానే నడుస్తున్నాయి. రోజులు సాదాసీదాగా గడుస్తున్నాయి. సృష్టి సుషుప్తావస్థలో వుందేమిటి చెప్మా అనుకున్నాడు త్రివిక్రమరావు. అతనికి ఈ పరిస్థితి నచ్చలేదు. లోలోన ఎంతో అసంతృప్తిగా వుంది. ఐతే ఈ అసంతృప్తి ఎన్నోరోజులు లేదు. మరో రెండురోజుల్లో డి.ఎస్.పి. ప్రభాకర్ మేల్కొన్నాడు. జీపునిండా బలగాన్ని వేసుకుని పట్టణంలో ఆ చివరినుంచి ఈ చివరిదాకా ఒక రౌండుకొట్టివచ్చాడు. చలివేంద్రాలన్నీ కుప్పకూలిపోయాయి. కుండలు పగిలికుండపెంకులు మిగిలాయి. మంచినీళ్ళకోసం క్యూలుకట్టి నిలబడిన జనాన్ని లాఠీలతో చితకబాదారు పోలీసులు.

త్రివిక్రమరావు ఆనందానికి అవధుల్లేవు. ఈ సమయంకోసమే అతను ఎదురుచూస్తున్నాడు. అతను మరోసారి జనంలోకి వెళ్ళాడు. పోలీసుల దురుసుతనాన్ని నిరసిస్తూ రోజుకో ప్రదర్శన నిర్వహించాడు. పోలీసుల పనితీరు ప్రజలకికూడా నచ్చలేదు. త్రివిక్రమరావు ఏర్పాటుచేసిన నిరసనప్రదర్శనలకు ప్రజల నుంచి మంచి ప్రతిస్పందన వచ్చింది.

'తాగేతాగే నీటిని పారబోసిన ఈ పోలీసులు, రేపు మీనోటిదగ్గర కూటినికూడా లాగేస్తారు. ఈ కిరాయిగూండాల అరాచకత్వంపై ధ్వజమెత్తండి' అంటూ త్రివిక్రమరావు ఆవేశపూరితప్రసంగాలు చేశాడు. పత్రికలు కూడా పోలీసుల దురుసుతనాన్ని ఖండించాయి.

ఓరోజు ప్రభాకర్ పత్రికాప్రకటన ఇచ్చాడు. పట్టణమంతా ట్రాఫిక్‌రద్దీని తట్టుకోవడమే కష్టంగావుంటే, మళ్ళీ ఈ చలివేంద్రాలతో రద్దీ మరింతగా పెరిగిపోయిందని; ప్రమాదాలకు దారితీసే అవకాశాలు వుండటంతో వాటిని తొలగించాల్సివచ్చిందని సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

తమపార్టీ ఏర్పాటుచేసిన చలివేంద్రాలని ప్రభాకర్ రాజకీయదురుద్దేశంతోనే తొలగించాడని త్రివిక్రమరావు ఆరోపించాడు. గోపాల్ టీస్టాల్ వ్యవహారంలో తాను నైతికంగా విజయం సాధించడంతో ప్రభాకర్ ఈ విధంగా తనమీద ప్రతీకారం తీర్చుకున్నాడని విమర్శించాడు. ప్రమాదాలను నివారించి, ప్రజాసంక్షేమానికి పాటుపడాలన్నదే ఆయన ధ్యేయమైతే ముందుగా తనతో సంప్రదించివుంటే బావుండేదని ప్రభాకర్ సంజాయిషీని త్రివిక్రమారావు తోసిపుచ్చాడు. దోపిడీదొంగలు దొమ్మీ చేసినట్టు మందీమార్బలంతో పందిళ్ళపైబడి ధ్వంసంచేయడం ప్రతీకారచర్యకాక మరేమవుతుందని ప్రశ్నించాడు. ఈ ప్రశ్నలకి ప్రభాకర్ నుంచి సమాధానంలేదు. అతని మౌనం త్రివి

 

క్రమరావుని భుజంతట్టి ముందుకి కదిపింది.

వారంరోజుల్లో మళ్ళీ చలివేంద్రాలు వెలిశాయి. ఈసారి ఏంచేయాలో ప్రభాకర్‌కి పాలుపోలేదు. మరోవంక గవర్రాజు వర్గీయులు అతనిమీద వత్తిళ్ళు తెస్తున్నారు.

త్రివిక్రమరావు చర్యలని నిమ్మకునీరెత్తినట్టు చూస్తూ వూరుకుంటేకుదరదు. చలివేంద్రాలని అడ్డంపెట్టుకుని అవతల అతను పలుకుబడి పెంచుకుంటున్నాడు. ఇదెంతమాత్రం కొనసాగడానికి వీల్లేదని గవర్రాజువర్గీయులు పట్టుబడుతున్నారు.

"ఇప్పటికి రెండు మూడుసార్లు తొందరపడి చేతులు కాల్చుకున్నాం. మళ్ళీ కొరివితో తల గోక్కోవడం శుద్ధతెలివితక్కువతనం అవుతుంది" అంటూ ప్రభాకర్ వాళ్ళకి నచ్చచెప్పబోయాడు. తనవల్ల త్రివిక్రమరావు లాభపడుతున్నాడని అతను గ్రహించాడు. అందుకే ఈవెనకడుగు.
కాని వాళ్ళుమాత్రం మరో ఆలోచనకి అవకాశం ఇవ్వడంలేదు.

"గవర్రాజుగారు ఫోన్‌చేశారు. ఈవిషయం మీతో స్వయంగా మాట్లాడమని చెప్పారు"

ప్రభాకర్‌మళ్ళీ డైలమాలో పడ్డాడు.

"ఏంచేద్దాం చెప్పండి?"

"త్రివిక్రమరావు చేత చలివేంద్రాలు ఎత్తేయించండి"

"ముందే చెప్పానుగదా- వాటిని ఒకసారి తొలగించాం, భ్రష్టుపట్టాం. అయినా అవి నలుగురికి ఉపయోగపడుతున్నాయి. వాటిని తొలగించడమంటే..."

"వాటిని మేం ఏర్పాటుచేస్తాం"

"చెయ్యండి... ఊరింకాచాలావుంది. బోలెడంత జాగావుంది. అమాత్రానికి పాతవాటిని తొలగించడమెందుకు?"

"ప్రభాకర్‌గారూ... అన్నీ తెలిసికూడా మీరేమిటి ఇలా మాట్లాడతారు? ఇది ప్రిస్టేజీవ్యవహారం. త్రివిక్రమరావు చాలా తెలివిగలవాడు. మంచిమంచి సెంటర్లు ఎంపికచేసుకున్నాడు. అక్కడే మేమూ ఏర్పాటుచేయాలి. అప్పుడే మాకు పాపులారిటీ పెరిగేది. ఆ సెంటర్లన్నీ మాహస్తగతంకావాలి"

ప్రభాకర్ అయోమయంలో పడ్డాడు. ఏంచేయాలో అర్థంకాక తలపట్టుకుకూర్చున్నాడు.

"డియస్పీగారూ... మేమింత గట్టిగా పట్టుపట్టడానికి కారణం లేకపోలేదు. తొందర్లో మున్సిపల్‌కార్పొరేషన్ ఎన్నికలు వస్తున్నాయి. ఇప్పుడన్నా ప్రజాసేవచేసి పదిమందినీ ఆకర్షించకపోతే జనానికి గుర్తువుండం. జనాన్ని ఆకట్టుకునేందుకు వస్తున్న అవకాశాలే చాలా తక్కువ. అవికూడా అపోజిషన్‌వాళ్లకే లాభిస్తే - మాకు ఒరిగేదేమిటి? మాపార్టీ అధికారంలో వుండీ మాకు ప్రయోజనమేమిటి? అమాయకప్రజలు ఆ రాజకీయ నయవంచకులబుట్టలో పడి అన్యాయమైపోకుండా నిరోధించి, పార్టీ పరువు కాపాడాలని మా అధిష్ఠానవర్గం ఆదేశించింది. వాళ్ళ ఆటలు కట్టించి మా పరువు నిలబెట్టుకోవాలి. ఈ ఎన్నికల్లో గెలిస్తే మళ్ళీ అయిదేళ్ళదాకా మీ జోలికిరాము. ఆ చలివేంద్రాలజోలికి కూడా రాము... నరేనా" ఓ ఛోటానాయకుడు చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

ఎంతగా ఆలోచించినా ప్రభాకర్ మనస్సు మాత్రం లొంగడంలేదు. ఎవరెన్ని చెప్పినా త్రివిక్రమరావు ఏర్పాటుచేసిన చలివేంద్రాలను తొలగించడానికి ప్రభాకర్ ధైర్యం చేయలేకపోయాడు. మొదటిసారిగా తనవైఖరి తనకే వింతగా అనిపించింది. ప్రభాకర్ దిగిరాకపోవడంతో గవర్రాజువర్గీయులు జిల్లా అదనపు పోలీసు సూపరింటెండెంట్‌ని కలిశారు.

తెల్లారేసరికల్లా పట్టణంలో పోటీచలివేంద్రాలు వెలిశాయి. పాతచలివేంద్రాలకి ఎదురుగా రోడ్డుకి అవలివైపున గవర్రాజు వర్గీయుల తాటాకు పందిళ్ళు వేయించారు. అధికారపార్టీ నుంచివచ్చిన ఈ ప్రతిస్పందన పెరుగుతున్న తన పలుకుబడికి ప్రత్యక్షతార్కాణంగా త్రివిక్రమరావు భావించాడు.

రెండు పార్టీల చలివేంద్రాలు జోరుగానడుస్తున్నాయి.

అధికారపార్టీకి చెందిన చలివేంద్రాలు పొద్దస్తమానం కార్యకర్తలతో కిటకిటలాడుతున్నాయి. కాలేజీ కుర్రాళ్ళకి, అర్థాంతరంగా చదువులు ఆపేసినవాళ్ళకి, చదువులు పూర్తయి ఖాళీగా తిరిగేవాళ్ళకి ఇవి చల్లని ఆశ్రయాలు అయ్యాయి. ఇంట్లో రెండు మెతుకులు తినిరావడం, అర్థరాత్రిదాకా సిగరెట్లు,

ఏకాటతో కాలక్షేపం చెయ్యడం వాళ్ళ నిత్యకృత్యంగామారింది.

త్రివిక్రమారావు ఇదంతా గమనిస్తున్నాడు. ఈ అల్లరిమూకలతో చలివేంద్రాలకి ముప్పు ముంచుకొస్తుందేమోనని భయపడ్డాడు. చలివేంద్రాల దగ్గర సిగరెట్లు కాల్చడం క్షేమంకాదని చెప్పించాడు. కాని వాళ్ళు లెక్కచేయలేదు.

ఓ నిశధవేళ-

పగటిపూట చూసిన పాపాలకి పరిహారంగా సృష్టియావత్తు కళ్ళు మూసుకుని మౌనంపాటిస్తున్న వేళ-

కండలుపిండి పగలంతా కట్టించివనిచేసిన కార్మికులు ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు ఆదమరచి నిద్రిస్తున్నవేళ-

లోకం తెలీయని పసిపాపలు తల్లుల గుండెల్లో ఒదిగొదిగి నిద్రపోతున్న వేళ-

అగ్నిదేవుడికి ఆకలేసింది. వాయుదేవుడు ఒళ్ళువిరుచుకున్నాడు. పోటీ చలివేంద్రాలకి నిప్పుఅంటుకున్నది. క్షణాల్లో మంటలు చుట్టుపక్కల ఇళ్ళకు వ్యాపించాయి. వేడితగిలాకగాని కళ్ళుతెరవలేదు. అప్పటికే అగ్నిదేవుడి ఆకలితీరింది. ఎటుచూసినా హాహాకారాలు... అరుపులు... ఏడుపులు... పెడబొబ్బలు...

ఇల్లు కాలిఒకరు... ఒళ్ళు కాలివేరొకరు... ఆప్తుల్ని కోల్పోయికొందరు... అగ్నిమాపకదళం వచ్చి రంగంలోకిదూకేసరికి అగ్నిదేవుడు అప్పటికే చప్పబడ్డాడు. మొత్తం పాతికఇళ్ళు దగ్ధమయ్యాయి. త్రివిక్రమారావు నిర్వహిస్తున్న చలివేంద్రాలు కూడా కొన్ని తగలబడ్డాయి. ఈ ప్రమాదంలో మొత్తం మీద పదిమంది సజీవదహనమైనట్టుతేలింది.

జనం జీవితాలు కుంపటిలో బొగ్గుల్లాగా మాడిమసైపోతున్న ఆ తరుణంలో త్రివిక్రమారావు తనగదిలో ఒంటరిగా కూర్చుని, తెల్లవారి తాను ఇవ్వాల్సిన పబ్లిక్ స్టేట్‌మెంట్‌ని తీరిగ్గా తయారుచేశాడు. అరగంటకోసారి ఆయనకి ఫోన్‌కాల్స్ వస్తున్నాయి. ఎంతమంది చనిపోయిందీ, ఎన్ని ఇళ్ళు తగలబడిందీ, ఎంత ఆస్తి నష్టంమైందీ... ఈ వివరాలన్నీ అందుతున్నాయి. అతనికి రేపు ఎంతో ఆశాజనకంగా వుంది. ప్రమాదం జరిగిన ఓ గంటతర్వాత వెళ్ళి బాధితుల్ని పరామర్శించాడు.

మర్నాడు గవర్రాజు వర్గంమీద సమరశంఖారావం పూరించాడు. అగ్గిపుల్ల ప్రమాదం ఊరినే అగ్గిచేసిందన్నాడు. సిగరెట్లు కాలుస్తూ పనీపాటాలేకుండా రాత్రింబవళ్ళు చలివేంద్రాలదగ్గరే తిష్టవేసుకుకూర్చున్న పాలకపార్టీ కార్యకర్తలు పదినిండుప్రాణాల్ని బలిపెట్టారని ఆరోపించాడు. ఈ ప్రమాదానికి అధికారపార్టీ నైతిక బాధ్యత వహించి ప్రభుత్వం రాజీనామా చేయాలని డిమాండుచేశాడు. మృతుల కుటుంబాలకు వెంటనే తాత్కాలిక సాయం అందించాలని కోరాడు.

రెండోరోజు గవర్రాజు వచ్చి, ప్రమాదస్థలాన్ని సందర్శించాడు. మృతుల కుటుంబాలను పరామర్శించాడు. వారికి ఎక్స్‌గ్రేషియా ప్రకటించాడు. కాలిన గాయాలతో ఆసుపత్రిలో చేరినవాళ్ళని ఓదార్చాడు.

సొంతజిల్లాలో, సొంత నియోజకవర్గంలో, సొంత ఊళ్ళో ఘోరమైన అగ్నిప్రమాదం జరిగితే మంత్రిగారు ఇంతఆలస్యంగా రావడంపట్ల త్రివిక్రమారావు అసంతృప్తివ్యక్తం చేస్తూ పత్రికాప్రకటన ఇచ్చాడు. ప్రభుత్వం ప్రకటించిన ఆర్థికసాయం బాధితులను ఏమాత్రం ఆదుకోలేదని విమర్శించాడు. ఈ ప్రమాదానికి తమ పార్టీ వారేకారణమైనందున మొహంచెల్లకనే గవర్రాజు వెంటనే రాలేదని త్రివిక్రమరావు ఆరోపించాడు. మున్సిపల్ ఎన్నికలు దగ్గర పడటంతో జనం ఛీకొడతారేమోన్న భయంకొద్దీ ప్రజల్లో ఉద్రేకం చల్లబడినతర్వాత మొక్కుబడిగా వచ్చాడని గవర్రాజు తెగనాడాడు. ఈ ప్రమాదంపై ఉన్నతస్థాయిలో దర్యాప్తు జరిపించాలని ఆయన డిమాండ్ చేశాడు. రోడ్డు వెంటవెళ్ళే రిక్షావాళ్ళెవరో సిగరెట్పీక రోడ్డుపక్కకి విసిరేస్తే అది చెత్తకుండీలో పడి అంటుకుని ప్రమాదం జరిగిందని అధికారికంగా ప్రభుత్వం ఒక ప్రకటన విడుదలచేసింది.

'వేసవిలో ఎండలు సహజం పొరపాట్లూ సహజమే. అప్పుడు అగ్నిప్రమాదాలు మరింత సహజం. అధికార పార్టీకి, ఈ ప్రమాదానికి ఏవిధంగాను సంబంధంలేదు' అంటూ గవర్రాజు ఒక్కముక్కలో త్రివిక్రమారావు ఆరోపణలను కొట్టిపారేశాడు.




# అందరికీ అందుబాటులో హనుమగిరి కాలనీ

వాయిదాల పద్ధతిలో ప్రతి నెల లక్కీ డ్రాతో మా హనుమగిరి కాలనీలో ఇండ్ల ప్లాట్లు పొందండి. నెల 1 కి రూ. 500/- లేక రూ. 250/-లు చొప్పున 60 నెలలు చెల్లించవలెను. ప్రతి నెల లక్కీ డ్రా కలదు. డ్రాలో గెలుపొందిన వారు తదుపరి వాయిదాలు చెల్లించనవసరములేదు.

**తేది: 14-1-1989 సంక్రాంతి రోజున మొదటి డ్రా జరుగును.**

నెల్లూరు, మద్రాసు G.N.T. రోడ్డుపై, బాలాజీ స్టీలు ఫ్యాక్టరీ, పవన్ కాలనీ, కోరా రెసిడెన్షియల్ కాలేజీలకు ప్రక్కన మా హనుమగిరి కాలనీ ప్లాట్లు కలవు.

వెంటనే (1) రూ. 500/-లు చెల్లించి ప్లాటు రిజర్వుచేసుకొనవచ్చును.

(2) ప్రతి ఆదివారం ఉదయం 8.30 ని. నుండి 12.00 గంటల వరకు స్థల సందర్శనమునకు మా ఆఫీసు నుండి ఉచిత వాహన సౌకర్యం కలదు.



**ప్లాట్లు ఉచితము - హిమగిరి కాలనీ, నెల్లూరు.**

మా కంపెనీ ద్వితీయ వార్షికోత్సవ సందర్భముగా తేదీ 1-12-1988 నుండి 30-12-1988 వరకు సప్తగిరి, తల్పగిరి కాలనీలలో ప్లాటు కొన్నవారికి, మా హిమగిరి కాలనీలో ప్లాటు ఉచితముగా ఇవ్వబడును.

ప్లాటు ఖరీదు రూ. 2500/-లు, దఫాల వారీగా రూ. 200/-లు చొప్పున 15 నెలలు చెల్లించి ప్లాటు పొందవచ్చును.

వెంకటాచలం సత్రం, మెడికల్ ఇండికేర్ ఫ్యాక్టరీకి సమీపంలో G.N.T. రోడ్డుపై అప్పయ్య గేటు ఓవర్ బ్రిడ్జి ప్రక్కన మా హిమగిరి కాలనీ ప్లాట్లు కలవు.

వివరములకు ప్రమోటర్స్ PHONE:6729

**J.L.నారాయణ&న్యూకంపెనీ**

**ఊర్వశికాంప్లెక్స్, కాపువీధి నెల్లూరు-1.**

త్రివిక్రమరావు మరోసారి తానుఅనుకున్నది సాధించాడు. రాజకీయవైకుంఠపాళిలో ఎన్నెన్నో ఒడిదుడుకుల్ని అతినేర్పుగా, లాఘవంగా తప్పించుకుంటూ ఒక్కొక్కడుగు ముందుకు వేస్తున్న త్రివిక్రమరావు ప్రతిసారిలాగే ఈ ఎండాకాలాన్ని కూడా తనకు అనుకూలంగా మలుచుకోగలిగాడు. కిందటిఎండాకాలం గడ్డివాముల రాజకీయం. ప్రత్యర్థివర్గాల గడ్డివాములకి నిప్పుపెట్టించి వాళ్ళల్లోవాళ్ళకి అనుమానాలు రేకెత్తించాడు. ఫలితం కొట్లాటలు. తలలు వగిలాయి. ఇప్పటికీ వాళ్ళు కోర్టులచుట్టూ తిరుగుతూనేఉన్నారు. ఈ వేసవిలో అతన్ని చలివేంద్రాలు ఆదుకున్నాయి. కిరాయి గుండాలచేత తానే చలివేంద్రాలకి నిప్పుపెట్టించినట్టు గవర్రాజు వర్గీయులకు అనుమానం కూడా రానందుకు త్రివిక్రమరావు తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నాడు.!

★ ★ ★

ఇది జరిగిన పదిహేనురోజులకి శ్రీరామనవమి పండుగవచ్చింది. త్రివిక్రమరావుకి మళ్ళీ చేతినిండా పనిదొరికింది. మున్సిపల్ ఎన్నికలు ఇంకా పట్టుమని రెండునెలలైనాలేవు. ఈ పండుగే తనకిక చివరి అవకాశం. హిందువులకి అత్యంత ప్రతిష్టాకరమైన ఈ పండుగని తన బంగారుభవిష్యత్తుకు పునాదిగా చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

తన సన్నిహితులను పిలిపించి, మనసులో మాట బైటపెట్టాడు. ఎన్నికలు దగ్గరపడుతున్నాయి కాబట్టి ఓటర్లను ఆకర్షించడానికి మనకి ఇదిచివరి అవకాశం అని వారికిచెప్పాడు. వాళ్ళంతా తలలూపారు.

త్రివిక్రమరావు సారథ్యంలో సీతారామకల్యాణమహోత్సవ నిర్వాహకకమిటీ ఏర్పాటైంది. శ్రీరామనవమి బ్రహ్మాండంగా జరపాలని కమిటీ నిర్ణయించింది. పెద్దవాళ్ళ దగ్గర చందాలు పోగుచేశారు. కరపత్రాలు ముద్రించి పంచిపెట్టారు.

శ్రీరామనవమి గురించి ఇంతవరకు ఆ ఊళ్ళో పట్టించుకున్నవాళ్ళేలేరు. అలాంటిది ఈసారి ఈ పండుగకి ఇంత ప్రాముఖ్యం రావడం ఊళ్ళోఅందర్నీ ఆశ్చర్యపరిచింది. మరోసారి త్రివిక్రమరావు ప్రజల్ని ఆకర్షించాడు.

పండుగరోజు పట్టణంలో పెద్దఎత్తున ఊరేగింపు జరపాలని త్రివిక్రమరావు నిర్ణయించాడు. ఆ ఊరేగింపు అతనికి కీలకమైనది. దానికి చాలా పకడ్బందీగా వ్యూహంపన్నాడు.

పండుగరోజున శ్రీరామచంద్రుణ్ణి సతీసమేతంగా ఊరంతా ఊరేగించేందుకు పోలీసుశాఖను అనుమతికోరాడు. ప్రభాకర్ అడ్డుతగిలాడు. ఇలాంటి ఊరేగింపులు మతఘర్షణలకి దారితీస్తాయన్నసాకుతో అనుమతి నిరాకరించాడు.

త్రివిక్రమరావు దీన్ని ప్రిస్టేజీసమస్యగా తీసుకున్నాడు. ప్రభాకర్ మీద బహిరంగఆరోపణలకి దిగాడు. ఊరేగింపుకి అనుమతి ఇవ్వాలంటూ త్రివిక్రమరావు వర్గీయులు నిరాహార దీక్ష ప్రారంభించారు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఊరేగింపును అనుమతించేదిలేదని ప్రభాకర్ స్పష్టంచేశాడు. అనుమతి ఇవ్వకపోయినా ఊరేగింపు ఆగదని త్రివిక్రమరావు ప్రకటించాడు. రెండురోజులముందునుంచే ఊళ్ళో 144వ సెక్షన్ విధించారు.

గవర్రాజువర్గం పరిస్థితిని ఓ కంట కనిపెడుతోంది. పట్టణంలోని మైనారిటీలు రెండువర్గాలుగా చీలిఉన్నాయి. ఒకవర్గం గవర్రాజుకొమ్ముకాస్తోంది. రెండోవర్గాన్ని త్రివిక్రమరావు అతినేర్పుగా సాకుతూ బండిలాక్కొస్తున్నాడు.

శ్రీరామనవమి రానేవచ్చింది.

ఊరంతా సందడిగాఉంది. ప్రధానకూడలులదగ్గర పెద్దపెద్ద పందిళ్ళు వేశారు. ఒక్కో పందిరీ ఫర్లాంగుదూరంఉంది. ప్రతిపందిరిలోను శ్రీరామకళ్యాణం వైభవోపేతంగా జరిగింది.

ఆ సాయంత్రమే ఊరేగింపు.

రంగుకాగితాలతోను, పూలతోను అలంకరించిన ట్రాక్టర్‌లో సీతారాముల విగ్రహాలను ఎత్తయిన బల్లమీద వుంచారు. ఊరేగింపు ప్రారంభమైంది. ట్రాక్టర్ కదిలింది. వేల సంఖ్యలో భక్తులు రోడ్లకిరువైపులా నిలబడి ఊరేగింపు తిలకిస్తున్నారు. మేడలు, మిద్దెల మీదనుంచి స్వామివారిపై పూలవర్షం కురుస్తోంది. ఊరేగింపు సగం దూరం వెళ్లింది.

ఒక కూడలిదగ్గర పోలీసులు బ్యారికేడ్ మాదిరిగా అడ్డునిలబడి వున్నారు. ఆ వీధిలో




అంతా మైనారిటీలు నివసిస్తున్నారు. ...
వర్గంనాయకులు ముందుకొచ్చి ఊరేగింపుని వెనక్కి మళ్లించాలని పట్టుపట్టారు. ఉత్సవకమిటీ సభ్యులు అందుకు అభ్యంతరం చెప్పారు. వాదన మొదలైంది. కోపతాపాలు పెరుగుతున్నాయి.

ఇంతలో ఎక్కడినుంచి వచ్చాయోగాని ఊరేగింపుమీద రాళ్లుపడ్డాయి. పరిస్థితి ఉద్రిక్తంగా మారింది. పట్టపగలే ఆ నడిరోడ్డుమీదే రెండు వర్గాలు ఘర్షణకి దిగాయి. నిముషాల్లో మారణాయుధాలు రంగంలోకి వురికాయి.

త్రివిక్రమరావు వర్గానికి చెందిన రౌడీలు పోలీసుల్ని చీల్చిచెండాడారు. రెండువర్గాల్లోనూ కొందరు నేలకొరిగారు. రక్తపుమరకలతో నేలతల్లి వేసవిదాహం తీర్చుకుంది. దొంగచాటుగా రాళ్లురువ్వి, కొట్లాటకు ఆజ్యంపోసిన ముఠా అక్కడినుంచి ఎప్పుడో తప్పుకుంది. ఈ కల్లోలానికి తన ముఠాయే శ్రీకారం చుట్టిందన్న సంగతి ఒక్క త్రివిక్రమరావుకే తెలుసు. అతను ఆ సమయంలో ఇంట్లోనేవున్నాడు. ఎప్పటికప్పుడు ఫోన్‌లో సమాచారం తెలుసుకుంటున్నాడు.

దాదాపు గంటసేపు కొట్లాట జరిగింది. పదిహేనుమంది మరణించారు. మరో యాభైమందికి గాయాలయ్యాయి. వీరిలో ఇరవైమంది పరిస్థితి ప్రమాదకరంగావుంది.

ఈ కల్లోలానికి గవర్రాజు వర్గీయులే కారణమని ప్రచారం జరిగింది. ఈవార్త రాజధానికి పాక్కింది. హుటాహుటిన గవర్రాజు వచ్చాడు. ఇతర లాంఛనాలన్నీ మామూలుగా జరిగిపోయాయి. దర్యాప్తు జరిపారు. ఎవరు దోషులో దర్యాప్తు జరిగాక వెల్లడించలేదు. భారీయెత్తున అరెస్టులు మాత్రం జరిగాయి. ఊరేగింపులో రాళ్లు విసిరిన గూండాలు, మారణాయుధాలతో స్వైరవిహారం చేసిన రౌడీలు రోడ్ల మీద తిరుగుతూనే వున్నారు.

ఈసారి శ్రీరామనవమి తనకి బాగా ఉపకరించినందుకు త్రివిక్రమరావు పొంగిపోయాడు. ఈ హింసాకాండ మరుగునపడిపోకుండా బతికించుకోవాలనుకున్నాడు. మున్సిపల్ ఎన్నికలకి ఇది మంచి 'మేత' అవుతుందనిపించి తృప్తిగా నిద్రపోయాడు.

★ ★ ★

త్వరలో రాబోయే మున్సిపల్ ఎన్నికలలో ...
చూడాలన్నది త్రివిక్రమరావు పంతం. అవిధంగా గవర్రాజుకి కళ్లెంవేయాలి. కార్పొరేషన్‌లో తమపార్టీ పాగావేస్తే ముందుముందు మరెన్నో లాభాలు వుంటాయి. ముఖ్యంగా వచ్చేఏడాది జరిగే జనరల్ ఎన్నికల్లో ఇది బాగా వుపకరిస్తుంది. మున్సిపల్ ఎన్నికల్లో తమపార్టీ అనుసరించాల్సిన వ్యూహాన్ని రూపొందించే బాధ్యత త్రివిక్రమరావు మీదే పడింది. ఆయన స్థానికుడు కావడంతో స్థానిక సమస్యలు ఆయనకి బాగాతెలిసి వుంటాయన్న వుద్దేశంతో పార్టీ అధిష్ఠానవర్గం ఆ భారాన్నంతా ఆయనమీదే వేసింది.

త్రివిక్రమరావు మనసులో ఎన్నెన్నో వ్యూహాలు రూపుదిద్దుకుంటున్నాయి. అవన్నీ సజావుగానే అనిపిస్తున్నాయి. కాని ప్రతిదానికీ డి.ఎస్.పి ప్రభాకర్ అడ్డుతగులుతాడన్న అనుమానం వేధిస్తోంది. ప్రభాకర్ గవర్రాజుకి స్వామిభక్తుడు. ఎన్నికల్లో అతను తన అధికారులను సైతం అధిగమించి గవర్రాజుకోసం ఏమైనా చెయ్యగలడన్నది త్రివిక్రమరావు అభిప్రాయం. ఇలాంటి సమయాల్లో ఉపయోగపడతాడనే గవర్రాజు ఏరికోరి ప్రభాకర్ని సొంతవూరికి బదిలీచేయించుకున్నాడని ఆయనకి తెలుసు. ప్రభాకర్ శక్తిసామర్థ్యాలు త్రివిక్రమరావుకి కొట్టినపిండి. ఇన్నాళ్లూ అతని దుందుడుకుతనాన్ని రాజకీయంగా తనకు అనుకూలంగా మలచుకుని నిలబడ్డాడు. కాని ఎన్నికల్లో అది కుదరదు. గవర్రాజుకోసం ప్రభాకర్ వేసే ప్రతిఅడుగు గవర్రాజుకే లాభిస్తుంది. టీస్టాల్ రాజకీయాలకి, ఎన్నికల రాజకీయాలకి పొంతన వుండదన్న సత్యం త్రివిక్రమరావుకి బాగాతెలుసు. అందుకే బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు.

ప్రభాకర్‌ని ఆ ఊరినుంచి బదిలీచేయించాలి. ఇందుకు డబ్బు ఖర్చుఅయినా సరే వెనకాడకూడదు. ఎన్నిరకాలుగా అవకాశంవుంటే అన్ని రకాలుగానూ ప్రయత్నించాలని నిర్ణయించుకున్నాడు.

ముందుగా డి.ఐ.జి.ని కలిశాడు. ప్రభాకర్ గురించి అన్నికోణాలనుంచి ఆయనకి విప

ంచాడు. ప్రభాకర ఆఊరొచ్చి ఆర్నెల్లయినా కాలేదు. పట్టణంలో ఎన్నోసార్లు హింసాకాండ చెలరేగింది. ఎందరో అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. మతసామరస్యాన్ని దెబ్బతీశాడు. చీటికీమాటికీ పోలీసుల్ని వెంటేసుకుని వ్యాపారవర్గాలమీద దొమ్మీలకుపాల్పడుతూ, పోలీసు వ్యవస్థపట్ల ప్రజల్లో విశ్వాసరాహిత్యాన్ని పెంచుతున్నాడు. వచ్చేమున్సిపల్ ఎన్నికల్లో అతను అక్కడేవుంటే పాలకపార్టీ కొమ్ముకాసేందుకు ఎంతటి మారణకాండకైనా వెనుకాడడు. ప్రభాకర్ ఎక్కడెక్కడ పనిచేసిందీ, తన హయాంలో ఏయే ఘనకార్యాలు సాధించిందీ అన్ని వివరాలను త్రివిక్రమరావు డి.ఐ.జి.కి అందించాడు. కొన్ని పేపర్ కటింగ్స్‌కూడా సేకరించి సమర్పించాడు. అయితే ఇలాంటి బదిలీలు హైలెవల్‌లో జరగాలితప్ప తానుచేయగలిగింది పెద్దగాలేదని డి.ఐ.జి. తన అశక్తత వెల్లడించాడు.

"నేనిచ్చిన వివరాలతో మీరు ప్రభుత్వానికి రాయండి. మున్సిపల్ ఎన్నికలు శాంతియుతంగా జరగాలంటే ఎన్నికల్లో ప్రభాకర్‌ని ఆ ఊరినుంచి బదిలీచేయడం తప్పనిసరి అని రికమెండ్ చేసేందుకు మీకేమీ అభ్యంతరం వుండదనుకుంటాను. నేను చెప్పినవన్నీ మీరు క్షుణ్ణంగా పరిశీలించాకే ప్రొసీడ్ కావచ్చు. బాధ్యతగల పోలీసు ఆఫీసర్‌గా మీకర్తవ్యంమీరు నెరవేరుస్తారని ఆశించడంలో తప్పులేదుగా. ఎందుకంటే బాధ్యతగల ఒక నాయకునిగా రాగల ప్రమాదాన్ని ముందుగా మీ దృష్టికితెచ్చాను. మీరు చర్యతీసుకోకపోతే విధినిర్వహణలో మీరు విఫలంచెందినట్లే అవుతుంది"

త్రివిక్రమరావు సౌమ్యంగానే మాట్లాడినా అందులో హెచ్చరికవుంది.

"మీరు చెప్పేది నేనుకాదనడంలేదు. కాని రూల్స్ మీకుతెలీనివికావు." డి.ఐ.జి. మరోసారి తన పరిస్థితి వివరించేందుకు ప్రయత్నించాడు.

"నేను చెబుతున్నది మీకు అర్థంకాలేదేమోననిపిస్తోంది. కిందిస్థాయిలో ఏం జరుగుతోందో పైవాళ్లకితెలీదు. మధ్యలోవుండే మీలాంటివాళ్లయినా ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళ్లాలి కదా? మీరు ఆపనిచెయ్యండి చాలు అంతే" కుర్చీలోనుంచి లేస్తూ అన్నాడు త్రివిక్రమరావు.

డి.ఐ.జి. మౌనంగా తలవూపాడు అలాగేనన్నట్టు. త్రివిక్రమరావుతోబాటు ఆయనా వరండాలోకివచ్చాడు. త్రివిక్రమరావు కారెక్కుతూ, "నేను రేపురాత్రికి బయలుదేరి రాజధానికి వెళుతున్నాను. మీరీరోజే ఆ రిపోర్టు పంపండి. నా కంప్లయింట్ కూడా జతపరచడం మరవొద్దు" అని చివరిసారిగా చెప్పి వెళ్లిపోయాడు.

డి.ఐ.జి. మధ్యేమార్గంగా పోయేమనిషి. స్థానికరాజకీయాలన్నీ బాగా ఆకళింపుచేసుకున్నవాడు. ప్రభాకర్ ఎలాంటివాడో ఆయనకి బాగా తెలును. త్రివిక్రమరావు చెప్పిందంతా నిజమేనని ఆయన ఒప్పుకుంటాడు. కాని రాజకీయంగా ఇప్పుడు ప్రభాకర్ బలంగావున్నాడు. మంత్రి అండదండలు అతనికి పుష్కలంగావున్నాయి. అందుకే అతనేం చేసినా చెల్లుతోంది. అతని సర్వీస్ రికార్డు ప్రకారమైతే ప్రభాకర్‌కి జన్మలో ప్రమోషన్ రాకూడదు. సర్వీస్ ఫైల్ నిండా చెప్పలేనన్ని కొర్రీలు. పై అధికారి మారినప్పుడల్లా అతని ఫైల్లో ఎర్రమార్కులు తప్పవు. పై అధికారుల్ని ఏడిపించుకుతింటాడని పేరుంది. ప్రభుత్వ లాబీ మంచిపలుకుబడివుంది. అందుకే అతనలా ప్రవర్తిస్తుంటాడని ప్రతి అధికారికీ తెలుసు. పట్టుమని మూడేళ్లు ఎక్కడా పనిచెయ్యలేడు. గతంలో పనిచేసిన డి.ఎస్.పి. కూడా ప్రభాకర్ మూలంగానే బదిలీఅయ్యాడు. ఆ సంగతి డి.ఐ.జి.కి ఇక్కడ జాయిన్‌కాకముందే తెలుసు.

త్రివిక్రమరావు తనకొక సమస్య పెట్టివెళ్లాడు. ఈ సమస్య పరిష్కరించడంలో తనపాత్ర ఏమిటో స్పష్టంగా తెలుస్తున్నా ధైర్యంగా అడుగువెయ్యలేకపోతున్నాడు.

త్రివిక్రమరావు కారెక్కబోతూ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. ఎటూ రేపు రాత్రికి ఆయన రాజధానికి వెళతాడు. పైస్థాయిలోనే సమస్య పరిష్కారమవుతుంది. ఒకవేళ అధికారులు అడిగితే అప్పుడే తాను చెప్పదలచుకున్నదేదో చెప్పవచ్చని నిర్ణయించుకున్నాడు.

త్రివిక్రమరావు రాజధాని ప్రయాణం అనుకోకుండా రెండురోజులు వాయిదా పడింది. ఇదీ ఆయనకి మంచిదే అయింది. ఒరోజు ఉదయాన్నే పేపర్లో మొదటి పేజీలో తాటికాయంత





అక్షరాలతో బాంబులాంటి వార్త చూశాడు. అడ బోయే తీర్థం ఎదురుకావడం అంటే ఇదేనేమో ననిపించింది ఆయనకి.

'పెళ్లాన్నే బలితీసుకున్న పోలీసు క్రౌర్యం' హెడ్డింగుతో ఉన్న వార్తని ఆయన ఒకటికి నాలుగుసార్లు చదివాడు. ఆవార్త ఇలా సాగింది:

"అనుక్షణం అమాత్యుని ప్రాపకానికై అర్రులుచాసే ఒక పోలీసు అధికారి కట్టుకున్న భార్యనే ఫణంగాపెట్టిన ఉదంతమిది. భార్యని సజీవదహనంచేసి దానిని ప్రమాదంగా చిత్రించిన ఒక శాడిస్టు పైశాచికప్రవృత్తికి దర్పణం ఈ కథ" అంటూ ప్రభాకర్ తన భార్యని ఎలా చంపిందీ ఆవార్తలో వివరంగా రాశారు. అది ప్రభాకర్ దమననీతికి బలైన ఒక సబార్డినేట్ ఆఫీసర్ ప్రత్యక్షకథనమని కూడా రాశారు.

రాజధాని నగరంలోనే ఆ వార్తకి రూపకల్పన జరిగినట్టు డేట్‌లైన్‌బట్టి అర్థంఅయింది. త్రివిక్రమరావుకు వార్తకి పైభాగాన క్రెడిట్‌లైన్ అనంత్ అని వుంది. ఈమధ్య ఈ పేరు తరచుగా కనిపిస్తోందనుకున్నాడు. ఈ జర్నలిస్టు ఎవరోగాని తనకు చాలా మేలుచేశాడని మనసులోనే అతన్ని అభినందించాడు.

ప్రభాకర్ ఏనాడూ పేపర్ చూడడు. అందుకనే ఊళ్లో చాలామందికి పొద్దున్నే ఈ సంగతి తెలిసినా అతని దృష్టిలోకి మాత్రంరాలేదు. ఉదయం పది గంటలవేళ స్టేషన్‌కి వెళ్లేసరికి రాజధానినుంచి అప్పటికే రెండుసార్లు ఫోన్ వచ్చినట్లు సెంట్రీ చెప్పాడు. గవర్రాజు చేశాడేమోననుకున్నాడు. మరో పది నిముషాల్లో మళ్లీ ఫోన్‌మోగింది. డి.ఐ.జి. ఆఫీసునుంచి ఆ ఫోన్ కాల్! డి.ఐ.జి. పి.ఎ. లైనులో వున్నాడు. ప్రభాకర్ ఒక్క క్షణం ఖంగుతిన్నాడు. ప్రాణాలమీదికి వస్తే తప్ప, హెడ్‌క్వార్టర్స్‌నుంచి తమకి డైరెక్టుగా ఫోన్‌కాల్ రాదు. అవతల్నించీ ఎమర్జెన్సీ టెలిఫోనిక్ మెస్సేజ్ అందుకోబోతున్నట్టు ముందుగా సమాచారం అందించి ఫోన్ కట్‌చేశారు. మళ్లీ అయిదునిముషాల్లో ఫోన్ రింగ్ అయింది. ప్రభాకర్ సెంట్రీని పిలిచి మెస్సేజ్ నోట్‌చేసుకోమని ఆదేశించాడు. రెండే రెండు వాక్యాలతో మెస్సేజ్ పూర్తయింది. ప్రభాకర్ ముఖంలోకి అనుమానంగా చూస్తూ సెంట్రీ మెస్సేజ్ బుక్ అందించాడు. అక్షరాలవైపు ప్రభాకర్ కళ్లు పరుగెత్తాయి.

'ఈరోజు పత్రికలో వచ్చిన వార్తలోని నిజానిజాలు తెలిసేవరకు ప్రభాకర్‌ని సస్పెన్షన్‌లో వుంచుతున్నాం. దర్యాప్తు సంఘానికి సహకరించాల్సిందిగా ప్రభాకర్‌ని ఆదేశిస్తున్నాం'

చదివి షాక్ తిన్నాడతను. ప్రభాకర్ కాళ్ళకింద భూమి కంపించి పోతున్నట్లే ఫీలయ్యాడు. వెంటనే పేపర్ తెప్పించి చూశాడు. ఒళ్లంతా కంపించింది. ముఖంలో నెత్తురు చుక్కలేదు. పేపర్‌ని రెండు చేతులతో నలిపేస్తూ పళ్లు పటపటకొరికాడు. 'బాస్టర్డ్స్' అంటూ గొణుక్కున్నాడు. ఆరాత్రే రాజధానికి ప్రయాణం అయ్యాడు.



**తె**లతెలవారుతుండగా రాజధాని నగరంలో బస్సుదిగాడు. నేరుగా గవర్రాజు ఇంటికి వెళ్లాడు. ఆయన పరిస్థితి ముందుచూస్తే గొయ్యి, వెనక చూస్తే నుయ్యి మాదిరిగా వుంది. నిమ్మకు నీరెత్తినట్టు మౌనంగా కూర్చున్నాడాయన. గవర్రాజు ఎలాగైనాసరే చక్రం అడ్డువేయగలడన్న ధీమాతో బస్సులో రాత్రంతా హాయిగా నిద్రపోయాడు. తీరా ఇప్పుడాయన వైఖరి చూస్తుంటే ప్రభాకర్‌కి అనుమానంగా వుంది.

ఇన్నేళ్లుగా గవర్రాజుకి తాను నమ్మిన బంటుగా వున్నాడు. త్రివిక్రమరావు మాటల్లో చెప్పాలంటే కుక్కకన్నా ఎక్కువ విశ్వాసం చూపాడు తాను. తాను ఏపాపంచేసినా 'స్వామి భక్తి'తోనే చేశాడు. ఆరోజు ఆయన కోసం తాను ఎంతగా గడ్డి కరిచాడు! గోపాల్ వ్యవహారంలో భ్రష్టుపట్టింది ఎవరికోసం! త్రివిక్రమరావు



తనని పురుగుకన్నా హీనంగా చూస్తాడు ఎందుకు?

గవర్రాజువైపే తదేకంగా చూస్తూ కూర్చున్న ప్రభాకర్‌లో ఇవన్నీ ప్రశ్నలరూపంలో అతన్ని చుట్టుముడుతున్నాయి. ఈ సమయంలో గవర్రాజు మినహా తననెవ్వరూ ఆదుకోలేరని ప్రభాకర్ నమ్మకం. అందుకే అంతదూరం నుంచి రాత్రికి రాత్రి బయల్దేరివచ్చాడు. గవర్రాజు తనని ఈ గండంనుంచి గట్టెక్కించకపోతే పరిస్థితి ఎలా వుంటుందో ప్రభాకర్ వూహకే అందడంలేదు. సాక్ష్యం ఏముందోగాని హత్యానేరానికి ముందు ఉద్యోగమే వూడుతుంది.

ఇన్నాళ్లు ఖాకీబట్టల పరదామాటున తిరుగులేని మహారాజుగా చెలామణీ అయిన తనకి ముమ్మందు పట్టబోయే దుర్గతిని తలుచుకుంటేనే భయంకరంగా వుంది.

"ఎక్కడికెళ్ళినా మనకి అగ్నిపరీక్షలు తప్పడంలేదు" దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్న గవర్రాజు నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ పెదవివిప్పాడు. ప్రభాకర్‌కి మాటలే కరువయ్యాయి. గవర్రాజు వైపు చూస్తూ కూర్చోవడం మినహా అతనికి మరేమీ తోచడంలేదు.

ఇద్దరి మధ్యా మళ్ళీ మౌనం రాజ్యమేలుతోంది.

కాలి బొటనవేలిని నేలకేసి రాస్తూ గవర్రాజు మళ్ళీ నోరువిప్పాడు. "అయిందేదో అయిపోయింది. ఇప్పుడిక ఏంచేయాలో ఆలోచించాలి"

దానికోసమే ప్రభాకర్ ఎదురుచూస్తున్నాడు. అతనిలో ఆశ చిగురిస్తోంది.

"ఇంతకీ నీవుద్దేశం చెప్పలేదు" ప్రభాకర్ వైపు తలెత్తి చూస్తూ అన్నాడు గవర్రాజు.

"మీరే నన్ను గట్టెక్కించాలి. మీరెలా చేసినా నాకు అభ్యంతరంలేదు" ప్రభాకర్ నేలకేసి చూస్తూ మాట్లాడుతున్నాడు.

గవర్రాజుకి ఈ పరిస్థితి నిజానికి చాలా ఇబ్బందికరంగావుంది. ప్రభాకర్ చేసినదానిలో తనకీ సగం వాటావుంది. రేపు ఎంక్వయిరీ జరిగితే తన గుట్టురట్టు కాక తప్పదు. గవర్రాజు మనస్సులో రకరకాల ఆలోచనలు మెదులుతున్నాయి. ప్రభాకర్‌తో అన్యమనస్కంగానే మాట్లాడుతున్నాడు.

"తప్పోఒప్పో ఇద్దరం కలిసే చేశాం. మీ కోసమే నేను గడ్డికరిచాను. నన్ను ఈ వూబిలో నుంచి బైటికి లాగాల్సిన బాధ్యత మీదే"నని చెప్పాలని వుంది ప్రభాకర్‌కి. కాని ఆ తరహాలో మాట్లాడేందుకు నోరుపెగలడంలేదు. ఈ సమయంలో లాజిక్కులు లాగి ప్రయోజనంలేదు. బ్రతిమాలినా, భంగపడినా పనికావడం ముఖ్యం.. అందుకే తమాయించుకున్నాడు.

"చూద్దాం... కాస్త డబ్బు ఖర్చయినా ప్రయత్నిస్తాను" గవర్రాజుపైకి అలా అన్నాడేగాని అతని మనస్సులో ఆలోచనవేరు. ఈ వూబిలో తను కూరుకుపోకుండా డబ్బు వెదజల్లి అయినా జాగ్రత్తపడాలని అతను అప్పుడే నిర్ణయించుకున్నాడు.

ప్రభాకర్ ముఖంలో అప్పటికిగాని ఆందోళన తగ్గలేదు. కొంచెం రిలాక్స్ అయ్యాడు. "నీ వ్యవహారం హెూం మినిస్టర్‌తో మాట్లాడతాలే" అన్నాడు మళ్ళీ గవర్రాజే.

గవర్రాజు అలా మాట్లాడేసరికి ప్రభాకర్‌కి కొండంత ధైర్యం వచ్చింది. తనకిక ఎలాంటి ఢోకాలేదన్న భరోసాతో తిరిగి వెళ్ళిపోయాడు.

నిజానికి అనంత్ రిపోర్టు గవర్రాజుని ఒక కుదుపు కుదిపింది. అతను తీవ్ర ఆందోళనకి గురయ్యాడు. ఎంతమరిచిపోదామన్నా ఆ వార్త అతని మనోఫలకం నుంచి మాయం కావడంలేదు.

ఎవరీ అనంత్? ఒకసారి ఇతనితో మాట్లాడితే ఎలా వుంటుంది?- అన్న ఆలోచన వచ్చింది. అనంత్ చాలా తెలివిగా వార్త రాశాడు. వార్త స్వభావాన్ని బట్టి ప్రభాకర్ సబార్డినేట్ రంగనాథ్ తన పేరు కూడా బయటపెట్టే వుంటాడని గవర్రాజు గ్రహించాడు. కాని అనంత్ మాత్రం తన వార్తలో 'అమాత్యుడు' అన్న పదాన్నే వాడాడు. అతను ఎందుకిలా చేశాడో గవర్రాజు వూహకి అందడంలేదు. మొత్తానికి దీనివెనుక ఏదో కారణం వుండి వుంటుందని మాత్రం అనుమానించాడు. గవర్రాజు పర్యటన గురించి అనంత్ పరోక్షంగానైనా వార్తలో ప్రస్తావించలేదు. అంత తెలివిగా రాశాడావార్తని.

అనంత్‌కోసం గవర్రాజు భరత్‌చేత పత్రికా




ఫీసుకి ఫోన్ చేయించాడు. అనంత్ లైన్‌లోకొచ్చాడు. మంత్రిగారు ఒకసారి మాట్లాడాలనుకుంటున్నారని భరత్ తెలిపాడు. ఇంటికి రావాల్సిందిగా భరత్ ఆహ్వానించాడు. అనంత్ కొద్దిసేపు ఆలోచించాడు. చివరికి "సరే... వస్తా" అని చెప్పి ఫోన్‌పెట్టేశాడు.

గవర్రాజు అనంత్‌తో దాదాపు గంటసేపు మాట్లాడాడు. అయినా తాను అనుకున్న అసలు సమాచారం రాబట్టలేకపోయాడు. తాను ముందుగా బైటపడకూడదని గవర్రాజు ఆచితూచి మాట్లాడాడు. తనకి తెల్సినదంతా మళ్ళీ గవర్రాజు నోటిమీదుగా వినాలని అనంత్ పెదవి విప్పలేదు. ఇద్దరూ ఎవరి పరిధిల్లో వాళ్ళు వుండటంతో సంభాషణ ముందుకి సాగలేదు. మొత్తానికి గవర్రాజు భయపడుతున్నాడని మాత్రం అనంత్ గ్రహించాడు.

★ ★ ★

మోహిని తన లక్ష్యసాధనలో మరో మెట్టుపై కెక్కింది. అధికారపార్టీ మహిళావిభాగానికి అధ్యక్షురాలిగా నామినేట్ అయింది. అంతే! పాలనాధికారం మొత్తం తన చేతికి చిక్కినంతగా సంబరపడిపోయింది. ఈ వార్త తెలిసిన మరుక్షణం వీరభద్రం నిప్పులు చెరిగాడు. ఆమె తన పరిధులుదాటి వెళ్ళిపోతోందన్న ఉక్రోషం ఆయన్ని ఓ వట్టాన నిలవనీయడంలేదు.

అటు వీరభద్రం విషయంలోనూ అనుకున్నవేమీ సాఫీగా జరగడంలేదు. భూపాలరావు త్వరలో మంత్రి అవుతాడని వెయ్యికళ్ళతో వీరభద్రం ఎదురుచూస్తూకూర్చున్నాడు. తీరా మంత్రివర్గ విస్తరణ శాశ్వతంగా వాయిదా పడింది. గవర్రాజుకి మాత్రం కాంట్రాక్టు ఒప్పందంప్రకారం ఇవాల్సిన వాటా ముట్టచెప్పాల్సివస్తోంది. కాని పూర్వంలా మళ్ళీ ఆ డబ్బు మోహిని ద్వారా రాబట్టలేకపోతున్నాడు.

ఇటు అనంత్‌కేమో ఇప్పుడు రోజుకి ఇరవైనాలుగుగంటలు చాలడంలేదు. ఈ పరిణామాలన్నింటిని ఏరోజుకారోజు ఓ కంటకనిపెడుతున్నాడు. దాదాపు వారం పాటు గవర్రాజు సొంత జిల్లాలో పర్యటించిరావడంతో అనంత్ మరింత సమాచారం సేకరించగలిగాడు. వీటన్నింటికీ లింకువుందనిపించింది. గవర్రాజు ప్రతిస్పందన కనిపెట్టే ఉద్దేశంతోనే అనంత్ ముందు ప్రభాకర్‌మీద బాణాన్ని గురిపెట్టాడు.

గవర్రాజు ఇరుకునపడిపోయాడని తెలుసుకున్నాడు.

మరోవంక మోహిని రాజకీయకార్యకలాపాలని అనంత్ చాలా నిశితంగా పరిశీలిస్తూ సమయంకోసం ఎదురుచూస్తున్నాడు.

కార్పొరేషన్ ఎన్నికలు వచ్చాయి!

పట్టణంలో హడావుడి మొదలైంది. అటు ఓటర్లకి, ఇటు నాయకులకి ఇది పరీక్షా సమయం. గవర్రాజు వారంరోజులుగా వూళ్లోనే మకాంపెట్టాడు. పర్వతవర్ధని, అహోబలరావు, కనకారావు, గణపతిరావు గవర్రాజుకి అండగా నిలిచారు. గవర్రాజు రోజూ రాత్రిళ్ళు పార్టీ కార్యకర్తలకి శిక్షణ ఇస్తున్నాడు.

అనంత్ మళ్ళీ రెక్కలుకట్టుకుని వూళ్ళోవాలాడు.

త్రివిక్రమరావు ఎంతో ఉత్సాహంతో పనిచేస్తునాడు. ప్రభాకర్ లేకపోవడం అతనికి కొండంత ధైర్యంగా వుంది. ప్రభాకర్ స్థానంలో కొత్త ఎ.యస్.పి. వచ్చాడు.

సమయం దగ్గరపడుతున్నకొద్దీ ప్రచారభేరి పరాకాష్టకి చేరింది. పార్టీ సిద్ధాంతాల గురించిగానీ, సేవా తత్పరతగురించిగానీ ఎవ్వరూ మాట్లాడటంలేదు. పరస్పర ఆరోపణలు, వ్యక్తిగత దూషణలు మాత్రం ప్రముఖంగా వినవస్తున్నాయి.

అధికార పార్టీ రిగ్గింగ్ జరిపేందుకు పథకాలు వేస్తున్నదని త్రివిక్రమరావు ప్రచారం మొదలుపెట్టాడు. త్రివిక్రమరావుకి ఈ ఎన్నికలు ప్రతిష్టాత్మకమైనవి. అందుకే తన శక్తియుక్తులన్నింటినీ ప్రయోగిస్తున్నాడు. అతని లక్ష్యం గవర్రాజుని దెబ్బతియ్యడం. పట్టణంలో అతని పెత్తనానికి మంగళం పాడాలన్నది త్రివిక్రమరావు తపన. గవర్రాజు దమననీతి... పోలీసుల అరాచకత్వం... పోలీసులకి గవర్రాజు అండదండలు... టీస్టాల్ రాజకీయం... చలివేంద్రాల భాగోతం- ప్రతి విషయాన్ని అతను ప్రచారసాధనంగా వాడుకుంటున్నాడు.

ప్రజల్ని ఒకరు రెచ్చగొడుతుంటే మరొకరు మభ్యపెడుతున్నారు. గవర్రాజు దృష్టి అంతా సొంత బ్లాకుమీదనే వున్నది. నోట్లో నాలుకగా మసిలే ఒక అంతరంగికుణ్ణి అక్కడ పోటీకి

నిలిపాడు. సొంతబ్లాకు కావడంతో దాన్ని పరువు ప్రతిష్ఠల సమస్యగా తీసుకున్నాడు గవర్రాజు. ఆ బ్లాకులోని ఓటర్ల జాబితా దగ్గర పెట్టుకుని తన సహచరులతో ఒక రాత్రంతా మంతనాలు జరిపాడు. తన అభ్యర్థికే దక్కుతుందని విశ్లేషించిన ప్రతి ఓటుకి గవర్రాజు కొంత మూల్యం చెల్లించాడు. పోలింగ్ సక్రమంగా జరిగితే తమ అభ్యర్థి అయిదు ఓట్ల మెజారిటీతో గెలవాలని లెక్కతేల్చాడు గవర్రాజు.

ఎన్నికలరోజు రానేవచ్చింది. పట్టణంలో ఉద్రిక్తత నెలకొన్నది. అక్కడక్కడ అవాంఛనీయ సంఘటనలు జరిగినా, పోలింగు ప్రశాంతంగానే జరిగినట్టు సాయంత్రానికి అధికారిక ప్రకటన వెలువడింది.

అనుకున్నట్లే ప్రతిపక్షపార్టీ అభ్యర్థులు ఎక్కువ సంఖ్యలో విజయంసాధించారు. మొత్తంమీద మున్సిపాలిటీ గవర్రాజు చెయ్యిజారినట్టయింది. సొంత బ్లాకులోనే ఆయన అభ్యర్థి వరాజయంపాలుకావడం గవర్రాజుకి తలకొట్టేసినట్లయింది. అసలే ఓటమి భారంతో కుంగిపోతున్న గవర్రాజు సొంతబ్లాకులో కూడా ఓడిపోవడంతో ఆగ్రహోదగ్రుడు అయ్యాడు. అహందెబ్బతిన్నది. అయిదు ఓట్ల తేడాతో తమ అభ్యర్థి గెలుస్తాడనుకుంటే తీరా అయిదు ఓట్ల తేడాతో ఓడిపోయాడు. ఆ రాత్రే తన



సహచరులతో కూర్చుని ఎన్నికల ఫలితాలని సమీక్షించాడు. సొంత బ్లాకులో తన ఎన్నికల వ్యూహాన్ని పటాపంచలు చేసిన ఆ అయిదుగురు ఓటర్లు ఎవరో తెలుసుకోవడం గవర్రాజుకి ఏమంత కష్టంకాలేదు. తన పరువుప్రతిష్టలతో ఆడుకున్న ఆ అయిదుగురికి తగినశాస్తి చెయ్యాలని అతని మనస్సు పంతంపట్టింది. అతనిలోని రాజకీయనాయకుడు పగతో బుసలు కొట్టాడు.

★ ★ ★

తెల్లవారింది. ఎండాకాలం కావడంతో ఉదయం పదింటికే ఎండఫెళఫెళ మంటున్నది. గవర్రాజు గుండెల్లో చెలరేగుతున్న అవమానజ్వాలలకి ఆ ఎండ నిదర్శనం. నాలుగు గోడలమధ్య ఒక చిన్నగదిలో గవర్రాజు నిప్పులు చెరుగుతున్నాడు. అతని నోట్లో సిగార్ వుండివుండి పొగలు కక్కుతున్నది. ఆయన పక్కనే పెద్దపులి బొమ్మ ఒకటుంది. అది నోరు తెరచి, ఆకలితీర్చేనాధుడి కోసం ఆవురావురుమని ఎదురుచూస్తున్నట్లుగా వుంది.

గవర్రాజు ఒక చేత్తో ఆ బొమ్మ తల నిమురుతున్నాడు. అతని కళ్ళు అగ్ని గోళాల్లావున్నాయి. ఆ గదిలో మరో నాలుగు కళ్ళున్నాయి. అందులో రెండు ముసలి కళ్ళు దైన్యంగా గవర్రాజు వైపే చూస్తున్నాయి. మిగతా రెండు కళ్ళల్లోనూ యువతేజం తాండవిస్తోంది. అవి నిబ్బరంగా చూస్తున్నాయి. మేం ఏ తప్పు చేయలేదని నిక్కచ్చిగా చెబుతున్నట్టున్నాయి. అవే... ఆ చూపులే గవర్రాజుకి నచ్చవు. ఆ మనస్తత్వమే అతని మనస్సుకి సరిపడదు.

క్షణాలు నిముషాలు మాదిరిగా దొర్లుతున్నాయి. గవర్రాజు సిగార్ తీసి పక్కన పెట్టాడు. మనస్సులో పెల్లుబుకుతున్న ఆగ్రహజ్వాలల్ని పక్కన పెట్టాడన్నమాట. కోపంతో వున్నప్పుడు శాంతస్వరంతో మాట్లాడం అతని టెక్నిక్. రాజకీయం నేర్పిన మరో లౌక్యం ఇది.

గవర్రాజు ఒక చేత్తో పులి బొమ్మని నిమురుతూనే నోరు విప్పాడు.

"ఒరేయ్ సంగీతరావ్... ఇదేమిటో తెల్సురా నీకు?" అంతవరకు ఆ గదిని ఆక్రమించిన భయంకర నిశ్శబ్దం ఈ మాటలతో నీరుగారిపోయింది.

సంగీతరావు తన కొడుకు రత్నరాజువైపు చూశాడు భయంగా.

రత్నరాజు చూపుల్లో నిర్లక్ష్యం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఇది చూసి సంగీతరావు మరింత భయపడ్డాడు. భయపడుతూనే చెప్పాడు-

"పులి బొమ్మ బాబూ" తరతరాల పాలేరు వృత్తిలో జీర్ణించుకుపోయిన వినయం ఆ గొంతులో ప్రస్ఫుటంగా కనిపించింది.

"దీని నోట్లో తలపెడితే ఏమవుతుందిరా?"

"ఏమయ్యేదేమిటి బాబూ... ఎముకలు మిగిలిత్తాది... మిగిలింది తినేత్తాది"

"ఔనా... ఆ సంగతి తెలుసుగదా! మరి ఇంతకీ నేను ఎవర్నంటావ్?"

"అయ్యబాబోయ్... అదేటండీ... తమరీవూరికి... ఆమాటకొస్తే ఈ జిల్లాకి రాష్ట్రానికే కాదండీ... దేశానికే తలకాయలాంటోరు గదండీ!"

గవర్రాజు అలా అడగటం, తండ్రేమో 'నీకాల్మొక్తా బాంచను' అన్నట్టు సమాధానం చెప్పడం రత్నరాజుకి చిర్రెత్తిస్తోంది.

"ఒరేయ్... మొన్నటి ఎన్నికల్లో మీ ఓట్ల కోసం నేను మొదటిసారి ఎంత ఇచ్చానో గుర్తుందిరా?"

"ఉంది దొరా... అయిదొందలు ఇచ్చారుగదండీ"

"అవునా... ఆ మర్నాడే అపోజిషను త్రివిక్రమరావు నిన్ను పిలిపించాడు?" సంగీతరావు ఏం చెబుతాడాని గవర్రాజు ఒక్కక్షణం ఆగాడు.

"అవునండీ" సంగీతరావు నిజం చెప్పాడు.

"అక్కడ ఎంత ముట్టిందీ?" గవర్రాజుకి ఆ విషయం తెలీకకాదు అడిగింది. సంగీతరావు నిజం చెబుతాడో అబద్ధం చెబుతాడో తెలుసుకుందామని.

"మీ చెయ్యికంటే ఆయనగారి చెయ్యి పెద్దదేలెండి" అని సంగీతరావు అనలేదు. తన తండ్రి అలా అనాలని రత్నరాజు కోరిక. కాని ఆమాట అనడని రత్నరాజుకి తెలుసు. అందుకే తానే అనేశాడు.

గవర్రాజు గుండెలో శూలంమాదిరిగా గుచ్చుకుంది ఆ మాట.




"నువ్వు నోరుముయ్యరా పుండాకోర్" గవ రాజు గద్దించాడు.

"పిచ్చిపిచ్చిగా పేలమాకురా పిచ్చనాకొడకా" కొడుకువైపు చూస్తూ గొణిగాడు సంగీతరావు. అటుతర్వాత గవర్రాజువైపు తిరిగి, ఆయన ప్రశ్నకి సమాధానం చెప్పాడు.

"ఆ బాబుగోరు ఆరొందల పాతిక ఇచ్చారండీ"

"ఆ మర్నాడే నేను మళ్ళీ నిన్ను పిలిపించాను– గుర్తుందా?"

"గుర్తుంది దొరా... అప్పుడు మీరు మళ్ళీ రెండొందలయాభై ఇచ్చారండీ..."

"అది తెలిసి త్రివిక్రమరావు నీకు మళ్ళీ ఎంతిచ్చాడు?"

"మూడొందలండీ"

"ఆ తర్వాత నేను?"

"నాలుగొందలు బాబయ్యా"

"ఔనూ... ఇంతకీ మా ఇద్దర్లో ఎవరెక్కువ ఇచ్చారంటావ్?"

"అదేటండీ... మీరే ఎక్కువిచ్చినారండీ..."

"మరి మీ ఓట్లు ఎవరికి పడ్డాయ్?"

దీనికి సంగీతరావునుంచి వెంటనే సమాధానం రాలేదు. అతను చెప్పలేదు. అంతటి ధైర్యం అతనికిలేదు. ఆ సంగతి రత్నరాజుకి తెలుసు. తనే నోరు విప్పాడు-

"మా ఓట్లు ఎవరికి పడ్డాయో తెలిసేకదండీ మమ్మల్ని ఇక్కడికి రప్పించారు"

"అట్లా ఎందుకు జరిగిందో తెల్సుకోవాలని కూడా రప్పించాను" గవర్రాజు చురచురా చూస్తూ అన్నాడు. రత్నరాజు సమాధానం వింటుంటే ఆయనలో అసహ్యం హెచ్చుతోంది.

"అదంతా మీకు చెప్పాల్సిన అవసరం మాకులేదు"

రత్నరాజు గొంతులో ఆ నిర్లక్ష్యం గవర్రాజు ఆహాన్ని మరింత ఎగదోసింది. ఒక్క ఉదుటున కుర్చీలోనుంచి లేచి రెండు అంగల్లో రత్నరాజుని సమీపించాడు. మరుక్షణం రత్నరాజు చెంప ఛెళ్ళుమన్నది. సంగీతరావుకి భయమేసింది.

"డబ్బుకోసం కక్కుర్తిపడే జాతిరా నీది! పచ్చకాగితాల మైకంలో ఒళ్ళు తెలీకుండా హామీలిచ్చి, అవే పచ్చనోట్లకు అమ్ముడుపోవడం మీకేచెల్లు" గవర్రాజు అరిచినట్టుగానే మాట్లాడాడు.

రత్నరాజు ఏమాత్రం వెనక్కి తగ్గలేదు.

"మేమేమీ నీ డబ్బుకోసం వెంటపడలేదు. మీ అవసరంకొద్దీ మీరే వంతులవారీగా మా చేతుల్లో నోట్లు కుక్కారు. అది మాకోసం కాదని మాకు తెలుసు, మీకూ తెలుసు. దీపావళినాడు ప్రమిదలచుట్టూ పురుగులు చేరినట్టు ఎన్నికలప్పుడు ఇళ్ళచుట్టూ తిరగడం మీ నైజం. మీ ఖరీదైన జీవితాలకి మేం వెలుగునిచ్చే ప్రమిదలమని ఎన్నికలప్పుడే మీకు గుర్తొస్తుంది. అందుకే కాళ్ళు అరిగేట్టు తిరుగుతారు. ప్రమిదలో నూనెపోసినట్టు మా జేబుల్ని నోట్లకట్టలతో నింపుతారు– మా ఓట్ల భిక్షకోసం."

గవర్రాజు కొట్టిన దెబ్బ రత్నరాజుచేత దృఢంగా మాట్లాడించింది.

పాలేర్లు చదువుకుంటే ఏమవుతుందో గవర్రాజుకి మరోసారి ప్రత్యక్షంగా తెలిసివచ్చింది. అందుకే డిగ్రీ చదివిన రత్నరాజు అంటే ఆయనకి చెప్పలేనంత ఈర్ష్య. తన డబ్బుతోనే కొడుక్కి చదువు చెప్పించి, ఇప్పుడు తనమీదికి ఉసిగొల్పాడని సంగీతరావుమీద గవర్రాజుకి గొంతుదాకా కోపం ఉంది.

కొడుకు మాటలు వింటుంటే సంగీతరావుకి కాళ్ళల్లో వణుకుపుట్టుకొస్తున్నది. కొడుకు ఈ విధంగా 'దొరని' ఎదిరించి మాట్లాడటం అతనికి నచ్చలేదు.

"ఒరేయ్... అయ్యేన్నీ ఇప్పుడెందుకురా? మనం తప్పుసేసినాం. అయ్యగారి కాళ్ళమీదపడి తప్పు ఒప్పేసుకోరా– ఎదవని ఎదవ"

"ఆగెహె... చెయ్యని తప్పుకి కాళ్ళు ఎందుకు పట్టుకోవాలి?"

"డబ్బులు తీసుకుని ఓటెయ్యకపోవడం తప్పుకాదా? మోసం చేసినట్టుకాదా?" గవర్రాజు మండిపడ్డాడు.

"మా అభిప్రాయమేమిటో తెలుసుకోకుండా వద్దన్నకొద్దీ చేతులు పగలదీసి మరీ మానాన్నకి డబ్బిచ్చి వెళ్ళేవాడివి. అట్లాగే త్రివిక్రమరావు కూడా. మేం చెప్పేది వినిపించుకోకుండా మొండిగా మంచంమీద డబ్బుపెట్టి వెళ్ళే

డు. ఇట్లా మీరిద్దరూ పోటీపడి ఒకరి తర్వాత ఒకరు మానోళ్ళు నొక్కేశారు. మా ఓట్లు ఆయన పార్టీకి ఎక్కడ పడతాయోనని నువ్వు, నీ పార్టీకి దక్కకూడదని ఆయన తాపత్రయపడ్డారు. ఇద్దరూ కలిసి మామీద రాజనీతి ప్రయోగించారు. నీ దగ్గర డబ్బు తీసుకున్నందుకు మీకు అన్యాయం చెయ్యకూడదు. మా ఇష్టాయిష్టాలని పట్టించుకోకపోయినా కొండంత నమ్మకంతో ఆయన కూడా డబ్బిచ్చాడు మరి. ఆయన నమ్మకాని వమ్ముచెయ్యకూడదు. ఇద్దరికీ అన్యాయం చెయ్యదలుచుకోకనే మా అయిదు ఓట్లు మురగేశాం''

రత్నరాజు లాజిక్ వినేసరికి గవర్రాజు మతిపోయినంత పనైంది. తనని దెబ్బతియ్యడమేకాకుండా ఎంతో తెలివిగా సంజాయిషీ ఇచ్చినందుకు అతని ఒళ్ళంతా కారం పూసినట్లయింది. రత్నరాజు తనముందు ఇంతగా తెగించి మాట్లాడటం ఆయనకి రుచించడంలేదు.

తప్పయిపోయింది క్షమించమని కాళ్ళబేరానికి వస్తాడని గవర్రాజు కన్నకల వమ్ముకావటంతో అతనిలో పంతంపెరిగింది. సంగీతరావునీ, రత్నరాజునీ మార్చి మార్చి చూశాడు. ఇద్దరూ ఉత్తర దక్షిణ ధృవాల్లా కనిపించారు. తండ్రిలో నమ్రత, కొడులో అహంభావం! ఇదంతా చదువు తెచ్చినమార్పు! ఆ అహాన్ని ఎలాగైనాసరే తుంచివేయాలని గవర్రాజు నిర్ణయించుకున్నాడు. తన ఇంట్లోనే పాలేరుపనిచేస్తూ, తన సొమ్ముతింటూ తనకే తీరని ద్రోహం చేసినందుకు శిక్షగా తన బాకీ మొత్తం అణాపైసలతోసహా చెల్లించమని గవర్రాజు హుకుం జారీ చేశాడు.

సంగీతరావు ఖంగుతిన్నాడు. గవర్రాజు బాకీతీర్చడం తనవల్ల అయ్యేపనేనా! ఆయన బాకీ అంత తేలిగ్గా సమసిపోయేదా? తాత నుంచి తండ్రికి, తండ్రినుంచి తనకి సంక్రమించిన ఆ బాకీ వేలల్లో ఉంది. దానికోసమే తాను అహర్నిశలూ రెక్కలుముక్కలు చేసుకుని పాలేరుగా బతుకువెళ్ళదీస్తున్నాడు. ఈ ఊబిలో తన కొడుకు చిక్కుకుపోకూడదన్న భ్రమలో రత్నరాజుని నానాతంటాలుపడి డిగ్రీ చదివించాడు. అందుకోసం గవర్రాజు దగ్గర ఇంకా బాకీ చేయాల్సివచ్చింది. కొడుకు చదువుకోసం తానెన్ని తిప్పలుపడ్డాడు! గవర్రాజు నుంచి ఎంతటి ఛీత్కారం చవిచూశాడు! కొడుకు జీవితమన్నా బాగుపడుతుందన్న ఆశతో అవన్నీ భరించాడు. గతమంతా ఒక్కక్షణం కళ్ళముందు మెదలడంతో సంగీతరావు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"దొరా... ఇన్నేళ్ళు ఓపికపట్టారు... మరికొంత గడువివ్వండి. ఆడికి ఏదో ఒక నౌకరీ దొరికితే మీ బాకీతీర్చేసుకుంటాం''

సంగీతరావు చాలా బతిమిలాడాడు కాని భంగపడ్డాడు. గవర్రాజు ఏ మాత్రం దిగిరాలేదు.

"పాతబాకీలతోపాటు ఓట్లు వేస్తామని తీసుకున్న డబ్బు కూడా ఇచ్చేయాలి'' అంటూ షరతుపెట్టాడు.

రత్నరాజు మనస్సు ఎక్కడెక్కడో ఆలోచిస్తోంది. గవర్రాజుతో మాట్లాడి ప్రయోజనంలేదని అతని మనస్సు పదేపదే చెబుతోంది.

"రెండురోజులు టైమిస్తున్నాను ఈలోగా ఇవ్వకపోయారో...'' మధ్యలోనే ఆగిపోయింది గవర్రాజు గొంతు. మీ జీవితాలుకూడా ఇలాగే అర్థాంతరంగా ముగుస్తాయన్న అర్థం ఆ గొంతులో ధ్వనించింది.

గవర్రాజు ఎంతటి ఘటికుడో సంగీతరావుకి తెలుసు. అందుకే సంగీతరావు గుండె లోలోన విలపించింది. ఎంత ఆలోచించినా ఈ గండం గట్టెక్కే సూచనలు కనిపించడంలేదు. గవర్రాజుని ఈ దశలో ఒప్పించడం సాధ్యంకాదు. బాకీలు తీర్చడమే ఏకైక మార్గం. ఇది తనకి సాధ్యంకాదు.

రత్నరాజు చూపుల్లో నిశ్చలత్వం అతని దృఢచిత్తానికి దర్పణం పడుతోంది.

గవర్రాజు తన కుటుంబం మీద పగపట్టాడు. తండ్రి అమాయకత్వం అతనికి బాగా ఉపకరించింది. ఆ అమాయకత్వమే ఇప్పుడు తన తండ్రికి మరింత శాపంగా మారింది.

రత్నరాజు ఆలోచనలు ఇప్పుడిప్పుడే ఒక కొలిక్కి వస్తున్నాయి.

గవర్రాజు తన కుటుంబంమీద దెబ్బతీసేలోగా తానే గవర్రాజు మీద ప్రతీకారం తీర్చుకోవాలి. ఏ ప్రతిష్ఠకోసం అయితే గవర్రాజు ఇప్పు




డు తమ జీవితాలతో ఆడుకోజూస్తున్నాడో ఆ ప్రతిష్టనే సమాధిచెయ్యాలి.

రత్నరాజు మనస్సు ఇప్పటికి ఒక స్థిరనిర్ణయానికి రాగలిగింది.

ఒక విషసర్పం చావాలంటే కొన్ని చీమలు బలికాక తప్పదు.

గవర్రాజుని పాతాళానికి దించాలంటే తాను త్యాగం చెయ్యక తప్పదు. అవును. తను పోతేనేం... వందలాది రత్నరాజులు పుడతారు. వేలాది సంగీతరావులు విముక్తులవుతారు. బాకీల నెపంతో వంశానుగతంగా వెట్టిచాకిరికీ ప్రోనోట్లు రాయించుకునే భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థ పునాదులు కూలిపోతాయి.

రత్నరాజు గుండె ఇప్పుడు తేలికపడింది.

"ఇంకా రెండురోజులే టైముంది" అప్రయత్నంగా గొణుక్కుంటూ రత్నరాజు అక్కడినుంచి మెరుపు వేగంతో వెళ్ళిపోయాడు.

రత్నరాజు ప్రవర్తన గవర్రాజుకి మరింత కోపం తెప్పించింది. ఆ కోపాన్నంతా సంగీతరావుమీద వెళ్ళగక్కాడు.

"ఆడు కుర్రెదవ... ఆడిమాటలు పట్టించుకోకండి బాబూ" సంగీతరావు సర్దిచెప్పబోయాడు.

"వాడి మాటలు కాకపోతే నీమాటలు లెక్కరానాకు? ఆ తలబిరుసు చూశావుగా"

"మెదటి నుంచీ ఆడు అంతేనండయ్యా"

"అందుకే నేనూ వాడిలాగే పంతానికి పోదలుచుకున్నాను"

"నా సంగతి మీకు తెల్వనిదిగాదుబాబూ"

"నీసంగతి తెలుసుకాబట్టేరా అడిగినప్పుడల్లా డబ్బిచ్చి చివరికి పగఅయ్యాను."

"మీ ఉప్పు తిని బతుకుతున్నవాణ్ణి. మీకు కలలోకూడా అపకారం తలపెడతానా బాబూ"

"ఆ సంగతి నువ్వూ, నీ కొడుకూ కలిసి తేల్చుకోవాల్సిన విషయం"

"వాడు కుర్రకుంక. అన్ని ఒగ్గేయండి బాబూ"

"వాడు కుర్రకుంకా? రేపటి నీ జీవితపు ఆశాజ్యోతిరా వాడు! వాణ్ని ఇలావదిలేస్తే నాకే ఎసరు తెస్తాడు. నానాతిప్పలుపడి చదివించావుగా! వాణ్ణే తీర్పమను నాబాకీ"

"అందుకే బాబూ గడువు అడుగుతున్నాను"

"ఇచ్చానుగా రెండురోజులు. నా నిర్ణయం మారదు. ఇకనువ్వు వెళ్ళొచ్చు" సంగీతరావు నిరాశగా అక్కడినుంచి వెనుదిరిగాడు.



తెల్లవారుతున్నదనడానికి గుర్తుగా కోళ్ళు గొంతులెత్తి కూస్తున్నాయి. అప్పుడే సంగీతరావు పనిలోకొచ్చాడు.

గవర్రాజు భవనంలో విశాలమైన హాలు, ఆ హాలులోంచి పెరట్లోకి దారి వుంది. హాలులో అడుగుపెట్టిన సంగీతరావుకి ఎదురుగా కొడుకు శవం వేలాడుతూ కనిపించింది. అతను కెవ్వున అరిచాడు. సీలింగ్‌ఫ్యాన్‌కి ఉరేసుకుని చనిపోయిన రత్నరాజు కాళ్ళని వాటేసుకుని సంగీతరావు భోరున ఏడ్చాడు. ఆ ఏడుపు భవనమంతా మార్మోగింది.

పై అంతస్థులోనుంచి అప్పుడే కళ్ళు నులుముకుంటూ గవర్రాజు మెట్లదగ్గరికొచ్చాడు. అక్కడి దృశ్యాన్ని చూసి హతాశుడయ్యాడు. గవర్రాజు కనిపించగానే సంగీతరావు మరింత బిగ్గరగా ఏడుపుమొదలు పెట్టాడు. గవర్రాజుకి కాలూచెయ్యీ ఆడడంలేదు. అతనికి ఊహించని పరిణామం. మెల్లిగా ఒక్కొక్క మెట్టేదిగుతున్నాడు... నిద్రమత్తు పూర్తిగా వదిలింది.

"ఏమిట్రా... ఏమిటీ ఘోరం? ఎందుకిలా జరిగింది?" కంగారులో ఏం అడుగుతున్నాడో తనకే తెలీని పరిస్థితిలోవున్నాడిప్పుడు గవర్రాజు.

"నేను మీకేం అపకారం చేశానురా..."

"అంతమాట ఇప్పుడెవరు అన్నారు బాబూ?" సంగీతరావు ఏడుస్తూనే మాట్లాడుతున్నాడు.

"లేకపోతే నీకొడుకు చేసిన నిర్వాకం

ఏమిటి చెప్పు?''

చెట్టంత కొడుకు తనకి అన్యాయం చేసిపో యాడని సంగీతరావు విలపిస్తున్నాడు. తన ఇంట్లోవురేసుకుని తన ప్రాణంమీదికి తెచ్చా డని గవర్రాజు మండిపడుతున్నాడు.

''అసలు ఇదంతా మీతప్పు కాదురా. చేచే తులా నేను చేసుకున్న పాపమే. పాముకి పాలుపోసి పెంచాను. పెట్టిన చెయ్యిని నర కడం మీ జాతికి సరదా''

రత్నరాజు కావాలనే తన ఇంట్లో ఉరేసుకు న్నాడని గవర్రాజు నిర్ధారించుకున్నాడు. ఇందులో ఏదో పథకం ఉంది. రాజకీయంగా తనని భ్రష్టు పట్టించడమే ఈ కుట్ర ఉద్దేశంగా అతనికి తోచింది.

''నా ఇంట్లో ఉరేసుకుని చచ్చి, నీ జాతికి స్వర్ణయుగం తేవాలనుకున్నాడు. అందుకు నన్నొక బలిపశువుని చేయాలనుకున్నాడు''

దాదాపు పదినిముషాలసేపు సంగీతరావు మీద విరుచుకుపడ్డాడు. అన్నిటికీ సంగీతరావు ఏడుపే సమాధానంగా వస్తోంది. గవర్రాజు భార్యలోపలి గదిలోనుంచి అంతావింటూ కూర్చుంది.

గవర్రాజు కోపంతో చిందులు తొక్కుతూ కా లుకాలిన పిల్లిలో అటూఇటూ తిరుగుతున్నాడే గాని అతని మనస్సు మాత్రం చాలావేగంగా పనిచేస్తోంది. తన పరువు ప్రతిష్టలతో రత్న రాజు ఇలా ఆడుకుంటాడని గవర్రాజు కల్లో సైతం ఊహించలేదు. చచ్చి విప్లవం తేవాల నుకున్న రత్నరాజు ఆశల్ని అడియాస చేయా లని గవర్రాజు పంతంపట్టాడు. రత్నరాజు చావుఎట్టి పరిస్థితుల్లోనూ తన భావిజీవితానికి ప్రతి బంధకం కాకూడదు.

శవాన్ని కిందికి దింపించాడు. ఒక గదిలోకి మార్పించాడు. భవనంలోఉన్న కిటికీలన్నీ మూ యించాడు. భర్త ఎంత ఆందోళన చెందుతు న్నదీ గవర్రాజు భార్య ఇట్టే గ్రహించింది.

గవర్రాజు వైఖరి సంగీతరావుకి అంతుబట్ట కుండా ఉంది. ఏడ్చి ఏడ్చి అతనికళ్ళు ఉబ్బి పోయాయి. ఆ కళ్ళల్లో నీళ్ళు ఇంకిపోయాయి. కొడుకు పోయాడన్న బాధకంటే కొడుకు శవా న్ని అయినా తన చేతికి దక్కనిస్తారో లేదోనన్న దిగులు ఎక్కువైంది.

''బాబూ... అయిందేదో అయిపోయింది. ఇదంతా నాఖర్మ. ఆ శవాన్నయినా అప్ప గించండి బాబూ.... తృప్తిగా తగలేసుకుంటా'' తండ్రి మనస్సు దీనంగా అర్థించింది.

గవర్రాజు సందిగ్ధంలో పడ్డాడు. ఈ శవాన్ని గది దాటిస్తే... ఆ తర్వాత పరిస్థితి ఎలా వుంటుందో అతని ఊహకి అందనిదేమీ కాదు. పట్టపగలు శవం గడపదాటితే తన ప్రిస్టేజీ మంటకలుస్తుంది. తన రాజకీయ జీవితమే మట్టికరుస్తుంది.

భవనంలో ఎక్కడ ఏ చిన్న అలికిడి అయినా గవర్రాజు ఉలిక్కిపడుతున్నాడు. క్షణ క్షణం కంగారెక్కువవుతోంది. తన చుట్టూ నాగు బాములు కోరలు ఆడిస్తూ పహారాకాస్తుంటా యని గవర్రాజు భయం! ఏక్షణంలో అయినా, ఏ కొంచెం ఆసరాదొరికినా కాటువేసేందుకు వెయ్యికళ్ళతో ఎదురు చూస్తుంటాయని అతని అనుమానం. తన ఔన్నత్యాన్ని కాలరాయాలని ఎంతోమంది క్షణక్షణం కుయుక్తులు పన్ను తుంటారు. ఈ విషయం వాళ్ళదాకా వెళితే... అమ్మో... ఆ పరిస్థితే ఊహించుకోలేకపోయా డు.

రాజకీయం ఒక రంగుల లోకం అని గవ ర్రాజు అనుభవంతో నేర్చుకున్న పాఠం.

వేదికలెక్కినప్పుడు ప్రజలందరూ నావాళ్ళే ననడం గవర్రాజు లౌక్యం! వేదిక దిగాక ఆ ప్రజలే అతనికి నమ్మక ద్రోహులుగా కనిపిస్తా రు. ఎక్కడ ఏది అవసరమో అది చెప్పడమే అసలైన రాజకీయం అంటాడు గవర్రాజు.

ఏ ఒక్క వ్యక్తినీ నమ్మకపోతే రాజకీయ నాయకుడు కావడం కష్టమంటాడు. నాయకు నిగా గుర్తింపు పొందాక కనబడ్డ ప్రతి ఒక్కన్నీ నమ్ముకుంటూపోతే ఏ రాజకీయనాయకుడూ ఎంతో కాలం పదవిలో ఉండలేడని కూడా అతనే చెబుతాడు. ఈ రాజకీయ మాయాలో కంలో ఓ నాలుకతో ప్రశంసలు కురిపిస్తూనే, మరొకవంక వీడెప్పుడు దిగుతాడా అని నంతా పవాచకాలు సిద్ధం చేసిఉంచుకుంటారనే నగ్నసత్యం గవర్రాజుకి తెలును. అందుకే గాలి కదిలినా ఉలిక్కిపడుతున్నాడు.

అప్పుడే ఒక గంట గడిచింది నిముషాలు క్షణాలు మాదిరిగా గిర్రున తిరిగిపోతున్నా యేమోననిపించింది గవర్రాజుకి. నాలుగు

దిక్కులా పూర్తిగా తెల్లవారిందంటె తాను చిక్కుల్లో పడతాడు. శవాన్ని ఎంతసేపని గదిలో దాచగలడు? ఎందరికళ్ళు కప్పగలడు? తెల్లవారితే తనకోసం వచ్చేవారు, పోయేవారు. వీరందర్నీ ఎవరు ఆపుతారు? గవర్రాజు ఎన్ని విధాలుగానో ఆలోచిస్తున్నాడు. ముఖమంతా చెమటపట్టింది.

వీలైనంత త్వరలో ఈ శవాన్ని ఇక్కడినుంచి మాయం చెయ్యాలి! అయితే ఎలా మాయం చెయ్యాలి? ఎక్కడికి మాయం చెయ్యాలనే ప్రశ్నలకే సమాధానం దొరకడంలేదు. ఇది చాలా సున్నితమైన వ్యవహారం. ఏమాత్రం బైటివారికి అనుమానం వచ్చినా తన జీవితంలో చెరిగిపోని మచ్చగా మిగిలిపోతుంది.

ఆతృత ఎక్కువవుతున్నకొద్దీ ఆలోచనలకి అంతరాయం కలుగుతోంది.

అవతల క్షణాలు నిముషాలుగా, నిముషాలు గంటలుగా దొర్లిపోతున్నాయి. ఏంచేయాలో దిక్కుతోచని పరిస్థితుల్లో గవర్రాజు అటుఇటు పచార్లు చేస్తున్నాడు. ఇంతలో తలుపు చప్పుడు అయింది.

గవర్రాజు కాళ్ళు ఒక్కసారిగా ఆగిపోయాయి. ఇంతపొద్దున్నే తన కోసం ఎవరు వచ్చివుంటారోనని ఆలోచించాడు. ఎవ్వరూ ఊహకి అందడంలేదు. అవతల తలుపు దబాదబా బాదుతున్నారు. సంగీతరావు వెళ్ళి తలుపు తీశాడు.

ఎ.ఎస్.పి. రాఘవ గబగబా లోనికి వచ్చాడు. గవర్రాజు గుండెల్లో రాయిపడింది. ఈ సమాచారం పోలీసులకి అప్పుడే ఎలా అందిందో ఆయనకి అర్థంకాలేదు.

లోనికి వచ్చీరావడంతోనే రాఘవ పరిసరాలన్నీ గమనించడం మొదలుపెట్టాడు. హాలుమధ్యలో సీలింగ్‌ఫ్యానుకి తాడు వేలాడుతోంది. హాలుకి ఆనుకుని వున్న ఒకగదిలో శవం కనిపించింది.

"అతను ఎవరు?" శవాన్ని చూపిస్తూ రాఘవ సంగీతరావుని అడిగాడు.

సంగీతరావులో ఒక్కసారిగా ఏడుపు ముంచుకొచ్చింది. ఈ వ్యవహారం పోలీసుల చేతుల్లోకి పోతున్నదని తెలిసి అతని మనస్సు భయంభయంగా రోదించింది. గవర్రాజు కలగజేసుకుని రాఘవని సమాధానపరిచేందుకు ప్రయత్నించాడు.

"చూడండి ఎ.ఎస్.పి.గారూ... ఇక్కడ జరిగిందంతా యాధృచ్ఛికం"

రాఘవ ఆయనవైపు చురుగ్గా చూశాడు. "నిజాన్ని దాచాలని మీరు ప్రయత్నించడం కూడా యాధృచ్ఛికమేనా?"

గవర్రాజు కొంచెం తడబడ్డాడు. రాఘవ కొత్తగా అవూరొచ్చాడు. తనసంగతి పూర్తిగా తెలిసివుండదని గవర్రాజు సరిపెట్టుకున్నాడు. పైకిమాత్రం చాలా సౌమ్యంగా మాట్లాడాడు.

"వాస్తవానికి నిజానిజాలు చెప్పాల్సినంత పెద్దవిషయమేమీ కాదండీ ఇది. ఈ చనిపోయినతను ఎవరోకాదు. మాపాలేరు కొడుకు. ఇది మాఅంతరంగిక విషయం. దీన్ని మేంమేం సరిదిద్దుకుంటాం"

"సారీ గవర్రాజుగారూ... ఆత్మహత్య చట్టరీత్యా నేరమని మీకు తెలీనిదేంకాదు. ఇది ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో, మాకు సమాచారం అందాక కూడా విచారించకపోతే అది మాతప్పు అవుతుంది"

"లక్షలాది ప్రజలకి ప్రతినిధిని. నేను చెబుతున్నానుగదా" అధికారబాణం ప్రయోగించాడు గవర్రాజు. అతనివైఖరి రాఘవకి ఎంతమాత్రం నచ్చలేదు. అందుకే గవర్రాజువైపు చురచురా చూశాడు. "ఒరేయ్... సంగీతరావ్... ఈ ఎ.ఎస్.పి.కి చెప్పు నీకొడుకు ఆత్మహత్య చేసుకు చావలేదని చెప్పు" గవర్రాజు గొంతు గర్జించినట్టుగానే వుంది.

"బాబూ...ఆడెందుకు చచ్చాడో నాకైనా చెప్పి చావలేదు. ఆ దిక్కులేని చావుమీద మీరెందుకు వాదులాడుకుంటారు?"

సంగీతరావువైపు ఎ.ఎస్.పి. వింతగా చూశాడు. "నీకొడుకు చచ్చిపోయినందుకు నీకేమీ బాధగా లేదా?" తన అనుమానాన్ని సంగీతరావు ముందు బైటపెట్టాడు.

"పోలీసుబాబూ....నాకొడుకు పోయాడని కడుపుమంటకొద్దీ నేను చెప్పుకోవాలి. కాని నేను అదేమీ చెప్పుకోవడంలేదు. మీరు ఒగ్గేయండి బాబూ" సంగీతరావు దీనావస్థ రాఘవకి అర్థమైంది.

"నీవు చెప్పటానికి భయపడకూడదు" ఈమాట ఎంతో ఆవేశంతో అన్నాడు.

సంగీతరావుకి ఇదేమీ అర్థంకావడంలేదు. అతని లోకంలో అతనున్నాడు. చేతికి ఎదిగివచ్చిన చెట్టంత కొడుకే నిన్నటిదాకా అతని లోకం. ఇప్పుడు ఆ కొడుకు శవమే అతని సర్వస్వం. ఇక్కడ వ్యవహారం చూస్తుంటే ఆ శవాన్నయినా తనకి దక్కనిచ్చేట్టులేరని భయం పట్టుకుంది. రాఘవతో ఆ విషయమే మొరపెట్టుకున్నాడు.

శవాన్ని ఇప్పుడప్పుడే అప్పగించడం కుదరదని రాఘవ చెప్పాడు.

"ఇది అన్యాయంబాబూ...ఆడు నాకొడుకు...ఆశవం నాది... నాకొడుకుదిబాబూ..." అంటూ రాఘవకాళ్ళ దగ్గరపడి విలపించాడు సంగీతరావు.

తండ్రిగా సంగీతరావు అలా దుఃఖించడంలో అర్థంవుంది. కాని అవతల చట్టం....రాఘవ ఆ సంగతే చెప్పాడు. శవాన్ని శవపరీక్షకు పంపాలి. కేసు రిజిస్టర్ చేసుకోవాలి. రాఘవ చెప్పేదంతా సంగీతరావు విన్నాడు గానీ చట్టాలు, శాసనాల గురించి అతను ఎప్పుడూ వినలేదు. శవాలమీద పనిచేసే చట్టం గురించి ఇప్పుడే వింటున్నాడు.

రాఘవ మాటలు సంగీతరావు కంటే గవర్రాజుని ఎక్కువ హడలెత్తిస్తున్నాయి. ఇలాంటి సమయాల్లో శవపరీక్ష...పోలీసు కేసు.... మామూలు తంతేనని తెలిసినా...ఆయన గుండెల్లో మాత్రం వణుకుపుడుతోంది.

కేసు రిజిస్టర్ అవుతుంది. శవాన్ని పోస్టుమార్టం చేస్తారు. విచారణ జరుగుతుంది. న్యాయం వెలుగుచూస్తుంది. దోమల్ని శిక్షిస్తారు...

"నో... ఇదంతా జరగడానికి వీల్లేదు..." గవర్రాజు మనస్సు మౌనంగా వికటించింది. ఈ శవం గడపదాటడానికి వీల్లేదు. దర్యాప్తు ప్రశ్నే వుండకూడదు.

ఇది పూర్తిగా తనపరువుప్రతిష్టలకి సంబంధించిన వ్యవహారం. ఈ వార్త బైటికిపొక్కిన మరుక్షణం-

"శవాల కుంభకోణంలో గవర్రాజు" అంటూ పేపర్లు పెద్దపెట్టున ఘోషిస్తాయి. ఏకుంభకోణంలోఇరుక్కున్నా రాజకీయాల్లో పదికాలాలపాటు బతికిబట్టకట్టవచ్చు. కాని శవాల కుంభకోణంలో, అందులోనూ పేదవాడి శవంతో ఆటలుకాదు.

ఈ నిజం బైటపడిన మర్నాడు - ప్రజావాహినిలో ఈ గవర్రాజు పలచబడతాడు. రాజకీయంగా తనప్రత్యర్థికి ఇది అనుకూలిస్తుంది. గవర్రాజు ఆలోచనల్ని కట్టిపెట్టి రాఘవవైపు చూస్తూ సీరియస్‌గా అన్నాడు—

"ఏ.ఎస్.పిగారూ....పోస్టుమార్టం... కేసు రిజిస్ట్రేషన్....ఇవన్నీ మీరు మర్చిపోవాలి"

"గవర్రాజుగారూ... మీరేనా ఆ మాటలు అంటున్నది? ప్రభుత్వంలో ఒక బాధ్యతగలపదవిలో వున్న మీరు ఇలా మాట్లాడటం....?"

"అవును... ఇది నా స్వార్థం. రాజకీయనాయకులకి స్వార్థం వుండటం సహజం ఏ.ఎస్.పి. గారూ! స్వార్థంతో ఏమి ఆలోచించినా, పదికాలాలపాటు పదవిలో వుండి ప్రజలకి నిస్వార్థంగా సేవచేయాలన్నదే నాలక్ష్యం"

"ఇది రాజనీతి అవుతుందంటారా?"

"పదవికోసం నాయకుడు ఏ నీతినిపాటిస్తే అదే రాజనీతి"

"ఈ కేసునిలా మాఫీచేయాలని ప్రయత్నించినందువల్ల మీపేరుప్రతిష్టలు దెబ్బతింటాయేమో?"

"ధాన్ని అధిగమించే వాడేనండీరాజకీయ నాయకుడు"

"రాజకీయనాయకుడైనా మానవత్వం అనేది ఒకటి వుంటుంది గదండీ"

"కరెక్ట్... మానాభిమానాలు తప్ప మిగిలినవన్నీ వుంటాయి. నాకూ వున్నాయి"

"మానవత్వం వున్న మనుషులుగా ఆలోచిద్దాం"

"అలా ఆలోచిస్తే నేనీరోజున ఈ పదవిలో వుండేవాణ్ణికాదేమో!"

పోలీసు ఆఫీసరు తనవైపే మాట్లాడుతున్నాడని సంగీతరావు గ్రహించాడు. అయినా తనకి ఒరిగేదేమీలేదు. తను అక్కడేవుంటే వాళ్ళిద్దరిమధ్యా వాదన పెరుగుతుందని




పించింది. శవాన్ని తీసుకెళ్ళే ప్రయత్నంలో గదివైపు అడుగులువేశాడు. గవర్రాజు, రాఘవ చూస్తుండగానే కొడుకు శవాన్ని భుజాని కెత్తు కున్నాడు. రాఘవ నోరువిప్పాడు. "సంగీత రావ్... నేనిక్కడ వుండగానే ఏమిటా ధైర్యం?"

"ధైర్యమా? హు...పోనీ లెండయ్యా... అంతా అయిపోయినాక అయినా ధైర్యం తెచ్చుకోగలి గానంటే అదేచాలు బాబు... నాకొడుకుని ఎత్తు కెళ్ళనియ్యండి... నన్నెవరూ ఆపొద్దు" అంతటి దైన్యంలో కూడా సంగీతరావు గొంతు దృఢంగా పలికింది.

"అలా కుదరదు సంగీతరావ్... ఆ శవాన్ని అక్కడదించు" ఎ.ఎస్.పి. చాలా మామూ లుగా చెప్పాడు. సంగీతరావుకి చట్టం గురించి చెప్పడం వ్యర్థం అనిపించిందాయనకి.

"లేదుబాబూ.... నెనెవురి మాటా ఇనను" సంగీతరావు ఇలా మొండికెత్తడం ఎ.ఎస్.పి.కి కొంచెం చిరాకు తెప్పించింది.

"చూడు... ఈ శవాన్ని అంతతేలిగ్గా నీకు అప్పగిస్తామని అనుకోవద్దు. దీనిమీద కేసు నడుస్తుంది- ముద్దాయి ఎవరో తేలాలి"

"తేలితే నాకేం ఒరుగుతుంది బాబూ?"

"నీకు జరిగిన అన్యాయానికి న్యాయం చేసినవాళ్ళమవుతాం"

"చచ్చిన నాకొడుకు తిరిగిరాడుగా!"

"నీకొడుకు చావుకి కారణం తెలుస్తుందిగా"

"ఆ కారణం నాకు కూడు బెట్టదు బాబూ!"

"కూడు బెట్టాల్సిన కొడుకు పోయాడన్న బాధ నీచేత అలా మాట్లాడిస్తోంది. నిదానంగా ఆలోచించు. ఈ మునలికాలంలో చేతికి అంది వచ్చిన ఒక్కగానొక్క కొడుకు అర్థాంతరంగా పోయాడు. ఒకరకంగా చంపబడ్డాడు. ఇది కేవలం మీ బలహీనతతప్ప మరేమీకాదు. మీ మంచితనం స్వార్థపరుల కళ్ళకి చేతగానిత నంగా కనిపిస్తుంది. అలాంటప్పుడు ఇలాంటి దారుణాలు ఇంకా పెరుగుతాయేగాని తర గవు... బాగా ఆలోచించి ఒక నిర్ణయానికిరా! ఈ రోజు నీకు జరిగిన అన్యాయం నీకొక్కడికే కాదు, నీజాతి మొత్తానికే జరిగినట్టు లెక్క. ఇవ్వాళ జరిగినదానికి నువు వూరుకుంటే, రేపు మరొకడు బలికాకతప్పదు"

రాఘవ ఇలా సంగీతరావువైపు కొమ్ముకా యడం గవర్రాజుకి మింగుడుపడటంలేదు. "మిస్టర్ రాఘవ... ఇలాంటి సందర్భాల్లో ఏదో ఒక వర్గానికే వత్తాసు పలకడం బాధ్యతగల పోలీసాఫీసరు చేయాల్సినపనేనా?"

"నావిధేమిటో నాకు తెలుసు గవర్రాజుగా రూ... నావిధినిర్వహణకు సంగీతరావు అమా యకత్వం, అజ్ఞానం అడ్డువస్తున్నాయి- అందు కే...."

రాఘవస్థానంలో ప్రభాకర్ వుండివుంటే తన కీ సమయంలో ఎంతగానో ఉపయోగపడి వుండేవాడనిపించింది గవర్రాజుకి. ఇన్నేళ్ళూ తన గుప్పిట్లో మనలిన పోలీసుయంత్రాంగమే ఇవ్వాళ తనకు పచ్చివెలక్కాయ అవుతోంది. దీనికి విరుగుడుకోసం గవర్రాజు ఆలోచనలోప డ్డాడు. ఎ.ఎస్.పి. రాఘవ తన డ్యూటీ మొద లుపెట్టాడు.

"చూడు సంగీతరావు ... నీ కొడుకు గవర్రా జుగారింట్లో ఆత్మహత్య చేసుకున్నాడని మేం కేసురాసుకోబోయేముందు, మాకున్న కొన్ని సందేహాలు నువు తీర్చాలి" అని ఒక్కక్షణం ఆగి ఆ తర్వాత రాఘవ అడగటం మొదలు పెట్టాడు.

"నీ కొడుకు వురేసుకునివుండగా మొట్టమొ దట ఎవరు చూశారు?"

"నేనే బాబూ!"

"ఎన్నింటికి?"

"కోళ్ళు కూసినవేళకి"

"అంటే ఆటైముకి నువ్విక్కడికి వచ్చావా?"

"ఔనయ్యా"

"అంటే నీ కొడుకు ఇక్కడ ఉరేసుకుంటా డని ముందే నీకుతెలుసా?"

"లేదు బాబూ ... నేను ఈరింట్లో పాలేరు పనిసేత్తాను. రోజూ ఆయేళకే పనిలోకొత్తాను"

"నీ కొడుకు నీయజమాని ఇంట్లో ఉరేసు కుని వుంటాడంటే నువ్వు నమ్ముతావా?"

సంగీతరావు అర్థంకానట్టు ముఖంపెట్టాడు.

"అదే రాత్రి పదకొండు పన్నెండు గంటల ప్రాంతంలో ఎవరన్నా ఇతన్నిచంపి ఇక్కడ వేలాడదీసివుండొచ్చుగదా?"

"ఆడికి విరోధులెవరూ లేరండీ"




"నీకుండి వుండొచ్చుగా"

"మా బతుకులే మాకు విరోధం పోలీసుబాబూ"

"రోజూ రాత్రిపూట నీ గుడిసెలోనే పడుకుంటావా?"

"అవును బాబూ"

"మరి నీకొడుకు?"

"ఆడుగూడ ..."

"అయితే కేవలం చనిపోవడంకోసమే ఇతను రాత్రి ఇక్కడికి వచ్చివుంటాడు- అవునా?"

"అనే అనుకుంటానుబాబూ!"

"రాత్రి పడుకోబోయేముందు నీకొడుకు నీతో ఏమన్నా మాట్లాడాడా?"

"మాట్టాడాడు బాబూ"

"ఏం మాట్లాడాడు?"

"నడవలేక చతికిలబడుతున్న మా బతుకుల్ని గురించి మాట్టాడాడు. తన బతుకుగురించి కన్నకలలన్నీ చెదిరిపోతున్నయ్యని చెమ్మగిల్లిన కళ్లతో చెప్పాడుబాబూ"

ఎ.యస్.పి. రాఘవ ఇదంతా రికార్డుచేసుకుంటున్నాడు. వారవాకిలిగా వేసివున్న తలుపు ఒక్క ఉదుటున తెరచుకోవటంతో గవర్రాజు దృష్టి అటుమళ్లింది.

తలుపులు తోసుకుంటూ ఉరుకులు పరుగులతో త్రివిక్రమరావు లోనికి దూసుకొచ్చాడు. గవర్రాజు గుండె ఆగినంతపనైంది.

త్రివిక్రమరావు ముగ్గుర్నీ ఓసారి కలయజూశాడు. శవంచుట్టూ తిరిగాడు. అతని పంట పండింది. సువర్ణావకాశాన్ని చాలా జాగ్రత్తగా సద్వినియోగం చేసుకోవాలనుకున్నాడు. అందుకే గొంతు చించుకుని అరవసాగాడు.

"అవ్వవ్వ... అన్యాయం, అక్రమం! భరత మాత కడుపుపంట ఇలామంత్రి చేతుల్లో బలికావడం దారుణం. వెనుకబడిన తరగతికి చెందిన విద్యావంతుడైన నిరుద్యోగ యువకుడు ఓ ప్రజాప్రతినిధి ఇంట్లో వురివేసుకోవడమా! ఇంతకన్నా ఘోరం మరేమన్నా వుంటుందా?" త్రివిక్రమరావు హాలంతా కలియతిరుగుతూ అరుస్తున్నాడు.

గవర్రాజు అతన్ని నిశితంగా పరిశీలిస్తున్నాడు. పరిస్థితి తనకి అనుకూలంగా మలుచుకుని లాభం పొందేందుకే త్రివిక్రమరావు ఇలా మొసలికన్నీళ్లు కారుస్తున్నాడని గవర్రాజు అనుకున్నాడు.

త్రివిక్రమరావు శవంచుట్టూ తిరుగుతూ నినాదాలు చేస్తున్నాడు.

'వెనుకబడిన తరగతులపై అత్యాచారాలు నశించాలి! వెనుకబడిన తరగతులపై అక్రమాలకు పాల్పడిన మంత్రి గవర్రాజు నశించాలి! వెనుకబడిన వర్గాల నాయకుడు త్రివిక్రమరావు వర్ధిల్లాలి!' అంటూ పిడికిళ్లు బిగించి మరీ అరుస్తున్నాడు.

ఎ.యస్.పి. రాఘవ ఇదంతా గమనిస్తూ నిలబడ్డాడు. ఈ సంఘటన రాజకీయవూబిలోకి లాగబడుతోందని ఇప్పుడిప్పుడే అనిపిస్తోందతనికి.

గవర్రాజు ప్రాణాలు ఇవ్వాళ్టితో పూర్తిగా తన గుప్పిట్లోకి వచ్చాయని త్రివిక్రమరావు లోలోన ఎంతగానో సంబరపడుతున్నాడు. ఇంతటితో గవర్రాజు రాజకీయభోగలాలసత్వానికి ఫుల్ స్టాఫ్‌పెట్టాలని ఆయన కోరిక. ఆ కోరికే అతన్ని ఓ పట్టాన నిలవనీయడంలేదు. భుజంమీదవున్న కండువా సవరించుకుంటూ తన పంథాలో తాను మాట్లాడేస్తున్నాడు.

"ఏరీ... ప్రెస్ రిపోర్టర్లు ఎక్కడ? ఫొటోగ్రాఫర్లు రారేం! రేపు ఈవార్త ప్రముఖ దినపత్రికలన్నిట్లో మొదటిపేజీలో బాక్సుకట్టిమరీ వేయాల్సిన అవసరంవుంది. పేదలకి, ముఖ్యంగా మైనారిటీవర్గాలకి జరుగుతున్న అన్యాయాలు అందరికీ తెలియాలి"

త్రివిక్రమరావుకి అడ్డూఅదుపూలేకుండాపోతోందనిపించింది గవర్రాజుకి.

"త్రివిక్రమరావు... పిచ్చి పిచ్చిగా వాగకు!" అరిచినట్లే అన్నాడు.

ఈ మాటలకు త్రివిక్రమరావు పెద్దగా నవ్వాడు. ఆతర్వాత నిదానంగా అన్నాడు-

"పిచ్చిపిచ్చిగావాగి, రసాభాస చేసుకునేంతటి వెర్రివాణ్ణికాదు గవర్రాజు!"

"ఏం చేస్తావ్?"

ఎ.యస్.పి. రాఘవ కలగజేసుకోకతప్పలేదు. ఈ దారుణాన్ని రాజకీయ ప్రయోజనాల దృష్టితో చూడవద్దన్నాడు. త్రివిక్రమరావు

ఆయనమీద కూడా ధ్వజమెత్తాడు.

"అన్యాయాన్ని వెలికితీయాలని ప్రయత్నించడం రాజకీయ ప్రయోజనం కోసమని అంటున్న మిమ్మల్ని మీ కర్తవ్యనిర్వహణనీ శంకించాల్సి వస్తుంది పోలీసాఫీసరుగారూ"

తన ఉద్దేశం అదికాదని వివరించబోయాడు రాఘవ.

"అవున్లే... నిన్నమొన్న వచ్చిన మీకేంతెలుస్తుంది. లోకంలో ఎక్కడ, ఎవరికి ఎప్పుడు అన్యాయం జరిగినా, అది తెలిసినవెంటనే ఇలా రెక్కలుకట్టుకుని వాలడం నానైజం. అన్యాయాన్ని తుదముట్టించడం నాలక్ష్యం" త్రివిక్రమరావు చెప్పుకుపోతున్నాడు.

క్షణం గడుస్తున్నకొద్దీ కేసు మరింత జటిలం అవుతున్నట్టు రాఘవ గ్రహించాడు. రాజకీయపరంగా వ్యక్తిగత ప్రయోజనాల తాలూకు స్వార్థం నివురుగప్పిన నిప్పులా బయట పడుతోంది. వీరిలో ఒకరు ప్రజాపాలకుడు. మరొకరు రాజకీయ అవకాశవాది. వీరిమధ్య తను ఇరుక్కుపోబోతున్నట్లున్నాడు.

ఇంతవరకు ఈ కేసులో తానుకనిపెట్టలేని అంశం ఒకటివుంది. ఇది ఆత్మహత్యా లేక ఎవరైనా హత్యచేసి ఇక్కడ వేలాడదీశారా అనేది మిస్టరీగానే ఉంది.

రత్నరాజు ఆత్మహత్య చేసుకోవాలనుకుంటే వాడిఇంట్లోనే చనిపోయివుండేవాడని, పనిగట్టుకుని ఇక్కడికివచ్చి ఉరేసుకోవాల్సిన అవసరంలేదని త్రివిక్రమరావు కొత్తవాదన లేవదీశాడు. సమస్యని అటూ ఇటూ తిప్పి చివరికి గవర్రాజుతో ముడిపెట్టడమే అతని ఏకైకలక్ష్యం. రాఘవ ఆలోచనలోపడ్డాడు. త్రివిక్రమరావు ఇదే అదనుగా మళ్లీ తన వాగ్బాణాల్ని సంధించసాగాడు.

"ఇతన్ని గవర్రాజేచంపాడు. అనుమానంరాకుండా ఫానుకి వేలాడదీశాడు. తర్వాతి పరిణామాల్నిగురించి ఆలోచించకుండా ఆత్రంలో చేసి ఇలా దొరికిపోయాడు"

గవర్రాజు కోపంతో కళ్లెర్రజేశాడు.

త్రివిక్రమరావు చెప్పింది సబబుగా తోచలేదు రాఘవకి. గవర్రాజేగనక ఈ పనిచేసివుంటే శవాన్ని తన ఇంట్లో ఎందుకు వుంచుకుంటాడు? తనమీద అనుమానంరాకుండా వేరే ఎక్కడన్నా వుంచేవాడు. ఎన్నిరకాలుగా ఆలోచించినా ఇది ఆత్మహత్యగానే రాఘవ భావించసాగాడు. అయితే గవర్రాజు ఇంట్లో ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం రత్నరాజుకేమిటని త్రివిక్రమరావు ధర్మసందేహం లేవనెత్తాడు.

"అదే తేలాల్సివుంది త్రివిక్రమరావుగారూ! అంతేగాదు మనం కనుక్కోవాల్సింది ఇంకోటి కూడా వుంది. అసలీ ఆత్మహత్య ఎందుకు చేసుకోవాల్సివచ్చిందో కూడా విచారించాలి"

రాఘవ మాటలకు త్రివిక్రమరావు అడ్డుతగిలాడు "అసలు ఆత్మహత్య చేసుకోవాలని ఎవరికైనాసరే ఎందుకు అనిపిస్తుంది? ఇదుగో... ఇక్కడినుంచే విషయసేకరణ జరగాలి"

అప్పుడు గవర్రాజు అందుకున్నాడు. ఎలా వీలైతే అలా తననితాను డిఫెండ్ చేసుకోవాలని ఆయన తాపత్రయం.

"ఎందుకు అనిపించేదేమిటి- ఆత్మహత్యకి ప్రేరణ ఆలోచన. ఆలోచన మానసికం. అన్నివిధాలా తాము అసమర్థులమని తోచినప్పుడు ఒకానొక అవ్యక్తస్థితిలో భావోద్రేకాన్ని తట్టుకోలేక ఆత్మహత్య చేసుకోవాలనుకుంటారు"

"ఇతనికి ఆత్మహత్యా పరిజ్ఞానం ఎక్కువగా వుందిగాబట్టి ఈ ఆత్మహత్యకీ, ఇతనికీ దగ్గర సంబంధం వుండివుంటుంది పోలీసాఫీసరుగారూ!" త్రివిక్రమరావు తన సమయస్ఫూర్తికి తానే లోలోన సంబరపడుతూ అనేశాడు.

'ప్రతిపక్షం బుద్ధులు పోనిచ్చుకున్నావ్‌గాదు" అంటూ గవర్రాజు దెప్పిపొడిచాడు.

"ఏ సమస్యనైనా మరణం ఒక్కటే పరిష్కరించగలదన్న అవివేకపు అవగాహనే ఆత్మహత్యకి మూలకారణమని లార్డ్‌మెకాలె ఒక థీసిస్‌లో రాశాడు. ఇతను ఆత్మహత్య చేసుకోవడానికి కారణమైన ఆ సమస్య ఏమిటో తేల్చుకోవాలి" అన్నాడు త్రివిక్రమరావు.

ఎఎస్‌పి రాఘవ కలగజేసుకున్నాడు.

"ఏదైనాకావచ్చు. అది అతని ఆర్థిక, మానసిక స్థితిగతులమీద, అతని విద్యాపరిపక్వత మీద ఆధారపడివుంటుంది" అన్నాడు. మళ్ళీ కొంచెంసేపు ఆలోచించి ఆయనే అన్నాడు. "ఇతను విద్యావంతుడు. నిరుద్యోగి. ఉద్యోగం లేనందువల్ల నిరాశతో ఆత్మహత్య చేసుకుని




వుండొచ్చు.

అందుకు త్రివిక్రమ రావు కస్సుమన్నాడు.

"నో.నేనొప్పుకోను. అధికారపార్టీతో పోలీసువ్య వస్థ లాలూచీ పడుతోంది. నాలుగుగోడలమధ్య ప్రజాస్వామ్యం ఎలా వామనావతారం దాల్చు తోందో నా ప్రజలకి వివరిస్తాను."

రాఘవకి చిరాకేసింది. అయినా అదేమీ బయటపడనీయకుండా సౌమ్యంగా మాట్లాడా డు. "చూడండి. త్రివిక్రమరావుగారూ! ఈ సంఘటనతో మీరు వీరు కొట్టుకుంటూ మధ్యలో నన్ను మాత్రం రచ్చకీడ్చకండి ప్లీజ్".

త్రివిక్రమరావు తన వాదాన్ని విడనాడ కుండా, "ఈ విషయం నేనొప్పుకోను. కేవలం ఉద్యోగం లేనందువల్లే ఆత్మహత్యలు జర గడం అయితే ప్రస్తుతం ప్రపంచం మొ త్తంమీద అతి తక్కువ జనాభావున్న దేశం మనదే కావాలి. కాని అలాలేదే." అంటూ దీర్ఘం తీశాడు. ఆ అభిప్రాయాన్ని రాఘవ ఖండించాడు.

"అంత తేలిగ్గా తీసి పారెయ్యకండి. ప్ర స్తుతం జరుగుతున్న ఆత్మహత్యల్లో వీటి శా తమే ఎక్కువగా వుందని బ్యూరో ఆఫ్ పోలీస్ రీసెర్చి అండ్ డెవలప్మెంట్వారి గణాంక వివరాలు తెలియజేస్తున్నాయి."

రత్నరాజు ఆత్మహత్యేనని ధృవీక రించడం ఎలాగంటూ త్రివిక్రమరావు మళ్ళీ సందేహం వెలిబుచ్చాడు. "సాధారణంగా ఆత్మహత్యల కేసుల్ని పరిశీలించినప్పుడు వారు ఎవరి కారణంగానైనా ఆత్మహత్యకి పాల్ప డ్డారా? లేక తమంతతాముగానే చేసుకున్నారా అనే విషయాన్ని చనిపోయేముందు వాళ్ళు రాసిపెట్టే వివరణపత్రాలు లేదా ధృవీకరణప త్రాల ద్వారా నిర్ణయిస్తాం" అని రాఘవ చెప్పా డు.

ఆయన నోటినుంచి ఈ మాటలు వెలువడ్డా యోలేదో మరుక్షణమే త్రివిక్రమరావు, శవంద గ్గరికి పరుగెత్తాడు.

రాఘవ ఆయన ఆరాటం అర్థంచేసుకున్నా డు. అందుకే ఆయన్ని అడ్డగించి, తనేవెళ్ళి శవం జేబులు వెదికాడు. కొన్ని కాగితాలు దొరికాయి.

రాఘవ ముఖం ఆనందంతో విప్పారింది.

ఈ కాగితాల్లో ఏ కొంచెం క్లూ దొరికినా తన పని సులువు అవుతుందనుకున్నాడు.

గవర్రాజు తన కుటుంబంమీద పగవట్టాడని రత్నరాజు ఆ కాగితాల్లో రాశాడు. తన రాజకీయ అస్థిత్వం కోసం లంచం ఎరచూపి, చివరికి తమకుటుంబాన్నే కబళించాలని గవర్రాజు చూస్తున్నాడని రత్నరాజు స్వదస్తూరీతో రాశాడు. పాలేరు కొడుకు పాలేరుగానే బతకాలన్నది గవర్రాజు సిద్ధాంతమని రాశాడు. తరాలుగా కొనసాగుతూ వస్తున్న బాకీకింద తనను కూడా బానిసగా వుంచుకోవాలన్న కోరిక నెరవేరలేకపోవడంతో గవర్రాజు ప్రతి చిన్నవిషయానికీ కక్షసాధింపు మొదలుపెట్టాడని ఆ పత్రాల్లో రాసివుంది. ఆయన బారినుంచి తన కుటుంబాన్ని కాపాడులేక, వేరే పరిష్కారం లేక తాను ఆత్మహత్యకి పాల్పడుతున్నానని, ఇది గవర్రాజుకి చెంపపెట్టు కావాలన్న వుద్దేశంతో ఆయన ఇంట్లోనే ఉరివేసుకుంటున్నానని రత్నరాజు వివరించాడు. తన ఈ ఆకస్మిక చావుకి గవర్రాజే బాధ్యుడని ఆ వుత్తరాల్లో ఒకటికి నాలుగుసార్లు రాశాడు.

త్రివిక్రమరావు ఎగిరి గంతేశాడు.

వీళ్ళంతా రాకముందే శవం జేబులు వెతకాలన్న ఆలోచన తనకు రానందుకు గవర్రాజు తనని తానే తిట్టుకున్నాడు లోలోన.

పదినిముషాల్లో ఎఫ్.ఐ.ఆర్. తయారైంది.

ఇక ఆలస్యం చేయడం మంచిదిగాదనిపించింది గవర్రాజుకి.

"మిస్టర్ ఎ.ఎస్.పి. మీరేం చేస్తున్నారో ఒక్కసారి ఆలోచించండి. నేనెవరినో కూడా ఓసారి గుర్తుకుతెచ్చుకోండి."

"అంటే బెదిరిస్తున్నారా?"

"లేదు హెచ్చరిస్తున్నాను."

"చట్టాన్ని మీ చేతుల్లోకి తీసుకోవాలని ప్రయత్నిస్తున్నారు మీరు."

"చట్టాల్ని తిరగరాయగలిగిన వాళ్ళం మేం."

"నాకు విధి నిర్వహణే ముఖ్యం. ఎన్ని అడ్డంకులనైనా ఎదుర్కొంటాను. ఎ.ఎస్.పి రాఘవ ఇంత గట్టిగా నిలబడతాడని త్రివిక్రమరావు అనుకోలేదు. అందుకే ఆయన మనసెంతో తేలికపడింది.

గవర్రాజు మాత్రం ఇరకాటంలో పడ్డాడు. రాఘవ ఇంతటి గడుసుపిండం అని ఆయన వూహించలేదు. ఆయన మనస్సు చాలా వేగంగా పనిచేస్తోంది!

కేసు రిజిస్టర్ అవుతుంది! కోర్టు కెళుతుంది... విచారణ... ఈలోగా తన పరువు, పదవి... అన్నీ గంగలో కలిసిపోతాయి. కేసులు, కోర్టులు రాజకీయనాయకుల పతనానికి సోపానాలు. ఒక్కసారి కేసంటూ, కుంభకోణంలో ఇరుక్కొని కోర్టుకి లాగబడ్డ ఏ ఒక్క నాయకుడూ రాజకీయాల్లో పదికాలాలపాటు నిలబడలేదు.

గవర్రాజు మనస్సంతా భయం ఆవరించివుంది. ఈ వ్యవహారం కోర్టుకి వెళ్ళడానికి వీల్లేదని అతని అంతరాత్మ పదే పదే హెచ్చరిస్తోంది. ఈ మచ్చ తన జీవితంమీద శాశ్వత ముద్రగా మిగిలిపోయిందన్న చేదు నిజం ఆయన్ని కలచివేస్తోంది.

పెళ్ళాం పోయినా ఫర్వాలేదు. పదవి మాత్రం పోకూడదు. పదవివుంటే చాలు పరువుదానంతట అదే వస్తుంది.

ఈ సృష్టిలో సకలచరాచర జీవకోటిని నడిపించే ఒకే ఒక ఇంధనం డబ్బు! పదవిలోఉన్న ప్రతిక్షణం కొన్ని లక్షలరూపాయల విలువ చేస్తుంది ఆ లక్షలు కొన్ని మనవికావనుకుంటే పదవి మిగులుతుంది పరువూ దక్కుతుంది. గవర్రాజు ఆలోచనలు ఇప్పటికి ఒక కొలిక్కివచ్చాయి.

రెండు నిమిషాలు మౌనంగా అటూఇటూ తిరిగాడు. అతనివైఖరి త్రివిక్రమరావుకి అర్థంకాకుండా వుంది. గవర్రాజు వైపు అలానే చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో గవర్రాజు తన దగ్గరికివచ్చి తన భుజంమీద చెయ్యివేసేసరికి త్రివిక్రమరావు విస్తుపోయాడు. ఈ హఠాత్పరిణామం ఆయన వూహించనిది. అందుకే వెంటనే ఎలాంటి ప్రతిస్పందన రాలేదు. తను చూస్తుండగానే గవర్రాజు తనని మేడమెట్లు ఎక్కించి పైకితీసుకెళ్ళాడు. అచేతనమైన బొమ్మమాదిరిగా త్రివిక్రమరావు గవర్రాజుని అనుసరించాడు. ఇద్దరూ పైకివెళ్ళాక గవర్రాజు గది తలుపులు మూసేశాడు.

గవర్రాజుకి ఈ క్షణాలు ఎంతో విలువైనది




ఒక్కక్షణం కూడా వృధా చేయదలుచుకోలేదు. అందుకే సూటిగా సంభాషణ ప్రారంభించాడు.

"త్రివిక్రమరావ్! సుదీర్ఘమైన నీరాజకీయ జీవితపు వయస్సెంతో చెప్పగలవా?" గవ రాజు ట్రాప్ బిగిస్తున్నాడు.

"పాతికేళ్ళు" గవరాజు బిగిస్తున్న ట్రాప్ సంగతి త్రివిక్రమరావుకి తెలుసు. కాని మెడకి చుట్టుకునే పాముని పూలమాలగా మలచుకునే నేర్పు అతనికివుంది.

తామిద్దరి రాజకీయ జీవితాలతో ముడిపెట్టి మాట్లాడుతున్నాడు గవరాజు.

"నా స్వల్ప రాజకీయ జీవిత చరిత్రలో నేనెలా అంచెలంచెలుగా అధికారపీఠాన్ని అధిగమిస్తూ వచ్చానో చూశావుగదూ?"

"అవును. కళ్ళారాచూస్తూనే వున్నాను. గెలిచినమరునాటి నుంచి ఒక్కరోజు కూడా పదవిలో లేకుండా లేవు గదా!"

"అవునా? మరి నీపాతికేళ్ళ రాజకీయ జీవితమంతా ప్రతిపక్షంలోనే గడిచిపోయింది."

"అవును. అందుకే నేను ప్రజలకేమీ సేవ చేయలేకపోతున్నాను. అప్పుడప్పుడు ఇదే నన్ను బాధిస్తూ వుంటుంది."

"నేను అవకాశం కల్పిస్తాను. సేవ చేసుకోగలవా?"

త్రివిక్రమరావు ఆలోచనలోపడ్డాడు. ఎన్నేళ్ళు చూసినా స్థానిక రాజకీయాలతో కొట్టుకోవడంతోనే సరిపోతున్నది. ఎదుగూబొదుగూ లేని జీవితం అయిపోయింది. అధికారపీఠానికి ఎగబాకడంలో గవరాజుకి తనేమాత్రం సాటిరాడు. వచ్చిన అవకాశాన్ని తెలివిగా వినియోగించుకున్నప్పుడే జీవితం పూలబాట అవుతుంది. ఆలోచనలకు కళ్ళెంవేశాడు. గవరాజు అతని సమాధానంకోసం ఎదురు చూస్తున్నాడు.

"ప్రతిపక్షాన్ని నమ్ముకుని కూర్చుంటే ఇన్నేళ్ళూ నీకేమి ఒరిగింది. నువ్వు ఊఁ అను. నీకు కోరిన పదవి ఇప్పిస్తా" గవరాజు ఆశపెట్టాడు.

త్రివిక్రమరావు నుంచి ఠక్కున సమాధానమొచ్చింది. "మహాప్రసాదం" అన్నాడు.

"దిగులుపడకు... నీకు త్వరలో పదవీ యోగం ఖాయం... సరేనా?"

త్రివిక్రమరావు ఉబ్బితబ్బిబ్బు అయ్యాడు.

"నిజంగానా?"

"నిజంగానే" గవరాజు నిజంగానే హామీ ఇచ్చాడు.

"అయితే ఇక ఇక్కడినుంచి నేను నా ప్రజలకి ఇంకా బాగా సేవ చేసుకోవచ్చన్న మాట"

"అవును... ప్రజాసేవకి ముఖ్యం పదవి అన్నసంగతి ఇన్నేళ్ళకు గ్రహించావన్నమాట. భలేవాడివోయ్" అంటూ గవరాజు తేలిగ్గా నవ్వేశాడు.

త్రివిక్రమరావుకి మరో ఆలోచన తట్టింది. దీపం వుండగానే ఇల్లు చక్కదిద్దుకోవాలన్న సామెత అక్షరాలా నిజమనిపించింది. గవరాజు ఇప్పుడు తన చేతికిచిక్కాడు. ఈ అవకాశం మరెప్పుడూ రాదు. అయితే ఎలా అడగాలా అని ఆలోచనలోపడ్డాడు.

గవరాజు అతన్నే నిశితంగా పరిశీలిస్తున్నాడు. త్రివిక్రమరావు అవస్థ అతనికి అర్థమైపోయింది. పాపం అడగలేక ఇబ్బందిపడుతున్నాడని గ్రహించాడు. వెంటనే బీరువాలోనుంచి నోట్లకట్టలు తీసి డ్రాయర్‌మీద పడేశాడు.

"త్రివిక్రమరావు... ఇవిగో తీసుకో... ఒకటా... రెండా... నీకెంతకావాలో తీసుకో!"

"లక్షలే!" డబ్బువైపు ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు త్రివిక్రమరావు.

"అక్షరాలా" చాలా కూల్‌గా చెప్పాడు గవరాజు.

త్రివిక్రమరావు ఆ డబ్బుతో తృప్తిపడ్డాడని గవరాజు గ్రహించాడు. ఇప్పుడు అతని మనస్సు చాలా తేలికపడింది. ముఖ్యమైన రాజకీయప్రత్యర్థి నోరు నొక్కేశాడు. ఇక మిగిలింది ఒక సాదాసీదా పోలీసు అధికారి.

దాదాపు పావుగంట తర్వాత గవరాజు కిందికిదిగొచ్చాడు. ఎ.యస్.పి. రాఘవని పైకి పిలుచుకువెళ్లాడు. గదిలో సోఫాలో త్రివిక్రమరావు తాపీగా కూర్చుని వున్నాడు. డ్రాయర్ మీద నోట్ల కట్టలు కనిపిస్తున్నాయి. గవరాజు రెండు చేతులతో వాటిని తీస్తూ- "ఇదిగో మిస్టర్... ఇందులో నీకెంతకావాలో చెప్పు" అన్నాడు గవరాజు.

ఎ.యస్.పి. రాఘవకి ఇదంతా అయోమయంగావుంది.

"ఏమిటిది?" ఆశ్చర్యంతో అప్రయత్నంగా నేశాడు.

"లక్ష్మి... నీ జాతకచక్రాన్ని మలుపు తిప్పగల ఇంధనం"

రాఘవ ఇంకా ఆశ్చర్యం నుంచి కోలుకోలేదు.

"వ్వాట్ మిస్టర్ ఎయస్పి... ఏమిటి చూస్తున్నావ్? ఏం- ఇది చాలదా?" ధన బలం గవర్రాజు గొంతులో స్పష్టంగా ధ్వనిస్తోంది.

"క్షమించండి- నాకిలాంటివి ఇష్టంలేదు, అలవాటూలేదు"

గవర్రాజు తేలిగ్గా నవ్వేశాడు- "పిచ్చివాడా... ఇలాంటి సువర్ణావకాశాలు జీవితంలో అందరికీ ఎప్పుడూరావు. ఇష్టాఇష్టాల్నీ అలవాట్లనీ సందర్భోచితంగా మార్చుకుంటూ పరిస్థితుల్ని తమకి అనుగుణంగా మలచుకోగలగడమే అదృష్టం"

"ప్రజలకి సేవచేయాల్సిన పోలీసాఫీసర్ని నేను"

వెంటనే త్రివిక్రమరావు అందుకున్నాడు-

"ప్రజలకు సేవచేసేది, చేయాల్సింది మేమయ్యా... మీరు ఆ మాటంటే ఎవ్వరూ నమ్మరు.

"లంచం ఇవ్వడం తీసుకోవడం నేరం" అన్నాడు రాఘవ గవర్రాజు వైపుచూస్తూ.

"దీన్ని లంచం అని ఎందుకంటావ్? అలాగని ఈ పవిత్రకార్యాన్ని ఎందుకు అపవిత్రం చేస్తావ్? ఈ కేసులో నువ్వు చూపిన చొరవకి నాపారితోషికం అనుకో! ఆలోచించు... నెలకొచ్చే నాలుగు జీతంరాళ్ళతో జీవితాంతం గడపడమంటే బోర్గావుండదూ? నీ కొడుకు చదువు, నీ కూతురి పెళ్ళి మున్ముందు నీకు బరువు కావూ? నీ భార్య కోరికలు, నీ సరదాలు- ఇవన్నీ నీ ఒక్క జీతంరాళ్ళతో తీర్చుకోగలవా? ఈ ఒక్కరోజు- ఈ ఒక్కక్షణం నీదికాదనుకో. నిదానించి ఆలోచించుకో... అసలుసిసలైన జీవితం కనిపిస్తుంది."

"లేదు... నా అంతరాత్మ అంగీకరించదు"

"మనస్సు, అంతరాత్మ... ఇవి పిరికివాళ్ళు వాడుకునే నిరర్థకమైన ఆయుధాలు

అంతరాత్మని అడ్డంపెట్టుకుని తప్పటడుగులు వేసి గతంలో తెరమరుగైన ఎందరో మహానాయకుల్ని కళ్లారాచూశాను" హితబోధ చేశాడు.

త్రివిక్రమరావు ఇంతలోనే ప్లేటు ఫిరాయించడం రాఘవకి వింతగా అనిపించింది. బాధ్యతగల రాజకీయనాయకుడేనా ఈయన?

"ఏముందండీ ఇందులో... టేకిట్ఈజీ. సీతాకోకచిలుక జీవితాన్నే చూడండి. సుఖమయ జీవితం కోసం అది ఎన్ని దశలుగా రంగులు మార్చుకుంటుందో! నోరులేని ఆ ప్రాణి పాటైనా మనం తెలివిగా మసులుకోకపోతే మన మానవ జాతిని సీతాకోకచిలుకల జాతి హీనంగా చూస్తుంది. తెలుసా?" త్రివిక్రమరావు ఎంతో ఈజీగా చెప్పాడు.

"మీరు రాజకీయనాయకులు. మీకెలాంటి బాదరబందీలు వుండవు. కాని నా వుద్యోగానికి ఏదన్నా అయితే..." రాఘవ ఒక మెట్టుదిగినట్టే లెక్క.

"నీకా దిగులు అక్కర్లేదు. మేమున్నాం. నీ వుద్యోగం కింద ఇదుగో ఇంకో లక్ష అదనంగా వుంచుకో. ఇకనుంచీ నీఉద్యోగం బాధ్యత నాకు వదిలెయ్- సరేనా?" రాఘవ భుజంమీద చెయ్యివేసి భరోసాగా చెప్పాడు గవర్రాజు.

రాఘవ ఒక్కొక్క మెట్టే దిగివచ్చాడు. తన అంతరాత్మకి అనేకరకాలుగా సర్దిచెప్పుకున్నాడు. అవినీతి, అన్యాయాలను సమర్థిస్తున్నందుకు తానేమీ సిగ్గుపడాల్సిన పనిలేదని నిర్ధారించుకున్నాడు. సిగ్గంటూపడితే అవకాశవాదానికి పునాదులు వేసిన వ్యవస్థే సిగ్గుపడాలని సరిపెట్టుకున్నాడు.

త్రివిక్రమరావులాంటి సంకుచిత మనస్కులవల్లే వ్యవస్థ దుర్బలమైపోతోందని ఇంతకు ముందు వరకు రాఘవ అనుకున్నాడు. కాని ఒకళ్ళిద్దరివల్ల దుర్బలమయ్యేది అసలు వ్యవస్థకాదని ఇపుడనుకుంటున్నాడు. సమాజంలో వుండే ఒకరిద్దరు దుర్బలమనస్కుల్ని సుశిక్షితం చేయగలిగేది వ్యవస్థ. అది బలంగా వున్నప్పుడే న్యాయమైనా, ధర్మమైనా నాలుగు పాదాలా నడిచేది.

త్రివిక్రమరావు చెప్పింది వేదంకన్నా మిన్న అనిపించింది రాఘవకి. సీతాకోకచిలుకల నుంచి, ఊసరవెల్లులనుంచి నేర్చుకోవలసింది చాలా వుందనిపించింది. గత చరిత్రని




క్షుణ్ణంగా పరిశీలించిన ఏ వ్యక్తి అయినా తన చర్యనే సమర్థిస్తారని రాఘవ గర్వపడ్డాడు.

గవర్రాజు శాసనకర్త. ఏక్షణంలో ఏశాసనాన్ని ఎలాగైనా మార్చగల అధికారం ప్రజలు ఆయనకు ఇచ్చారు. త్రివిక్రమరావు పక్కా అవకాశవాది. ప్రజల కష్టకాలాల్లో మాత్రం ప్రతిపక్షంలో వుండి తన అవకాశాన్ని బట్టి అధికారపార్టీత చేతులు కలిపి, అదృష్టం కోసం అర్రులు చాస్తాడు. వీరిద్దరిమధ్యా ఎటొచ్చీ నలిగేది తానే. చివరికి ఈ కేసు విషయంలో వీళ్ళిద్దరికీ తను, తన పోలీసు వ్యవస్థ లోకువ అవుతారు. ఈ దూరదృష్టితోనే తాను రాజీపడినట్లు మనస్సుకి నచ్చచెప్పుకున్నాడు. తాను చేసింది న్యాయమేనని తీర్మానించుకున్నాడు.

లక్షలాది ప్రజలకు ప్రతినిధి అయిన గవర్రాజుగారి సేవలను ప్రజలు పదికాలాలపాటు సద్వినియోగం చేసుకునేందుకు వీలుగా ఆయన్ని ఈ గండం నుంచి గట్టెక్కించడం తన కర్తవ్యంగా భావించాడు రాఘవ. ఇప్పుడు అతని మనస్సు ఎంతో తేలికపడింది.

ముగ్గురూ మేడమీదనుంచి కిందికి దిగొచ్చారు. సంగీతరావు కొడుకు శవం దగ్గర కూలబడిపోయిఉన్నాడు.

గవర్రాజులో ఇప్పుడు ఎలాంటి ఆందోళన లేదు. త్రివిక్రమరావులో ఇదివరకటి ఉత్సాహంలేదు. ఎ.ఎస్.పి. రాఘవ సంగీతరావుని సమీపించాడు. అతని భుజంమీద చెయ్యేసి, "నిన్ను చూస్తుంటే జాలివేస్తోంది. అందుకే కేసు, కోర్టులంటూ నిన్ను ఇబ్బంది పెట్టాలనిపించటంలేదు. శవపరీక్షకి పంపితే నీ కొడుకు శవాన్ని ముక్కలుముక్కలుగా కోస్తారు. అది చూసి నీ గుండె చెరువు అవుతుంది. ఈ వయస్సులో నిన్ను అంతగా బాధపెట్టాలని నాకులేదు. అందుకే నేనొక నిర్ణయానికి వచ్చాను"

నిర్జీవమైన కళ్ళతో సంగీతరావు రాఘవవైపు తలెత్తి చూశాడు.

"కేసుగీసు ఏమీవద్దు. నీ కొడుకు శవాన్ని తీసుకెళ్ళిపో"

సంగీతరావు ఈ మాటలు నమ్మలేకపోయాడు. ఇందాకటిదాకా ముగ్గురూ వాదులాడుకున్నారు. సమస్య ఇంత తొందరగా కొలిక్కి వస్తుందని అతనూహించలేదు. సంగీతరావు నీరసంగా లేచాడు.

"పోనీలెండయ్యా... ఇప్పటికైనా తేల్చారు" అంటూ కొడుకు శవాన్ని భుజానికి ఎత్తుకున్నాడు.

త్రివిక్రమరావు అడిగాడు– "ఇంతకీ వాడు ఎలా చనిపోయాడని చెబుతావ్ జనానికి?" సంగీతరావు అయోమయంగా చూశాడు "గుండె ఆగి చచ్చాడని చెప్పు– సరేనా?" సలహా కూడా త్రివిక్రమరావే ఇచ్చాడు.

"అవునండయ్యా... గుండె ఆగి చచ్చాడు..." చిప్పిల్లిన కళ్ళతో సంగీతరావు లోలోన గొణుక్కుంటూ భారంగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాక ఎప్పటినుంచో మనస్సులో వున్న సందేహాన్ని గవర్రాజు త్రివిక్రమరావు, రాఘవముందు పెట్టాడు. రత్నరాజు తన ఇంట్లో వురేసుకుని చచ్చిపోయాడన్న సంగతి త్రివిక్రమరావుకి, రాఘవకి తెల్లారేసరికి ఎలా తెలిసిందో గవర్రాజు ఎంతసేపు ఆలోచించినా క్లూదొరకలేదు. ఇక ఉండబట్టలేక ఆసంగతే అడిగాడు ఇద్దర్నీ.

తనకి ఎవరో ఫోన్ చేసి ఈ విషయం చెప్పారని త్రివిక్రమరావు సమాధానమిచ్చాడు. తనకీ ఫోన్ద్వారానే తెలిసిందని రాఘవచెప్పాడు.

ఇంతకీ ఆ ఫోన్ చేసిన వ్యక్తి ఎవరు? గవర్రాజుని వేధిస్తున్న ప్రశ్న ఇదే. తాను విన్నది ఆడగొంతు అని మాత్రం త్రివిక్రమరావు చెప్పాడు. రాఘవ కూడా అదేమాట చెప్పాడు. అంటే ఇద్దరికీ ఒకరే చేశారన్నమాట. ఎవరామె? త్రివిక్రమరావుకిగానీ, రాఘవకిగానీ ఆ గొంతుతో గతంలో ఎప్పుడూ పరిచయంలేదు.

చూస్తుండగానే రోజులు, నెలలు గడిచిపోతున్నాయి. వీరభద్రం కాంట్రాక్టు తీసుకున్న ప్రాజెక్ట్ వీసమెత్తు కూడా సాగలేదు.

అవతల ప్రభుత్వంనుంచి రోజురోజుకీ వత్తిడి పెరుగుతోంది.

ఒక్క ఏడాదిలోనే అంచనావ్యయం పది శాతం పెరిగిపోయింది.

ఈ తేడా కూడా వీరభద్రంనుంచే రాబట్టా

లని అధికారులు ప్రయత్నిస్తున్నారు.

వీరభద్రం ఎన్నోవందల కాంట్రాక్టులు చేశాడు. ఏ ఒక్కటీ ఇలా ఎదురుతిరగలేదు. గవర్రాజులాంటి వ్యక్తులు ఇంతవరకూ తారసపడకపోవడమే అందుక్కారణమనిపించింది వీరభద్రానికి. అతనికి మనస్సు మనస్సులో లేదు. గవర్రాజు కావాలనే తననిలా ఇబ్బందులు పెడుతున్నాడంటే అతనికి నమ్మశక్యం కావడంలేదు.

ప్రభుత్వంతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం నిధులు విడుదల కాకుండా గవర్రాజు అడ్డుపడుతున్నాడని వీరభద్రం గ్రహించాడు. అందుకు కారణమేమిటో మాత్రం అతనికి అంతుచిక్కలేదు.

ఏమైనా ఇలా కాలయాపన చెయ్యడం శ్రేయస్కరం కాదనిపించింది. ఒకసారి గవర్రాజుతో ముఖాముఖి మాట్లాడి, సమస్యని పరిష్కరించుకోవాలని నిర్ణయించుకున్నాడు. అయిందేదో అయిపోయింది. దీన్నుంచి తెలివిగా బైటపడటమొక్కటే పరిష్కారమార్గమని తీర్మానించుకున్నాక ఓరోజు గవర్రాజు ఇంటికెళ్లాడు.

వీరభద్రం తనని వెదుక్కుంటూ వచ్చినందుకు గవర్రాజు సంతోషం పట్టలేకపోయాడు. కాని అదేమీ బైటికి కనపడకుండా జాగ్రత్త పడ్డాడు.

కాంట్రాక్టు కుదరకముందు వీరభద్రం ఇంట్లో కలిశాక మళ్లీ వాళ్లిద్దరూ ఎదుటపడటం ఇదే మొదటిసారి.

మర్యాదపూర్వక పలకరింపులు అయ్యాక గవర్రాజే మొదటిగా నోరు విప్పాడు.

"చూడు వీరభద్రం... నీది వ్యాపారం. నాది రాజకీయం. అయినా నిత్యం లేచిన దగ్గర్నుంచీ మనిద్దరం ప్రయాణం చేసేది ఒకే పడవ. ఆ సంగతి తెలుసనుకుంటాను?"

గవర్రాజు ముఖంలోకి ఓ నిమిషంపాటు అలాగే చూస్తూ కూర్చున్నాడు వీరభద్రం.

"అర్థంకాలేదా?"

"మనిద్దరం ఒకేపడవలో ప్రయాణం చేస్తున్నవాళ్లమైనప్పుడు నీ మాటలు అర్థం కాకుండా ఎలా వుంటాయ్?"

"ఇదంతా తెలిసేనా నీవ్యాపారనైజాన్ని నాముందు ప్రదర్శించావు?"

వీరభద్రానికి మాటలు పెగల్లేదు.

అతని మనస్సు గతాన్ని గుర్తుకి తెచ్చుకుంటోంది.

"నాతో కూడా నువ్వు వ్యాపారం చేశావు. నాకు తెలీదనుకున్నావ్- అవునా?" గవర్రాజు సూటిగా అడుగుతుంటే వీరభద్రానికి ఏంమాట్లాడాలో తెలీడంలేదు. గవర్రాజు చెప్పినదాన్లో కొంత నిజం లేకపోలేదు.

అయితే మోహిని తనకి అబద్ధం చెప్పిందేమోనన్న అనుమానం వచ్చింది వీరభద్రానికి.

గవర్రాజుకి రెండుసార్లు తాను డబ్బు పంపాడు. మళ్ళీ ఆ మొత్తాన్ని మోహిని సహాయంతో రాబట్టుకోవాలనుకున్నదీ నిజమే. కాని తన వ్యూహం బెడిసికొట్టిందే. గవర్రాజు దగ్గర తన ఆటలు సాగలేదని మోహిని తనని నమ్మించింది. కాని ఇప్పుడు గవర్రాజు మాటలు వింటుంటే ఆ డబ్బు మోహినే కాజేసివుండాలి.

"నీవ్యూహం నా రాజకీయజీవితాన్నే సవాలు చేసింది. నా అహాన్ని దెబ్బతీసింది. నా బలహీనతలు నాకున్నాయి. దాన్నే నువ్వొక సాధనంగా వాడుకున్నావు. దెబ్బకుదెబ్బ తీయడం రాజకీయమైతే నీకు గుణపాఠం చెప్పడం నా జీవితధ్యేయంగా పెట్టుకున్నాను. నీడబ్బు బలంకంటే నా అధికారబలమే గొప్పదని నీకు చెప్పదలుచుకున్నాను. నీకున్న తెలివితో నా దగ్గర్నుంచి డబ్బుని తిరిగి రాబట్టుకోగలిగావు గానీ, ఆ కాంట్రాక్టు పూర్తిచెయ్యి చూద్దాం"

వీరభద్రానికి విషయం పూర్తిగా అర్థమైంది. మరుక్షణమే మోహినిమీద పట్టరానంత కోపం వచ్చింది. తను పెంచిపోషిస్తున్న మోహిని తననిలా మోసగించిందంటే వీరభద్రానికి నమ్మశక్యం కావడంలేదు. అతనికి మరో ఆలోచన కూడా వచ్చింది.

ఒకవేళ గవర్రాజే మోహినిని అడ్డుపెట్టుకుని ఇలా నాటకమాడుతున్నాడా?

ఈ ఆలోచన వీరభద్రంలో కొంత ఆవేశాన్ని తగ్గించింది.

గవర్రాజు గుండెలు తీసినబంటు. కాకలు




చెప్పనే చెప్పింది- గవర్రాజు మీ పథకం కనుక్కున్నాడని. తీరా ఇప్పుడు మోహినిమీద నెట్టేసి చేతులు దులుపుకోవాలని ప్రయత్నిస్తున్నాడనుకున్నాడు వీరభద్రం.

క్షణాలు నిమిషాల్లా దొర్లుతున్నాయి.

రానురాను ఇద్దరిమధ్యా మాటలే కరువవుతున్నాయి.

అందుక్కారణం లేకపోలేదు. వృత్తిరీత్యా ప్రవృత్తిరీత్యా ఇద్దరూఇద్దరే. ఇలాంటిసమయాల్లో ఆవేశకావేషాలు ఫలితమివ్వవని అనుభవం ద్వారా తెలునుకున్నవాళ్లు గనుక ఎవరికివాళ్లు ముక్తసరిగా వున్నారు.

వీరభద్రానికి తెలును- ప్రస్తుతం తన పరిస్థితే బలహీనంగా వుందని.

కాంట్రాక్టు తీసుకున్న నేరానికి పూర్తిచేయాలి.

క్షణం గడిచేకొద్దీ అవతల ఆ కాంట్రాక్టు వ్యయం చుక్కలవైపు వరుసలు పెడుతోంది. అయిందేదో అయిపోయింది. ఇంకా తాత్సారం చేయడం మంచిదిగాదనిపించింది. ఎలాగోలా గవర్రాజుతో రాజీపడి సమస్యని పరిష్కరించుకోవడమే లౌకికం అనిపించుకుంటుంది. ఇప్పటికే తానెంతో నష్టపోయాడు. ఇక నష్టపోవడం తన వ్యాపారానికే కళంకమనిపించింది. ఇలా ఆలోచించాక వీరభద్రం ముఖంలో కొంత ప్రశాంతత కనిపించింది.

తను వూహించినట్టుగానే గవర్రాజు పాతబకాయిలకోసం పట్టుబట్టాడు. వీరభద్రం మాత్రం పంతం పట్టదలుచుకోలేదు. ఎటొచ్చీ అంతకు రెండింతలు ఎలా రాబట్టాలన్నదే అతనికి ముఖ్యం.

గవర్రాజుతో విభేదాలు పరిష్కారమయ్యాయి. నీరసంగా ఇంటికి చేరుకున్నాడు వీరభద్రం.

ప్రభుత్వంలో తనవాళ్లంటూ ఒక స్వంతమనిషి వుండటం ఎంత అవసరమో వీరభద్రానికి మొదటిసారి అనుభవమైంది. తనకి తెలీకుండానే గవర్రాజు చేతికి తాను చిక్కిపోయానన్న బాధ వీరభద్రాన్ని కలచివేసింది.

ప్రభుత్వంలో నా మనిషంటూ వుంటే ఇవాళ్టి రోజున ఇంతగా బాధపడి వుండేవాణ్నా? అని వీరభద్రం ఎన్నోసార్లు మథనపడ్డాడు మన

డబ్బులు వెదజల్లితే చాలు సర్వం తన కాళ్లముందుకొచ్చి వాలతాయని ఇన్నాళ్లూ తాను కలలుగన్నాడు. అవి కేవలం కలలేనని భ్రమలేనని గవర్రాజు తెలియజేశాడు. డబ్బులు ఎంత విరజిమ్మినా పరాయివ్యక్తి పరాయివ్యక్తేనన్న నిజాన్ని తానింతకాలం గ్రహించలేకపోయినందుకు వీరభద్రం తననితానే నిందించుకున్నాడు.

ఒప్పందం ప్రకారం వారంరోజుల్లో గవర్రాజుకి డబ్బు పంపాడు.

నకాలంలో నిధులు విడుదలయ్యాయి. కాంట్రాక్టుపనులు మళ్లీ ఊపందుకున్నాయి.

★ ★ ★

పాలకపార్టీ మహిళావిభాగానికి అధ్యక్షురాలు అయినదగ్గర్నుంచి మోహినికి క్షణం తీరిక దొరకడంలేదు. పగలూ, రాత్రి శ్రమిస్తూ, ఆ శ్రమకి తగ్గఫలితం చేతికందేరోజుకోసం నిరీక్షిస్తోంది. అందుకోసమే వచ్చిన ప్రతి అవకాశాన్ని ఏమాత్రం వదలకుండా ఎంతో తెలివిగా తనకి అనుకూలంగా మలచుకుంటున్నది.

రాష్ట్రంలోని అనేక మహిళా సంఘాల నుంచి ఆమెకి ఆహ్వానాలు అందుతున్నాయి. మరోవంక పార్టీ మహిళా కార్యకర్తలు వత్తిడి తెస్తున్నారు. ఓ శుభముహూర్తాన పర్యటనకి బయలుదేరింది. తన మేధస్సుతో ఎన్నెన్నో మహిళా కార్యక్రమాలకు రూపకల్పన చేసింది. వివిధప్రాంతాల్లో పర్యటిస్తూ ఆ పథకాలను తన చేతులమీదుగా ప్రారంభిస్తూ బాగా ప్రాచుర్యం పొందింది.

గవర్రాజు సొంతనియోజకవర్గంలో పర్యటించినప్పుడే ఎన్నెన్నో కొత్త విషయాలను తెలునుకుంది. గవర్రాజు పలుకుబడి సొంతవూళ్లోనే బీటలు వారుతున్నట్టు తేలిగ్గానే గ్రహించగలిగింది. పర్వతవర్ధని అండదండలతో ఆ నియోజకవర్గంలో విస్తృతంగా పర్యటించింది. చివరిరోజున పర్వతవర్ధని ఆతిథ్యం కూడా స్వీకరించింది.

"మహిళలు ఎక్కువగా మన పార్టీవైపు మొగ్గుచూపడం ఒక్క మీ నియోజకవర్గంలోనే చూశాను'' అన్నది మోహిని పర్వతవర్ధనితో.



ఎల్వాలవర్ధనకద గర్వకారణం.

"గవర్రాజుగారు సహకరిస్తే ఇంకా చాలా మందిని మనవైపు తిప్పుకోవచ్చు" అంది పర్వతవర్ధని.

అధిష్ఠానవర్గం దగ్గర మోహినికి పలుకుబడిఉన్న సంగతి తెలిసే ఆమె ఈమాట అంది.

అర్థంకానట్టు అదోలాచూసింది మోహిని.

"పేరుకి ఎమ్మెల్యేలేగాని వీసమెత్తు వుపయోగంకూడా వుండదు మా పదవులవల్ల. అధికారాలన్నీ మంత్రుల గుప్పిట్లోనేవున్నాయి. వాస్తవానికి ఇవ్వాల్టిరోజున ఒక్కోమంత్రి ఒక్కో జిల్లాలో దాదాగిరి వెలగబెడుతున్నాడు. మేమంతా వాళ్లకి దాసోహం అనకతప్పడంలేదు. ఎన్నికలొస్తే పార్టీ టిక్కెట్లు మంత్రుల వర్గీయులేన్నే వరిస్తాయి. అందుకే ఎవరికివాళ్ళు కుక్కినపేనుల్లా పడివుండటం"

పర్వతవర్ధని ఆవేదన అర్థమైంది మోహినికి. ఆమె చెప్పినదాన్లోనూ నిజంవుంది. ఆ నిజాన్ని తానూ ఆలస్యంగానే తెలుసుకుంది. ఈ పర్యటనలోనే తనకీ జ్ఞానోదయమైంది.

ఇన్నాళ్ళూ— పార్టీ మహిళావిభాగపు అధ్యక్షురాలి పదవే అందలంగా భావిస్తూవచ్చింది తాను. వాస్తవానికి ఇది అలంకారప్రాయం తప్పితే అధికారాలు పూజ్యమని కాలుబైటపెట్టాకనే తనకీ తెల్సింది. కాని ఇప్పటికిప్పుడు తాను చేయగలిగేదేమీ లేదనికూడా మోహినికి తెలుసు. తన లక్ష్యం ఒక్కటే!

ఆ లక్ష్యసాధనకోసం నిరీక్షించడమే ప్రస్తుతం తాను చేయగలిగింది.

ఒక్కక్షణం మోహిని ఊహాలోకంలో విహరించింది.

అసెంబ్లీ ఎన్నికల్లో పోటీచేసి గెలుపొందినట్టు-

కేబినెట్ మంత్రిగా ఎంపికైనట్టు-

అటు ప్రజలు, ఇటు అధికారులు వందిమాగధులై తనముందు తలలువంచుకుని నిలబడ్డట్టు.

ఈ ఆలోచనలతోనే ఆమె పర్యటన పూర్తయింది.

★ ★ ★





వీరభద్రం కడుతున్న ప్రాజెక్టు చివరిదశకి వచ్చేసింది. మరో నెలరోజుల్లో పని పూర్తవుతుంది.

వీరభద్రం ఇంట్లో కూర్చుని లాభనష్టాల లెక్కలువేస్తున్నాడు. నష్టంవస్తుందన్న దిగులు అతనికి ఏకోశానాలేదు. కాకపోతే లాభాలు తను ఆశించినంతగా వుంటాయాలేదా అన్నదే ప్రశ్న.

ఓరోజు పొద్దున్నే ప్రాజెక్టు సైటుదగ్గరికి వెళ్లామని వీరభద్రం బయల్దేరబోతుండగా ఇంట్లో ఫోను మోగింది. ఆ వేళప్పుడు తనకి ఫోన్లుచేసేవాళ్ళెవరూ లేరు. వెళ్ళి రిసీవరెత్తాడు.

ప్రాజెక్టు సైటు దగ్గరనుంచి సూపర్వైజరు అవతలివైపు ఫోనులోవున్నాడు. అతను చెప్పింది వినేసరికి వీరభద్రం ఒక్కసారి ఖిన్నుడయ్యాడు.

"ఏమిటి నువు చెప్పేది- నిజమేనా?" నమ్మలేక అడిగాడు మళ్ళీ.

"అవునుసార్... అంతా కూలిపోయింది. పాతికమంది దాకా కూలీలుకూడా చచ్చిపోయారు సర్... ఇక్కడంతా గొడవగొడవగావుంది... చాలామందికి దెబ్బలు తగిలాయి. వాళ్ళంతా ఒకటే ఏడుపులు... పెడబొబ్బలు... అంబులెన్స్కోసం ఇప్పుడే ఫోన్చేశాను. నాకేదో భయంగావుంది... మీరు అర్జంట్గా రండి సార్..." అవతలివ్యక్తి గొంతులో ఆందోళన, ఆవేదన మిళితమై వినిపిస్తున్నాయి.

వీరభద్రం నుదురు చెమటతో తడిసిపోయింది. ఇంతటి దారుణాన్ని వినవలసివస్తుందని అతను కల్లోకూడా వూహించలేదు. అతని మనస్సు వేగంగా పనిచేయనారంభించింది. గవర్రాజుతో ఫోనులో మాట్లాడాడు. ఆ వెంటనే డి.జి.పి.కి ఫోన్చేశాడు.

తానిప్పుడు ప్రమాదస్థలానికి వెళ్ళకుండా వుండటమే అన్నివిధాలా మంచిదని తోచింది. తాను ఇప్పుడు అక్కడ కూలీలకంటబడితే పరిస్థితి ఎలావుంటుందో ఒక కాంట్రాక్టరుగా తనకి తెలీనిదేమీ కాదు. అందుకే ఎక్కడికీ కదలకుండా ఇంట్లోనేవుండిపోయాడు. సూపర్వైజర్కి పదినిముషాలకొకసారి ఫోన్చేసి అక్కడి పరిస్థితులు తెలుసుకుంటున్నాడు. శిథిలాలలోనుంచి మృతదేహాలనన్నింటిని వెలికితీశారు. చివరికి మృతుల సంఖ్య ముప్ఫయ్ అని తేలింది. యాభైమందికిపైగా గాయాల

పొందుతున్నారు. వారిలో ఒకరిద్దరి పరిస్థితి ఆందోళనకరంగానేవుంది.

ప్రమాదస్థలమంతా జనంతో కిటకిటలాడి పోతోంది. గవర్రాజు, మోహినితోసహా ముఖ్యమంత్రి, మంత్రులు అక్కడికి చేరుకున్నారు. ఆ ప్రాంతమంతా శవాలు తారట్లాడుతున్న సజీవ స్మశానంలావుంది.

పోలీసు ఉన్నతాధికారులతో ముఖ్యమంత్రి చాలాసేపు మాట్లాడారు. బాధితులకు సహాయకచర్యలగురించి సూచనలిచ్చారు. మోహినికి ఏదో పని పురమాయించారు.

వెళ్ళి కారెక్కుతూ గవర్రాజుని కూడా తన వెంట రమ్మని ఆదేశించారు. ఆవెనకే గవర్రాజు ముఖ్యమంత్రిని అనుసరించాడు.

అదేసమయంలో పోలీసు జీపు రయ్యిన దూసుకెళ్ళింది— వీరభద్రం ఇంటివైపు.



ముఖ్యమంత్రి ఛాంబర్‌లో గంటనుంచీ ఎడతెగకుండా మంతనాలు జరుగుతున్నాయి. ఛాంబర్‌లో ఇద్దరేఇద్దరు వున్నారు. ఒకరు ముఖ్యమంత్రి కాగా మరొకరు గవర్రాజు.

జరిగినదారుణానికి సంబంధిత శాఖ మంత్రిగా పదవికి రాజీనామాచేయమని ముఖ్యమంత్రి సలహాఇచ్చారు.

పదవే సర్వస్వంగా భావించే గవర్రాజుకి ఆమాటలు రుచించలేదు. 'రాజకీయాల్లో నైతికబాధ్యత అనేది ఉక్కు శిరస్త్రాణంలాంటిది. చేసినపాపాన్ని ఆ బాధ్యతతో నెత్తినవేసుకుంటే పాపపరిహారమే కాదు. రాజకీయ భవితవ్యమూ వుంటుంది. రాజకీయాల్లో తలపండినవాడివి. నీకు ప్రత్యేకంగా నేను చెప్పేదేముంటుంది?'' ముఖ్యమంత్రి హితబోధచేస్తున్నారు. ఎప్పుడూ

నలా మొదటిసారి తన నాయకుని మాటలకు తలవూపాల్సివచ్చినందుకు లోలోన ఎంతో క్షోభపడ్డాడు.

పెళ్లాంపోయినా ఫర్వాలేదు. తట్టుకోవచ్చు కాని పదవిపోతే బతుకే దుర్భరమవుతుందని ఇన్నాళ్ళూ తాను భావించేవాడు. ఆ దుర్భరపరిస్థితి తనకి ఎదురుకాకూడదని వెయ్యి దేవుళ్ళని ప్రార్థించేవాడు. కాని ఇవ్వాళ ఎదురైంది.

"ఈ దారుణం మన పార్టీకి మాయనిమచ్చగా మిగిలిపోతుంది. అందుకు నువ్వీ త్యాగం చెయ్యకతప్పదు. నీసహాయం నేను ఉంచుకోను. ఏదోఒక రూపంలో ప్రతిఫలం ముట్టజెపుతాను. ప్రభుత్వమంటే ఒక్క మంత్రి పదవేకాదు. పార్టీ లేదా! పార్టీలో ఎన్నిపదవుల్లేవు. నువ్వు ఇప్పుడు చేసే త్యాగం వచ్చే ఎన్నికల్లో మనపార్టీకి రక్షఅవుతుంది. మరేమీ ఆలోచించకు. ఛాంబర్‌బయట పత్రికావిలేకరులు ఎదురుచూస్తుంటారు. వెళ్ళు. వెళ్ళి— జరిగిన దారుణానికి చింతిస్తూ నైతిక బాధ్యతతో మంత్రిపదవికి రాజీనామా చేస్తున్నానని— ప్రకటించు'' అని ముఖ్యమంత్రి అంటుండగానే గవర్రాజు స్ప్రింగ్‌డోర్ తెరుచుకుని బైటికినడిచాడు.

బైటికివచ్చీ రాగానే విలేకరులు చుట్టుముట్టారు.

ఆక్షణంలో-

గవర్రాజు ఇన్నేళ్ళ తన రాజకీయజీవితంలో ఎన్నడూలేనివిధంగా అవమానభారంతో కుంగిపోయాడు.

తాను రాజీనామా చేస్తున్నట్టు ప్రకటించాడు. విలేకరులు ప్రశ్నలవర్షం కురిపించారు.

ఆ ప్రాజెక్టు కూలిపోవడంలో తన తప్పుగానీ, ప్రభుత్వం తప్పుగానీ లేదని, కేవలం నైతికబాధ్యతతోనే తాను రాజీనామా చేస్తున్నానని చెప్పాడు. గవర్రాజు రాజనీతిజ్ఞతను అక్కడేవున్న ముఖ్యమంత్రి పొగిడారు.

కాంట్రాక్టరు వీరభద్రాన్ని ఇప్పుడే అరెస్టు చేశామని, న్యాయవిచారణకు ఆదేశించామని, దర్యాప్తు పూర్తయి నివేదిక చేతికిరాగానే దోషులపై చర్యలు తీసుకుంటామని ముఖ్యమంత్రి

విలకరుల ప్రశ్నలకు సమాధానంగా చెప్పారు.

★ ★ ★

సాయంత్రమవుతోంది.

మోహిని ఇంకా ప్రమాదస్థలం దగ్గరేవుంది. సహాయకచర్యల పర్యవేక్షణలో తలమునకలై వుంది. గవర్రాజు మంత్రిపదవికి రాజీనామా చేసినట్టు తన అనుచరగణం ద్వారా అప్పుడే కబురందింది.

ఆమె మనస్సు మరోమారు గాలిలో తేలియాడింది.

అదృష్టం తనని వరించడానికి ఇంకెంతో కాలం పట్టదని అనిపించిందామెకి.

ఆ క్షణంలో ఆమె మెదడుకు ఓ ఆలోచన తట్టింది.

వెంటనే ఇంటికివెళ్ళి అనంత్‌కి ఫోన్‌చేసింది. ప్రమాదానికి సంబంధించి ముఖ్యమైన వార్త చెబుతానని ఆశపెట్టడంతో అనంత్ ఆఘమేఘాలమీద ఆవిడ ఇంటికి చేరుకున్నాడు.

ఆ ప్రాజెక్టు కాంట్రాక్టు వీరభద్రానికి ఎలా దక్కిందీ, వీరభద్రానికి, గవర్రాజుకీ కుదిరిన ఒప్పందం, ప్రతిగా గవర్రాజుకి ముట్టిన ప్రతిఫలం గురించి మోహిని వివరించింది.

''ఇదంతా నమ్మడమెలా?'' అని సందేహం వ్యక్తంచేశాడు అనంత్.

అప్పుడామె తన డైరీతీసి- ఆ కాంట్రాక్టు కోసం ఎవరెవరు దరఖాస్తులు పంపుకున్నదీ- వాళ్ళు ఆఫర్‌చేసిన టెండర్‌రేట్లు వివరంగా అనంత్‌కి చూపించింది.

ఇద్దరూ డబ్బుకోసం గడ్డికరవడంవల్లనే ఈ దారుణం జరిగిందంటూ మర్నాడు పత్రికల్లో వార్తలొచ్చాయి.

ముఖ్యమంత్రికి మళ్ళీ తలనొప్పి. గవర్రాజు ఈసారి శాసనసభ్యత్వానికి కూడా రాజీనామా చేయకతప్పలేదు.

మోహిని ఆనందానికి అవధుల్లేవు.

★ ★ ★

నాలుగు నెలల తర్వాత—

గవర్రాజు రాజీనామాతో ఖాళీ అయిన స్థానానికి ఉపఎన్నిక జరిపేందుకు తేదీ ప్రకటించారు.

ఇంతకాలం ఈ సమయంకోసమే మోహిని ఎదురుచూస్తోంది. మరోమారు తన రాజకీయ చాతుర్యానికి శ్రీకారం చుట్టింది.

ఓరోజు పొద్దున్నే వీరభద్రం ఇంటికెళ్ళింది. కూలిపోయిన ప్రాజెక్టు తాలూకు చేదుఅనుభవాలను మరిచిపోయినా, గవర్రాజువల్ల తానెంత నష్టపోయిందీ వీరభద్రం ఇంకా మరిచిపోలేదు.

పార్టీ మహిళా విభాగానికి అధ్యక్షురాలిగా ఎంపికైనప్పుడు మోహిని వీరభద్రాన్ని కలిసింది. ఆ తర్వాత మళ్ళీ ఇద్దరూ తారసపడటం ఇదే.

మోహినిలో అధికారదర్పం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది వీరభద్రానికి. ఆమే స్వయంగా కారు నడుపుకుంటూ నేరుగా లోనికొచ్చింది. ఎదురెళ్ళి ఆహ్వానించాడు.

ఇద్దరూ లోనికెళ్ళారు.

మోహినే ముందుగా అసలు విషయం ప్రస్తావించింది.

''నేను ఎంతగా ఎదిగినా మీమనిషినే అన్న విషయం మీరు మరువకూడదు. ఆమాటకొస్తే నా ఈ ఆరాటమంతా ఎవరికోసం? నా జీవితానికి ఓ దారి చూపించినవారు మీరు. మీ రుణం తీర్చుకోవాలన్నదే నా కోరిక. మీరు చెప్పిన ప్రతిపనీ చేశాను. కాని గవర్రాజు విషయంలోనే ఓడిపోయాను. ఆ విషయం మీకు తెల్సు. ఈసారి పదవి సంపాదించి మీకు జరిగిన ఆ అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాను. అందులో భాగంగానే గవర్రాజు అండదండలతో పార్టీ మహిళావిభాగానికి అధ్యక్షురాలినయ్యాను. పార్టీలో పలుకుబడి సంపాదించటానికి, పదిమందిలోకి వెళ్ళటానికి నాకాపదవి బాగా ఉపయోగపడింది. ఆకాస్త ఆధారంతో అంచెలంచెలుగా ఎదిగాను. ఇప్పుడు నా ధ్యేయం ఒక్కటే. అధికారపీఠాన్ని హస్తగతం చేసుకోవడం. తద్వారా మీకు సాయపడి మీ రుణం తీర్చుకోవడం'' దాదాపు పావుగంటసేపు గలగల మాట్లాడి ఒక్కసారిగా ఆగిపోయింది.

ఆమె మాటల్ని వీరభద్రం శ్రద్ధగా విన్నాడు.

అయిదు నిముషాలు... పదినిముషాలు...

ఇద్దరిమధ్యా మాటలే కరువయ్యాయి.

''నాఈ లక్ష్యసాధనకి మీ ఆశీర్వాదం కా





భద్రం మెత్తబడ్డాడు. అంతకుముందుదాకా ఆమెమీదవున్న కోపతాపాలు ఇప్పుడులేవు.

"మీ సహాయసహకారాలుంటే ముందు ముందు మనమాటే వేదం అవుతుంది. మీరు పట్టిందల్లా బంగారమే అవుతుంది" మోహిని వదిలిన మరోబాణమిది.

"చెప్పు... నేనేం చెయ్యగలను?"

నిముషం గడుస్తున్నకొద్దీ వీరభద్రం మనస్సు ఒక్కొక్కమెట్టే కిందికి దిగుతోంది.

"ఉపఎన్నికలో పార్టీ టిక్కెట్ కోసం ప్రయత్నిస్తున్నాను. మీ అండదండలు కావాలి"

వీరభద్రం ఆలోచనలోపడ్డాడు. ఆడబోయే తీర్థం ఎదురైనట్లు అనిపించింది. రాజకీయ చక్రవ్యూహంలో గవర్రాజుని చిత్తుచేయడానికి మోహిని సరైన సాధనమని వీరభద్రం అంతరాత్మ ప్రబోధించింది.

వీరభద్రంనుంచి మోహినికి కొండంత భరోసా లభించింది.

★ ★ ★

రాత్రి పదకొండుగంటలవేళ...

మోహిని ఒళ్ళో తలపెట్టుకు పడుకున్నాడు గవర్రాజు.

అప్పటికే చిత్తుగా తాగాడు.

"నువ్వు ఎన్నన్నా చెప్పు డియర్... పదవిలేనిదే నేను బతకలేను. అందుకే చచ్చిపోవాలనుకుంటున్నాను" పిచ్చిగా అరుస్తున్నాడు గవర్రాజు.

మోహిని అతన్ని సముదాయించుతోంది.

"ఇంతలోనే అంతగా డీలాపడిపోతే ఎలా డియర్... పదవి అంటే ఎంత ప్రాణమో నేనన్నా అంతే ప్రాణంగదా మీకు!"

"అయితే?" అర్థంగాక అడిగాడు.

"నాలోనే పదవిని చూసుకోండి" గవర్రాజు తల నిమురుతూ అంది.

"అదెలాగ?"

"మీరు తల్చుకుంటే సాధ్యమేమరి" గోముగా నవ్వింది.

ఆ నవ్వులో అంతరార్థం అంతుచిక్కలేదు గవర్రాజుకి.

ఆవిడే విడమరిచి చెప్పింది.

గదా. మీమాట కాదని ఉపఎన్నికలో టిక్కెట్ వేరే ఎవరికైనా ఇస్తారా?"

"నాకుమాత్రం రాదుగదా!"

"నాకొస్తే ఒకటి, మీకొస్తే ఒకటా. నాకోసం ట్రయ్‌చెయ్యండి"

గవర్రాజు ఒక్కక్షణం ఏమీ మాట్లాడలేదు.

"అవును డియర్... మీరో, నేనో పదవిలో వుంటే మనకిక ఢోకాఏముంటుంది?" గవర్రాజు ఆలోచనలోపడ్డాడు. తను పదవిలో లేకపోయినా తన మనిషంటూ పదవిలో వుంటుంది. ప్రస్తుతానికి తాను ఇంతకిమించి ఎక్కువ ఆశించడంకూడా మంచిదికాదు. మోహిని గెలిస్తే, మంత్రి పదవికోసం ప్రయత్నించవచ్చు.

మోహిని సలహాని గవర్రాజు మెచ్చుకున్నాడు.

★ ★ ★

ఉపఎన్నికలో పోటీ చేసేందుకు అధికారపార్టీ టిక్కెట్‌కోసం ఎంతోమంది పోటీపడ్డారు. అధిష్టానవర్గంమీద ఎన్నోరకాలుగా వత్తిళ్ళు వచ్చాయి.

మోహినికి టిక్కెట్ ఇచ్చి తీరాలని గవర్రాజు పట్టుపట్టాడు. వీరభద్రం పరోక్షంగా వత్తిడితెచ్చాడు. ఇందులో మందాకిని అతనికెంతగానో సాయపడింది. మోహినికే టిక్కెట్ ఇవ్వాలని పర్వతవర్ధని స్థానికనాయకుల సంతకాలతో మెమొరాండం పంపించింది అధిష్టానవర్గానికి.

పాలకపార్టీ అభ్యర్థిగా ఎన్నికల్లో పోటీచేయడానికి మోహిని ఎంపికైంది.

నామినేషన్లు వేసింది.

తెల్లవారి ఎన్నిక ప్రచారం ప్రారంభంకాబోతోంది. ఆ రాత్రే నియోజకవర్గానికి బయలుదేరింది— ఈ రాజకీయచక్రవ్యూహంలో విజయంకోసం గంపెడాశతో.

గవర్రాజుకి వున్న మందబలం, వీరభద్రానికి వున్న ధనబలమే ఈ చక్రవ్యూహంలో ఆమెకి సోపానాలు.






ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభా
వంతులైన రచయితలకు నెలనెలా నవలల
పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర
రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల
నవలలకు వేదిక 'చతుర'.

★ "చతుర"లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక
కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక
పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచ
టంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగ్గా ఈ సైజుకు సరిపడేలా,
మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి
దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో,
అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగుపోస్టేజీని
జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

జనవరి 'చతుర' నవల: చక్రవ్యూహం

సమీక్షకుని పేరు: ....................................

చిరునామా: ....................................

....................................

....................................




## ఈ దశాబ్దపు సిసింద్రీ!

ఫొటో తీయించుకోవాలనీ, తమ ఫొటో అందంగా రావాలనీ చాలామందికి ఉంటుంది. కెమేరా కళ్ళముందునుండి కదలి రాగానే 'ఫొటో 'దిగాను', ఎలా పడతానో ఏమిటో' అని కొందరనుకుంటే 'అయ్యో... సెంటు రాసుకోవడం మర్చిపోయానే' అని నాలుక కొరుక్కొనే బాపతు ఆసాములూ ఉన్నారు. ఫ్లడ్‌లైట్ల కాంతిని భరించలేక రెప్పలార్పి షూటింగ్‌లో కెమేరా ఎదుట విన్యాసాలు చేసే కొత్త నటులకళ్ళలో కెమేరా భయం దోబూచులాడుతుంది. పబ్లిక్‌పరీక్షలు రాసేందుకు వెళ్ళే విద్యార్థికి గుండెల్లో పరీక్షల గుబులు అదురు పుట్టిస్తున్నా పరీక్షకోసం పాస్‌పోర్ట్ సైజుఫొటో తీయించుకుంటూ ఉంటే అదొక థ్రిల్లుగా ఫీలవుతుండటం మనకి తెలుసు. వైద్య రంగంలో కూడా కెమేరాలు నిర్వహించే పాత్ర ఎంతో ఉంది.

శరీరంలో అంతర్గతంగా వ్యాపించిన వ్యాధుల్ని కనుగొనేందుకు తీసే ఎక్స్-రేని కన్వెన్షనల్ ఎక్స్-రే మెషిన్‌తో తీస్తారు. ఈ కన్వెన్షనల్ ఎక్స్-రే యంత్రానికంటే ఎన్నోరెట్లు చురుగ్గా, మెరుగ్గా పనిచేసే అద్భుతమైన కెమేరాని కెనడాకి చెందిన 'రేలాసన్' కనుగొన్నాడు. ఈ కెమేరా చూసేందుకు టెలివిజన్ కెమేరాలాగే ఉంటుంది. మొదట్లో బ్లాక్ అండ్ వైట్ ఫొటోల్ని మాత్రమే తీసినా ప్రస్తుతం కలర్ ఫొటోల్ని కూడా తీస్తోంది. ఈరకం కెమేరా టెక్నిక్‌ని థర్మోగ్రాఫ్ అంటున్నారు. ఈ థర్మోగ్రాఫ్ కెమేరా పద్ధతిద్వారా విదేశీ ఆసుపత్రుల్లో ఎన్నో ప్రాణాల్ని రక్షిస్తున్నారు. కడుపులో ఏమూలనో ఓ సన్నటి అల్సర్ ఎంత సూక్ష్మంగా ఉన్నా ఈ కెమేరా దాన్ని స్పష్టంగా ఫొటోల్నితీస్తుంది. రోగనిర్ధారణకోసం డాక్టరు కుస్తీపట్లు మానేసి వెంటనే చికిత్సకి పూనుకోవచ్చు. వైద్య రంగంలోని అన్ని విభాగాలకూ ఈ థర్మోగ్రాఫ్ కెమేరా అత్యవసరమే అయినా హృద్రోగాలశాఖకి ఇది మరింత అవసరమని భావిస్తున్నారు.

కాన్సర్‌వ్యాధి తొలిదశలో ఉన్నప్పుడు కన్వెన్షనల్ ఎక్స్-రే ద్వారా గుర్తించలేరు. కాని ఈ థర్మోగ్రాఫ్ ఎక్స్-రే నూటికి తొంభైరెండు కేసుల్ని వ్యాధి ప్రారంభదశలో ఉన్నప్పుడే సూచిస్తుంది. ఇలా తొలిదశలోనే వ్యాధికి చికిత్స ప్రారంభించి స్వల్పకాలంలోనే నివారిస్తున్నారు. దీనివల్ల అందరికీ లాభం కలుగుతోంది. అమెరికాలోని ఫిలదల్ఫియాకి చెందిన డాక్టర్ హెరాల్డ్‌రిచర్డ్ కాన్సర్ సోకిన ఇరవైవేలమంది స్త్రీలను థర్మోగ్రాఫ్ ఎక్స్-రే సాయంతో పరీక్షించి రోగనిర్ధారణ చేశాడు.

రక్తప్రసరణ వేగాన్ని పరిశీలించేందుకు కూడా థర్మోగ్రాఫ్ ఎంతో ఉపయోగకారిగా ఉంది. రక్తం ప్రవహించే సమయంలో ఎక్కడ లోపముందో, అసలా లోపం ఏమిటో స్పష్టమైన ఫొటోలు తీసి చూపిస్తుంది. అది చూసి డాక్టర్లకు మందులివ్వడం తేలికైపోయింది. గాయంలోతు ఎంతవరకు ఉందో దీనిద్వారా తెలుసుకోవచ్చు. కీళ్లనొప్పుల చికిత్సల్లో కూడా




ఇది ఎంతో ఉపయోగకారిగా ఉంటోంది.

ఈ థర్మోగ్రాఫ్ కెమేరా కాలుష్య కొలమానంగా కూడా పనిచేయటం విశేషం. ఒక నదిలోని నీరు పారిశ్రామిక కాలుష్యకారణంగా ఎంతమేరకు కలుషితమైందో ఖచ్చితంగా చూపిస్తుంది. ఏ ఫాక్టరీ గోడకి రంధ్రంపడినా చక్కని ఫోటోల ద్వారా దాని వివరాలన్నీ చూపిస్తుందీ కెమేరా.

ఏ ఫ్యాక్టరీలోనో, కాంప్లెక్స్‌లోనో ప్రమాదవశాత్తు ఏ అగ్నిప్రమాదమో సంభవిస్తే అగ్నికి ఎక్కువగా గురైన ప్రాంతాన్ని ఈ కెమేరాసాయంతో గుర్తించవచ్చు. మేఘాలధాటినీ, మంచుకురిసే ఉధృతాన్నీ పొగమంచులోని గాఢత్వాన్నీ దళసరిదనాన్నీ పరిమాణాన్నీ కొలిచి ఖచ్చితమైన లెక్కల్ని సేకరించవచ్చు.

## కుట్టుమెషీను గురించి...

**త**న అభిమాన నటుడు సరికొత్తగా రిలీజయిన స్టంట్ పిక్చర్లో వేసుకున్న డ్రెస్సులాంటిది తనుకూడా ఆ మర్నాడే కుట్టించుకునేవారు చాలామంది వుంటారు. గుడ్డకున్న నాణ్యత కంటే అది కుట్టినతీరే వింత అందం చిందుతుంది. 'కుట్టు' కుదరకుంటే అదెంత నాణ్యమైన, నాజూకైన, ఖరీదైన గుడ్డ అయినా ఓస్ అనిపిస్తుంది. కుట్టటం కుదిరితే నాసిరకం దుస్తులైనా వంటికి సరిగ్గా అమరి కొత్తదనాన్నిస్తాయి.

ఈరోజుల్లో దాదాపుగా ఇంటింటా కుట్టుమెషీను కన్పిస్తూనే ఉన్నా టైలరింగ్ షాపులూ అసంఖ్యాకంగానే వెలిశాయి. కరెంటుతో పనిచేసే కుట్టు మెషీన్లుకూడా విరివిగా రావటంతో పని త్వరగా పూర్తవటమేగాక, రకరకాల ఆకారాల్లో పువ్వుల్నీ జంతువుల్నీ పక్షుల్నీ డిజైన్ల రూపంలో సునాయాసంగా కుట్టుకోవచ్చు. ఒక గంటలో 60 నుండి 70 వరకు బ్యాగుల్ని కుట్టటం కూడా వీటివలన సాధ్యపడుతూ వుంది.

ఇంతకీ తొలిసారిగా 1829లో బార్తిలెం డిమోనీర్ అనే ఇంజినీరు ఈ కుట్టు మెషీనును రూపొందించాడు. అంతకుముందు వరకు దర్జీలు పూర్తిగా చేత్తోనే దుస్తుల్ని కుట్టే పద్ధతి అమలులో ఉండేది. అయితే ఈ మెషీనును రూపొందించిన ఇంజనీరు తన మెషీను వలన పెద్దగా లాభంగానీ, గుర్తింపుగానీ పొందకుండానే కన్నుమూశాడు. తర్వాత ఆ నమూనాను ఇతరులు దొంగిలించి ఎంతో లాభపడ్డారు. డిమోనీరు రూపొందించిన మెషీ

నులో ఉపయోగించిన సూది కొద్దిగా వంకరగా వుండగా అమెరికన్ వాల్టర్‌హంట్ మెషీనులో నిటారుగా ఉన్న సూదిని ఉపయోగించి అది కుట్టుకి మరింత అనుకూలంగా వుండేలా చూశాడు. ఆ తరువాత కొన్నాళ్లకి ఎలియాస్ హెూ దానిని ఆధునీకరించటంతోపాటు కాలితో తొక్కే మెషీను కనుగొన్నాడు. 'హెూ' అంతకుక్రితం ఒక చేనేత పరిశ్రమలో పనిచేసినందువల్ల గుడ్డ నేస్తున్నప్పుడు నేతగాని కాళ్లని, కదలికల్ని పరిశీలించేవాడు. అదే పద్ధతిని కుట్టు మెషీనులో ప్రవేశపెట్టి శ్రమ తగ్గించాడు. ఎంతో శ్రమపడి 2 1/2 సంవత్సరాలపాటు అనేక మార్పుచేర్పుల్ని చేస్తేనే ఇది సానుకూల పడింది.

1844 లోనే ఈ ఆధునీకరించిన కుట్టుమెషీను మార్కెట్లో విడుదలయినా, 'హెూ' ధనాభావం వల్ల దానికి రిజిస్ట్రేషన్ చేయించలేక పోయాడు. ఫలితంగా మెరిట్ సింగర్, సీమెర్, విలియం వంటి వ్యాపారవేత్తలు అతని నమూనాకు నకళ్లు తయారుచేసి స్వంత మెషీన్లను రూపొందించుకున్నారు. అయితే ఎలియాస్ వాళ్లను అలా విడిచిపెట్టక వారిపై కోర్టులో కేసుపెట్టి చివరికి విజయం సాధించాడు.

పురుషులకంటే స్త్రీలే త్వరగా కుడతారని ఓ సర్వేలో తేలింది. కుట్టుమెషీను దర్జీలందరికీ ఎంతగానో శ్రమ తగ్గించి, కుట్టులో నాణ్యతను, నాజూకుతనాన్ని వేగాన్ని పెంచింది. కుట్టుమెషీనుమీద ప్రస్తుతం ఎంబ్రాయిడరీతో చక్కని డిజైనులు కూడా కుడుతున్నారు.

## అంబులెన్స్

**బాధ**తో విలవిలలాడే ప్రాణిని ఆస్పత్రిలో చేర్చేసరికి కొంత సమయం పడుతుంది. ఆ సమయం అయిదు నిమిషాలైనా కావచ్చు, అరగంటైనా కావచ్చు. అలాంటప్పుడు తక్షణ చికిత్స ''అంబులెన్స్'' ద్వారానే సాధ్యం. ఫోనులో పిలిస్తే ఇంటిముందర క్షణాల్లోవాలి రోగిని ఆసుపత్రికి తరలిస్తూనే మధ్యేమార్గంలో అవసరమైన ఆక్సిజన్, గ్లూకోస్‌వంటివి అందిస్తూ క్షీణిస్తున్న ఆరోగ్యాన్ని ఆదుకుంటుంది అంబులెన్సు.

17వ శతాబ్దంలో నెపోలియన్ సైన్యంలో చీఫ్ మెడికల్ ఆఫీసరుగా వున్న డాక్టర్ డామ్నిక్ జీన్‌లొరాయ్ తొలిసారిగా ఈ అంబులెన్సును ప్రవేశపెట్టాడు. ఫ్రెంచి భాషలో అంబు



తగిలింది, అంబులెన్స్ లో వస్తుంటే....

లెంట్ అనే పదానికి కదిలే ఆసుపత్రి అనే అర్థం ఉంది. దీన్ని రూపొందించిన తొలిరోజుల్లో అదొక జట్కాబండి ఆకారంలో వుండేది. యుద్ధంలో క్షతగాత్రులైన సైనికులకోసం దీనిని ఉపయోగించారు. ఆ తరువాత అవసరాలు పెరగటంతో రైళ్లనూ, ఓడలనూ, బస్సులనూకూడా అంబులెన్సుగా ఉపయోగించసాగారు. తీవ్రంగా గాయపడిన సైనికులను ఆసుపత్రికి తరలించేలోగా అంబులెన్సులో డాక్టర్లు, పరికరాలు, ఆక్సిజను, మందులూ లేనందువల్ల చాలామంది రోగులు దార్లోనే ప్రాణాలు విడిచేవారు. ఈ సదుపాయాలు తరువాత క్రమక్రమంగా కల్పించారు.

1869లో తొలిసారిగా అమెరికాలోని న్యూయార్క్‌లోని బెల్‌వ్యూ హాస్పిటల్‌వారు మోటార్ అంబులెన్స్‌ని ప్రవేశపెట్టారు. ఆ తరువాత హెలికాఫ్టర్ అంబులెన్సునుకూడా రూపొందించటంతో పరిస్థితి మరికొంత మెరుగైంది. 1939 నుండి 1945వరకు జరిగిన రెండవ ప్రపంచయుద్ధసమయంలో హెలికాఫ్టర్ సర్వీసుల్ని విస్తృతంగా వుపయోగించుకుని తీవ్రంగా గాయపడిన సైనికులను రవాణా చేసేందుకు వాడారు. ఈ అంబులెన్సు చిన్న సైజులోవుండి ప్రాథమిక చికిత్సను మాత్రమే అందించేది. 1970 తరువాత ఈ అంబులెన్సును ఆధునీకరించారు. ప్రాథమిక చికిత్సేకాక సంపూర్ణచికిత్సకు సైతం ఏర్పాట్లు జరిగాయి. అత్యవసర చికిత్సకి అవసరమైన అన్ని సదుపాయాలూ అంబులెన్సులోనే అమర్చి నిపుణులైన డాక్టర్లచేత వైద్యంచేయిస్తున్నారు. బ్రిటన్‌లో అరవై అడుగుల పొడుగున్న అంబులెన్సులు 44 మంది పేషెంట్లను ఒకేసారి ఆస్పత్రికి తీసుకు వెళ్తాయి.

ఇటీవల అమెరికాలో అంబులెన్స్ సిస్టంని మరింత అభివృద్ధి చేశారు. ఈ అంబులెన్స్‌లు రోడ్డుపై, గాలిలో, నీటిలో కూడా పయనించగలవు.




# చతురకతలు



## విరుగుడు

‘మే ఐ కమిన్ సర్’ అంటూ స్ప్రింగ్‌డోర్ తెరుచుకుని లోపలికొచ్చాడు బద్ధకేశ్వర్. ‘కూర్చోండి’ సీట్ ఆఫర్‌చేశాడు డాక్టర్. బద్ధకంగా కూర్చున్నాడు బద్ధకేశ్వర్.

“చెప్పండి... ఏమిటి ప్రాబ్లమ్” అడిగాడు డాక్టర్.

“బద్ధకం” క్లుప్తంగా చెప్పాడు.

“అలాగా” దీనిక్కూడా ట్రీట్‌మెంటివ్వాలా నాయనా అన్నట్లు నవ్వేడు డాక్టర్.

“టాబ్లెట్లు రాసిస్తాను. పదిహేనురోజులవరకు వేసుకోండి. ఇపుడు ఇంజక్షన్ చేస్తాను” అంటూ సిరెంజ్‌లోకి మందు ఎక్కించసాగా

డు.

"లాభంలేదు డాక్టర్... పక్కవీధి డాక్టర్ కూడా ఇవే మందులిచ్చాడు"

"అయినా బద్ధకం వదల్లేదా?"

"రోజుకో మాత్ర వేసుకోవాలంటేనే నాకు యమబద్ధకం"

"పోనీ- ఏ పన్లుచేస్తే బద్ధకం ఉండదో చెప్పండి"

"తినటం, పడుకోవటం. ఈమధ్య తినటానికి బద్ధకమేసినా ఆహారం లేకుంటే చచ్చిపోతానని తింటున్నాను" చెప్పాడు.

చావంటే భయముందిలే- అనుకున్నాడు డాక్టర్.

"మొహం కడుక్కోవటం, స్నానంచేయటంలాంటి దినచర్యల్ని కూడా ఇంట్లోవాళ్ళ బలవంతంమీద రెండ్రోజులకోసారి చేస్తున్నాను. ఇంతకంటే ఇంకా ఎక్కువ మాట్లాడేందుకు బద్ధకం... దయచేసి మందు పడేయ..." ఓపిక నశించినట్లు కుర్చీకి జారగిలబడిపోయేడు.

"లేకేం... దివ్యౌషధం ఇస్తా! ఈ మాత్ర వేసుకుంటే నీ బద్ధకం క్షణాల్లో పోతుంది"

"అబ్బా... మళ్ళీ మాత్రల గొడవా! అవి వేసుకోటమంటేనే నాకు బద్ధకం"

"నోరు తెరువు నాయనా! నేనే వేస్తాను- ఈ ఒక్కమాత్రే చాలు... దెబ్బతో బద్ధకం పనిసరి"

"నిజంగానా... ఆ మాత్ర పేరేమిటీ...?"

"పొటాసియం సైనైడ్"

"అయ్యబాబోయ్..." అనేసి ఒక్కగెంతు వేసి పరుగు లంకించుకున్నాడు బద్ధకేశ్వర్.

--కొల్లిమల్ల అప్పారావు

## అతిథి సత్కారం

**గో**డ గడియారం పదిగంటలు కొట్టింది.

"ఏమండీ... ఆఫీసుకు వెళ్తున్నారా?" లోపల్నించి వసంత అడిగింది.

అసలే టైమయిందని హడావిడిగా డ్రస్ చేసుకుంటున్న సూర్యానికి చిర్రెత్తుకొచ్చింది.

"అహఁ... ఆడుకోటానికి వెళ్తున్నా" అన్నాడు ఎకసక్కెంగా.

"టయిమయిందిగదా అని అడిగా- అంత కోపమెందుకండీ" బుంగమూతి పెట్టుకుని వరండాలోకి వచ్చి అలవోకగా చూస్తూ అన్నది అర్ధాంగి.

అంతే... సగంతగ్గాడు! ఆ సమ్మోహనాస్త్రంతోనే తన్ను కుదేలుచేస్తోంది ఈ అయిదేళ్ల నుంచీ- అనుకున్నాడు.

"ఇంతకీ ఏంటట సంగతి?" కొంచెం వినుగ్గా అడిగాడు.

"ఏంలేదండీ... మాబాబాయొస్తున్నాడివ్వాళ."

"బాబాయా!"

"మా నర్సు బాబాయిలెండి. మనపెళ్లికి ఆరోగ్యం బాగోక రాలేదు. అందుకని మీకు తెలీదు"

"అయితే ఏంచెయ్యాలిట! స్టేషనుకు బాండ్‌మేళం తీసుకుపోవాలా?"

"మీకంతా వేళాకోళమే! పెందలాడే ఆఫీసునుంచిరారూ! వచ్చేటప్పుడు..."

"ఆగాగు... దండకం చదవకు. కూరలు, కందిపప్పు, చింతపండు, పంచదార వగైరా వగైరా అన్నీ తేవాలిగదూ?"

"అబ్బ... అన్నీ వున్నాయండీ! స్వీట్‌ప్యాకెట్ ఓ కిలో పట్రండి. ఆయనకు మహాయిష్టం. ఏమండీ... తప్పక తెస్తారు కదూ" గోముగా కళ్లల్లో కళ్లు పెట్టి చూస్తూ అడిగింది.

"చచ్చాం పో! నెలాఖరురోజులు. జేబులో రెండురూపాయలున్నాయి. అయినా మీ బాబాయ్ ఈ గుమస్తాగాడింటికొచ్చేటప్పుడు మొదటివారంలో రాకూడదూ!"

ఫక్కున నవ్వింది వసంత. "సర్లెండి... ఏ అప్పోసప్పో చేసి పట్రండి. ఆయనకి ఈవూళ్లో ఏదో ఆఫీసులో అర్జంటుపని ఉందట. చూసుకుని సాయంత్రానికి వస్తానని కబురెట్టారు" అంటూనే లోపలికి నడిచింది.

నీరసంగా నడక ప్రారంభించాడు సూర్యం. కిలోస్వీట్స్‌కు కనీసం ముప్ఫయిరూపాయలైనా కావాలి - ఎట్లా?




ఇప్పటికే తను రవిదగ్గరా, గోపి దగ్గరా అప్పుచేశాడు. ఇక ఇచ్చేవాళ్లు కూడా లేరు ఆఫీసులో.

తన సీటుకూడా దిక్కుమాలిన డిస్పాచ్ సెక్షన్. నెలకు పదిరూపాయలు దొరకడమే గగనం. దానికే ఆ ప్యూన్ గరటయ్యగాడు దేగకళ్లేసుకుని చూస్తుంటాడు.

అన్యమనస్కంగా ఆఫీసుకుచేరి సీట్లో కూలబడి కాయితాలు దులిపాడు. పనిచేస్తున్నట్లు నటన మొదలెట్టాడు - వరండాలో ఆఫీసరు గొంతు ఖంగున వినిపించేటప్పటికి. తలనొప్పి పగిలిపోతోంది. ఈ గరటయ్య గాడేడి త్రాష్టుడు కాఫీ తెప్పించుకుందామన్నా దిక్కుండదు.

''గరటయ్యా... గరటయ్యా!'' పొలికేక పెట్టాడు సూర్యం.

కిసుక్కున నవ్వింది టైపిస్టు లత.

వళ్లు మండింది సూర్యానికి. సీతాకోకచిలకలాగా అలంకరించుకు వచ్చి తనో అందగత్తెనని పోజు.

పైగా ''గరటయ్యా'' కొయిలకంఠం పలికినట్లుగా పిలిచిందామె.

''పిలిచారామ్మా!'' మహా వినయంగా వచ్చాడు ఎక్కణ్ణించో.

సూర్యానికి అరికాలి మంట నెత్తికెక్కింది. తన పొలికేక వినిపించలేదు రాస్కెల్‌కు. గొణిగినట్లు ఆ టక్కులాడి పిలిస్తే వచ్చాడు.

''సూర్యంగారెందుకో కేకేస్తున్నారు చూడు''

అంది.

వంటికి కారం రాసుకున్నట్టయింది సూర్యానికి. తన బతుక్కి పైపిస్టు రికమండేషనుతోనా ఫ్యాన్ వచ్చేది?

"ఏం కావాలిసార్!" గీరగా అన్నాడు గరటయ్య దగ్గరికొచ్చి.

"ఒక కాఫీ తగలెట్టు" మొహం మొటమొటలాడిస్తూ అన్నాడు సూర్యం.

"సార్!"

"మళ్లీ ఏమిటీ?" విసుగ్గా తలెత్తాడు.

ఎవరో యాభయ్యేళ్ల పెద్దమనిషి జాలిగా తన ఎదురుగా నిలబడి వినయంగా పిలుస్తున్నాడు.

సూర్యంలో ఠీవి పెరిగింది.

"ఏం కావాలి?" అన్నాడు దర్పంగా.

"నా కాయితం ఒకటి డిస్పాచ్ సెక్షన్‌లో వుందట. అందుకు వచ్చానుసార్" ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు.

"అయితే- ఏంటట? అందరూ వచ్చి ఇలా గొంతుమీద కూచుంటే పనులెలా చేసుకోవాలి?"

విసుగు నటించాడు సూర్యం.

"అలాకాదుసార్! పని అంతా అయిపోయింది. ఆ కాయితం చేతికివస్తే నాకు పెద్దరిలీఫ్ సార్! కాస్త చూడండి సార్" బతిమాల్తూ అన్నాడు.

"లేదండీ... బిజీగా వున్నా. తర్వాత రండి" ఏవో ఫైళ్లు ముందేసుకు నటిస్తూ పలికాడు.

కాళ్లీడ్చుకుంటూ బయటకు నడిచాడా పెద్దమనిషి.

సూర్యంలో ఆలోచనలు విజృంభించాయి. రాకరాక వచ్చాడు. బాగా అవసరంలో ఉన్నట్టున్నాడు. వసంత బాబాయిగారికి తను తీసుకెళ్లే స్వీట్సు తినేయోగం వున్నట్లే వుంది.

"ఏంసార్... మంచి జోరుగా వుండారు" కాఫీ తెచ్చిచ్చిన గరటయ్య ఎంక్వైరీ.

"ఏంలేదులేగాని- ఇప్పుడు నాకోసం వచ్చిన ముసలాయన ఎక్కడున్నాడు" నెమ్మదిగా అన్నాడు గొంతుతగ్గించి.

"ఆయనా! పాపం వరండాలోనే కునికిపాట్లు పడుతున్నాడు. మంచికేసే- పిలవమంటారా?"

మౌనం వహించాడు సూర్యం. గరటయ్య అదే అంగీకారమన్నట్లుగా బయటకు పరిగెత్తాడు.

నెమ్మదిగా తన దగ్గరికి వచ్చిన శాల్తీని "మీ పేరేమిటండీ?" అని నిర్లక్ష్యంగా అడిగాడు.

"సుందరచయనులండీ! కె.సుందరచయనులు, అమలాపురం" గబగబా అన్నాడు ఆదుర్దాగా.

"అలాగా- కాఫీ తాగిరండి! కాయితం రెడీ చేస్తా" నిబ్బరంగా పరీక్షిస్తున్నట్లు కళ్లల్లో కళ్లు పెట్టి చూస్తూ అన్నాడు.

"చాలా థాంక్సండీ! మీరూ రండి కాఫీతాగుదాం" సంకోచంగా అన్నాడు.

ఇష్టంలేనట్టు నటిస్తూ బయటకు నడిచాడు సూర్యం.

యాభయి రూపాయల కాయితం జేబులో కదులుతుంటే హోటల్నించి బయటకు వచ్చిన సూర్యానికి ఏనుగునెక్కినట్లుగా వుంది.

★ ★ ★

"వసంతా... వసంతా!" హుషారుగా తలుపుకొట్టాడు సూర్యం స్వీట్ ప్యాకెట్, పూలపొట్లంతోసహా.

"వచ్చేశారా... రండి! నేననుకుంటూనే వున్నాను మీరొస్తారని. ఇదుగో- ఈయనే మా బాబాయి. మన పెళ్లికి రాలేకపోయారు. నర్సుబాబాయి అని పిలుస్తాం- అసలు పేరు వేరేవున్నా" గబగబా చెప్పుకుపోతోంది.

"నమస్కారమండీ" అన్న సూర్యం మాటలకు పేపరు తాపీగా చదువుతున్న ఆయన మొహం బయటకు వచ్చింది.

సుందరచయనులుగారి ముఖారవిందం సూర్యం మొహంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండా చేసింది.

ఒకరి మొహాలొకరు చూసుకుని బిత్తరపోయిన వారి వాలకం వసంతకు పజిల్స్ అయిపోయాయి.

--సుచంద్ర




# చతుర ఫీచర్

# అశ్వక్రీడ

కౌబాయ్ సినిమాల్లో గుర్రాల పరుగులూ, విన్యాసాలూ చూసి ఉత్తేజితులై, ఉత్సాహంగా ఈలలు వేస్తుంటారు చాలామంది ప్రేక్షకులు. తాముకూడా ఆ హీరోలా గుర్రపుస్వారీ చేస్తే బాగుణ్ణన్న కోరిక కలగటంకూడా సహజమే. రాజులు, సంస్థానాధీశుల ప్రాభవంతోపాటే గుర్రాలపై ఆసక్తి మనదేశంలో చాలావరకు తగ్గిపోయింది. ఆధునిక వాహనాల రంగ ప్రవేశం మూలంగా రవాణాకోసం గుర్రాలని వాడుకునే అవసరమూ దూరమయింది. ఐనా ప్రపంచదేశాలలో గుర్రప్పందాల రూపంలో వాటి ఉనికి గుర్తుకొస్తూనే ఉంది. మనదేశంలో కూడా గుర్రప్పందాలు జరుగుతూనే వున్నాయి. ఇవన్నీకాక గుర్రపుస్వారీ ఒక మంచి క్రీడ-అనేవిషయం చాలా తక్కువమందికి తెలుసు. మౌంటెడ్ పోలీసులనబడే పోలీసు అశ్వదళం, సైనికుల అశ్వ విన్యాసాలు తప్ప ఈ క్రీడలు అంతగా ప్రచారంలో లేవు. వందల సంవత్సరాల తరువాత మనదేశంలో, అదీ మనరాష్ట్రంలో అశ్వమేధయాగం నిర్వహించారు. ఆధునికులు గుర్రపు రేసుల్ని ముద్దుగా అశ్వమేధయాగంగా పిలుచుకుంటూ డబ్బు తగలేసుకుంటున్నారు తప్పితే మనలో చాలామందికి అశ్వక్రీడలకు సంబంధించిన పరిజ్ఞానం తక్కువే.

చరిత్ర పూర్వకాలంలో సుమారు 5 కోట్ల సంవత్సరాలకిందట జీవించిన 'ఇయోహిప్పస్' అనేది గుర్రాలకు మూలమని శాస్త్రజ్ఞులు విశ్వసిస్తున్నారు. ఈ ఇయోహిప్పస్ ప్రస్తుతపు నక్క పరిమాణంలో వుండేదట. దాని నుండి మరికాస్త పెద్దదైన 'మెసోహిప్పస్', ఆ తరువాత గాడిద పరిమాణంలో 'ప్రోటోహిప్పస్'లుగా పరిణామం చెంది సుమారు ఒకకోటి సంవత్సరాలకిందట ఈనాటి గుర్రం ఆవిర్భవించి వుంటుందని శాస్త్రవిజ్ఞానం చెబుతున్నది. ప్రమాదాలనుండీ, శత్రువుల నుండీ రక్షణ కొరకు మరే ప్రత్యేక అవయవాలూ, ఏర్పాట్లూ లేని ఇయోహిప్పస్ వేగంగా

వరుగెత్తిపోయేదనీ, క్రమంగా అదే దానిలక్షణంగా మారిందనీ భావిస్తున్నారు. గుర్రంలోని ఈ లక్షణమే మానవునికి దాన్ని దగ్గర చేసింది. ఆదిమానవుడు గుర్రాలను కూడా వేటాడి, చంపి వాటి మాంసం తినేవాడు. మొదటగా గుర్రాలను మచ్చిక చేసుకున్నదెవరో తెలియదుకానీ నైరుతీ ఆసియాలోని ప్రాచీన సూసా నగరం అవశేషాలలో లభించిన ఆధారాలనుబట్టి కనీసం 5 వేల సంవత్సరాలనాటి నుండీ గుర్రపు స్వారీ తెలుసునని నిర్ధారించారు. క్రీ.పూ. 1400 నాటి హిట్టైట్‌లు క్రీడలు, యుద్ధం నిమిత్తమూ; క్రీ.పూ. 800 నాటి అస్సిరియనులు సింహాల వేటలోనూ గుర్రాలను ఉపయోగించేవారు. తొలి పర్షియన్‌లు గుర్రాలతో పోలోవంటి ఆటను ఆడేవారు. ఉత్తమాశ్వాల కోసం మేలుజాతి గుర్రాలను సంకరం చేసిన మొదటివారు అరబ్బులు. అనేక జాతుల గుర్రాలకు మూలం అరేబియన్ గుర్రాలే.

గుర్రం తల్లి గర్భంలో సుమారు 11 మాసాలు పెరిగి భూమ్మీద పడుతుంది. ఈ కాలం 10 నుండి 14 మాసాలవరకూ వుండవచ్చుకూడా. పుట్టిన ఒక గంటసేపటికే గుర్రపిల్ల నిలబడి, పరిగెత్తగలదు. గుర్రం సుమారు 25 నుండి 30 సంవత్సరాలు జీవిస్తుంది. ఒక సంవత్సరం వయసుకు వచ్చేసరికి దాదాపు సగం పెరుగుతుంది. ఐదేళ్ల వయసునాటికి సాధారణంగా పూర్తిగా ఎదుగుతుంది. మేలుజాతి రేసుగుర్రాలు ఏడేళ్ళ వయసునాటికిగానీ పూర్తిగా పెరగవు. రేసులు, ఇతర పోటీల్లో వయసువారీగా నిర్ణయించటానికి సులువుకోసం ప్రతి గుర్రమూ జనవరి మొదటి తేదీన పుట్టినట్టుగానే పరిగణిస్తారు. చాలామంది గుర్రాల యజమానులు తమ గుర్రాలను వసంతకాలంలో జతకట్టిస్తారు. అందువల్ల అది మరుసటి సంవత్సరం త్వరగా పుడుతుంది. ఆ తరువాత పుట్టే గుర్రాలు కూడా జనవరి మొదటితేదీన పుట్టినట్టే పరిగణిస్తారు. కనుక ముందుగా పుట్టిన గుర్రాలు మరింతగా ఎదిగి, మరింత బలం సమకూర్చుకుని పందెంలో గెలిచే అవకాశాలు ఎక్కువగా వుంటాయని అలా చేస్తారు.





గుర్రానికి ఒక మంచి ట్రైయినర్ తర్ఫీదు ఇస్తాడు. ట్రైయినర్ తను ముందుగా శిక్షణ పొందుతాడు. గుర్రపు స్వారీలో శిక్షణపొందిన వాళ్ళను 'హార్స్‌మెన్' అంటారు. ఈ విద్యను హార్స్‌మెన్‌షిప్ అంటారు. హార్స్‌మెన్‌షిప్‌లో తర్ఫీదుయిచ్చే సంస్థలను 'రైడింగ్ స్కూల్' అనీ, 'రైడింగ్ క్లబ్' అనీ వ్యవహరిస్తుంటారు. సైనికులూ, యుద్ధవిద్యలు నేర్చుకునేవారూ రైడింగ్‌ను అభ్యసించడం వందల సంవత్సరాలుగా వున్నదే. వీళ్ళుకాక మనకు కౌబాయ్స్‌గా తెలిసిన పశువులకాపర్లు తమ వృత్తిలో భాగంగా, వంశపారంపర్యంగా గుర్రపుస్వారీ నేర్చుకుంటారు. ఇది పాశ్చాత్యదేశాలకు మాత్రమే పరిమితమయింది. గుర్రాలను రేసులకోసమూ తర్ఫీదు ఇచ్చి సిద్ధంచేస్తుంటారు. ఈ తర్ఫీదు ఇచ్చేవారు, ఆయా క్రీడలలో పాల్గొనేవారూ రైడింగ్ క్లబ్బులో ప్రాథమిక శిక్షణ పొందటం తప్పనిసరి. అభిరుచిగా గుర్రపు స్వారీ నేర్చుకునేవారు కూడా వుంటారు.

మనదేశంలో మిలిటరీవారూ, పోలీసులూ, ఎన్.సి.సి.వారూకాక సాధారణపౌరులు రైడింగ్ నేర్చుకోవటానికి అవకాశాలు చాలా తక్కువగా వున్నాయి. కలకత్తా, ఢిల్లీ, బొంబాయి, మద్రాసులతోపాటు మన రాష్ట్రంలోని హైదరాబాద్‌లో కూడా ఒక రైడింగ్‌క్లబ్ వుంది. అదే 'ఆంధ్రప్రదేశ్ రైడింగ్ క్లబ్'గా పేరొందిన రైడింగ్ స్కూల్. కుతుబ్‌షాహీ నవాబుల కాలంనుండీ మన రాష్ట్రంలో గుర్రపుస్వారీకి ఆదరణ వుంది. హైదరాబాద్ సంస్థానంగా వున్నప్పుడు హైదరాబాద్ నగరంలో గుర్రాలతో ఆడే పోలో ఆటకు ప్రత్యేకంగా ఏడు క్రీడామైదానాలుండేవి. ఐతే రాచకుటుంబాల వారికోసమూ, యుద్ధ అవసరాలకూ, పోలో క్రీడకూ మినహాయిస్తే ప్రత్యేకంగా గుర్రపుస్వారీ నేర్పే సంస్థఏదీ ఆనాడుకూడా లేదు. అంతకుముందు 'గోల్కొండ పోలో క్లబ్' పేరిటవున్న సంస్థకూడా 1956లో మూతపడటంతో అభిరుచిగల అశ్వికులకు, అశ్వక్రీడాకారులకూ అయోమయం కలిగింది. అప్పుడు నీలం సంజీవరెడ్డి మనరాష్ట్ర ముఖ్యమంత్రి. సహకారశాఖ మంత్రిగా వున్న నవాబ్ మెహదీనవాజ్‌జంగ్‌తో వున్న స్నేహసంబంధాల ఆధారంగా, స్వ



యంగా మంచి అశ్వికుడైన నవాబ్‌ఖుస్రూ సంజీవరెడ్డితో మాట్లాడి, మన రాష్ట్రంలో మళ్ళీ అశ్వికశిక్షణకు శ్రీకారం చుట్టాడు. తత్ఫలితమే జూన్ 11, 1957న 'ఆంధ్రప్రదేశ్ రైడింగ్ క్లబ్' ఏర్పడింది. అంతవరకూ నగర పోలీసు అశ్విక దళం అధీనంలోవున్న పోలో అశ్వశాలలను రైడింగ్‌క్లబ్‌కు హస్తగతం చేశారు. తదనంతరం రాజా ధన్‌రాజ్ గిరీజీ, నవాబ్ ఆలమ్‌యార్‌జంగ్, పోలీసు అశ్వికదళం అందించిన సహకారంతో 18 గుర్రాలు, 1 పోనీ (పొట్టిగుర్రం) లతో రైడింగ్‌క్లబ్ తన కార్యక్రమం ప్రారంభించింది.

క్రమంగా ఈ రైడింగ్ క్లబ్ నలభై గుర్రాల వరకూ సమకూర్చుకొంది. దేశంలో సాధారణ పౌరులకు అశ్విక శిక్షణనిచ్చే సంస్థలు మరి నాలుగు మాత్రమే వున్నాయి. మన రాష్ట్రంలో ఎ.పి.రైడింగ్ క్లబ్ ఒక్కటి మాత్రమే. అభిరుచి, ఆసక్తిగలవారందరికీ శిక్షణనివ్వాలనే ఆశయంతో నెలకొన్న ఈ క్లబ్ మనరాష్ట్రంలో అశ్వక్రీడలు అంతరించిపోకుండా నిలబెడుతోంది.

అశ్వక్రీడలకోసం గుర్రాలకు రెండేళ్ళ వయసునుండి తర్ఫీదు మొదలుపెడతారు. ఒక గుర్రం జీవితంలో 2 నుండి 10 సంవత్సరాల మధ్యకాలం ఉజ్వలంగా వుంటుంది దాని యజమానికి. సాధారణంగా పది సంవత్సరాల వయసు దాటిన గుర్రాలను పందాలలో నియోగించరు. గుర్రంతో చాలా సున్నితంగా వ్యవహరించాలి. గుర్రాల శిక్షణలో ప్రోత్సాహమూ, శిక్ష అనే రెండువిషయాలూ ప్రాధాన్యత వహిస్తాయి. మంచి శిక్షకుడు సమయానుకూలంగా ప్రతిసారీ గుర్రాన్ని ఆదరణతో చూసి, చెప్పినమాట విన్నప్పుడల్లా మెచ్చుకుంటాడు. కళ్ళాన్ని వదులుచేసి పట్టుకుంటే అది ప్రోత్సాహంగా భావిస్తుంది గుర్రం. కళ్ళెంపట్టి లాగినప్పుడు దాని నోట్లో బిగబట్టడంవల్ల నొప్పి కలుగుతుంది. చెప్పినమాట విననప్పుడు గుర్రం కళ్ళెంపట్టుకుని లాగుతారు. దాంతో తాను తప్పుచేసినట్టు తెలుసుకుంటుంది. సక్రమంగా సూచనల్ని పాటించిన ప్రతిసారీ




మెచ్చుకోలుగా కళ్ళెం వదులుచేయటం; భుజాలపైన, మెడపైన ఆప్యాయంగా తట్టడమూ వంటివి చేయకపోతే తికమకపడుతుంది. గుర్రాన్ని ముందుగా మచ్చిక చేసుకుని, దానికి నెమ్మదిగా నేర్పించడం మంచిపద్ధతి. రెండు సంవత్సరాలు నిండేనాటికి స్వారీకోసంగానీ, జట్కా లాగటానికిగానీ తయారవుతుంది గుర్రం. ఇందులో ప్రారంభంలో కొన్ని అడుగుల దూరం మాత్రమే నడిపిస్తారు. తరువాత క్రమంగా దూరం పెంచుతూ, వేగంపైన కేంద్రీకరిస్తారు. అలాగే క్రీడల కోసం దూకటం వంటివి పద్ధతి ప్రకారం నేర్పిస్తారు. గుర్రప్పిల్లను మంచి సవారీ గుర్రంగాగానీ లేక మంచి పందెపు గుర్రంగా గానీ తీర్చిదిద్దటానికి ఒక సంవత్సరం సరిపోతుంది. రెండోఏటనుండీ పందాలలో పాల్గొంటాయి. కెంటకీ డెర్బీలాంటి ప్రఖ్యాత గుర్రపుపందాలలో పాల్గొనే గుర్రాలు మూడేళ్ళలోపు వయసువే అయివుంటాయి.

పందాలనుండి విరమించిన గుర్రాలనే సాధారణంగా రైడింగ్ స్కూళ్లల్లో ఉపయోగిస్తుంటారు. గుర్రం జీవితంలోని ఒక సంవత్సరాన్ని మనిషి జీవితంలో మూడు సంవత్సరాలుగా లెక్కగట్టుకోవాలి. పదేళ్ళ గుర్రం ముప్పయ్యేళ్ళ యువకుడిలాంటిదన్నమాట. చురుకుగానూ, పొగరుగానూ, పందాలలో పాల్గొన్న అనుభవంతోనూ ఉరకలెత్తే ఈ గుర్రాలను క్రమంగా అదుపుచేస్తారు రైడింగ్ స్కూల్‌వారు. వాటిని నెమ్మదిగా నడిపించటమూ, తక్కువ వేగంతో పరుగు తీయించటమూ అలవాటుచేసిన తరువాత అవి కొత్తవారు స్వారీ నేర్చుకోవటానికి అనువుగా వుంటాయి.

సాధారణంగా ఆరో ఏటనుండి గుర్రపుస్వారీ నేర్చుకోవచ్చు. అంతకన్నా చిన్నవయసు పిల్లలకు తగినంత శరీర సౌష్టవమూ, అవగాహనా వుండవు కనుక ఆరేళ్ళలోపు పిల్లలకు స్వారీ నేర్పటం అంత మంచిదికాదు. ఇక గరిష్ఠ వయోపరిమితికి హద్దులేదు. అది వ్యక్తిగత అభిరుచి, ఆసక్తి, శక్తిలపైన ఆధారపడి వుంటుంది. ఎ.పి. రైడింగ్ క్లబ్‌లో ఒక పెద్దమనిషి తన 50వ ఏట స్వారీ నేర్చుకోవటం ప్రారంభించాడు. అలాగే ఏ వయసువరకూ స్వారీ చేయవచ్చుననేది కూడా వ్యక్తిగతమే. ఇదే రైడింగ్ క్లబ్‌లో 80 సంవత్సరాల వయసున్న శిక్షకుడొకాయన వున్నాడు మరి.



ఆంధ్రప్రదేశ్ రైడింగ్‌క్లబ్‌లో 6 నుండి 12 సంవత్సరాల వయసున్న పిల్లలు చాలామంది స్వారీ నేర్చుకుంటున్నారు. యువతులుకూడా చెప్పుకోదగినంతమంది ఆసక్తితో నేర్చుకుంటు న్నారు. ప్రస్తుతం ఈ క్లబ్బులో 24 గుర్రాలూ, 4 పోనీలూ (సాధారణంగా 14.2 హేండ్స్ కన్నా తక్కువ ఎత్తుగల గుర్రాల్ని పోనీలంటారు. గుర్రం ఎత్తును 'హేండ్స్'లో కొలుస్తారు. ఒక హేండ్‌కు 4 అంగుళాలు. హేండ్స్‌కు సరిప డగా అదనంగావున్న ఎత్తును అంగుళాలలోనే చెబుతారు. అంటే 14.2 హేండ్స్ ఎత్తుగల గుర్రం 14 హేండ్స్‌పైన 2 అంగుళాలు లేదా 56 అంగుళాల ఎత్తున్నదన్నమాట). మనదే శంలోని అశ్వజాతులలో కఠియవాడీ, మార్వా డీ, మణిపూర్, పోలోపోనీ, స్పైటీ రకాలు న్నాయి. వీటిలో కఠియవాడీ మంచి పేరొంది నది. రేసులనుండి విరమించిన కఠియవాడీ గుర్రం ఖరీదు సుమారు 15 వేల రూపాయ లుంటుంది. ఎ.పి.రైడింగ్ క్లబ్‌లో ఎక్కువగా కఠియవాడీ జాతి గుర్రాలే వుండేవి. కానీ ఖరీదు పెరిగినందునా, సంస్థకు ఆర్థికపుష్టిలే నందునా ఇతర గుర్రాల్నికూడా తీసుకుంటు న్నారు.

ఎ.పి. రైడింగ్ క్లబ్ ప్రిన్సిపాల్ సిరాజ్‌అ టారీ కూడా ఇక్కడ శిక్షణపొందినవాడే. ఆయ నతోపాటు మరో ఇద్దరు శిక్షకులూ, ఇద్దరు జమేదార్లూ వున్నారు. శిక్షణలో ముందుగా గుర్రం శరీరం గురించి వివరంగా చెబుతారు. గుర్రం శరీర నిర్మాణంపట్ల అవగాహన కలిగిన తరువాత దాన్ని అదుపుచేయటం కొంత తేలి కవుతుంది. ఆ తరువాత ఒక పోనీపైన విద్యార్థి కూర్చుని వుంటాడు. ఆ పోనీ కళ్ళెం శిక్షకుని చేతిలో వుంటుంది. దాంతోపాటు శిక్షకుడు ఒక గుర్రంపైకెక్కి నడిపిస్తాడు. ఆ తరువాత గుర్రం ఎక్కవలసిన పద్ధతి:- ఎప్పుడూ గుర్రానికి ఎడమవైపునుండే ఎక్కాలి. ఎడమవైపు జీను కొక్కెంపై ఎడమకాలు ఆనించి, కుడికాలును గుర్రం వీపుమీదుగా పోనిచ్చి, మరోవైపుకు తీసుకోవాలి. ఒక ట్రెయినర్ ఒక పొడవాటి తాడును తన చేతపట్టుకుని తనచుట్టూ గుర్రాన్ని తిప్పుతూ, విద్యార్థికి సులువు నేర్పిస్తాడు. ఆ తరువాత గుర్రాన్ని అదుపుచేయవలసిన విధానాలు నేర్పిస్తారు. విద్యార్థి తనంతతాను గుర్రంపై అధిరోహించి దాన్ని నడిపించటం, ఆ తరువాత తక్కువ వేగంతో పరుగుపెట్టించటం లాంటివి క్రమంగా అలవాటు చేస్తారు. సక్రమంగా నేర్చుకునే విద్యార్థి 3 మాసాలలో గుర్రపుస్వారీ నేర్చుకోగలుగుతాడు.

గుర్రపు స్వారీలో సామాన్యులకు తెలియని విషయమేమిటంటే, గుర్రాన్ని అదుపుచేసేది కళ్ళెంతో కాదు.. కాళ్ళతో. కాళ్ళతో సున్నితంగా తట్టగానే గుర్రం పరుగు ప్రారంభిస్తుంది. గుర్రం వీపుపైన కొంచెం ముందుకు జరిగితే, వేగం పెంచుతుంది. కుడికాలుతో తట్టి, కొంచెం ఎడమవైపునకు జరిగితే గుర్రం ఎడమవైపుకు దిశ మార్చుకుంటుంది. కళ్ళెం బిగించి, దాని నడుంపైనుండి కొంచెం పైకిలేస్తే ముందున్న అడ్డంకు పైనుండి దూకుతుంది. నెమ్మదిగా వెనక్కి జరిగితే ఆగిపోతుంది. ఇలాంటి మెళకువలన్నీ విద్యార్థులు అభ్యాసంమీద నేర్చుకుంటారు. మామూలు స్వారీకి మూడుమాసాలు సరిపోతే అశ్వక్రీడలు, విన్యాసాలూ నేర్చుకోగోరేవారు కనీసం ఒక సంవత్సరంపాటు నేర్చుకోవటమే గాకుండా, తనతోపాటు తన గుర్రాన్నికూడా కలుపుకుని నిరంతరం అభ్యాసంలో పాల్గొనాలి.

ఎ.పి. రైడింగ్ క్లబ్‌వారు మనదేశంలోని ఇతర రైడింగ్ స్కూళ్ళవారందరికన్నా చాలా తక్కువ ఫీజుతో నేర్పిస్తున్నారు. ప్రవేశ రుసుముగా రూ. 250 చెల్లించి, ఏటా రూ. 200 వార్షిక రుసుము చెల్లించేవారు క్లబ్బు సభ్యులుగా కొనసాగుతారు. సభ్యత్వరుసుములలో కొన్నిసార్లు, కొన్ని సందర్భాలలో రాయితీకూడా వుంది. ప్రతి స్వారీకి రూ. 8 చెల్లిస్తే సరిపోతుంది. నేర్చుకునే అభిలాష వున్నవారికి మరిన్ని రాయితీలతో నేర్పించాలనే అభిలాషవున్నా ఆర్థిక కారణాలవలన సాధ్యంకావటంలేదని క్లబ్బువారంటున్నారు.

"ముందుగా మా క్లబ్బుకు కేటాయించిన స్థలంలో కొంతభాగం ప్రభుత్వం తిరిగి తీసుకుని, ఆసుపత్రికి ఇచ్చింది. గుర్రాలు తిరగటానికీ, పరుగెత్తడానికీ, అశ్వక్రీడలు నేర్పించటానికీ అవసరమైన స్థలం లేనందున ప్రస్తుతం మరీ ఇబ్బందిగా వుంది. నగర కార్పొరేషన్‌వారు, మసాబ్‌టాంక్ దగ్గర కొంతస్థలం కేటా




యించారు. కొత్తగా నేర్చుకునే వారికోసం ప్రతి రోజూ గుర్రాలను అక్కడికి తీసుకెళ్ళి, తీసుకు రావటం ఇబ్బందిగా వున్నా కొంత నేర్చుకున్న వారికి ఆ స్థలం కాస్త అనుకూలంగానే వుంది. అనేక క్రీడలను ప్రోత్సహిస్తున్న ప్రభుత్వం అశ్వక్రీడనుకూడా ఇతోధికంగా ప్రోత్సహించవలసిన అవసరం వుంది. ముఖ్యంగా ఆర్థికంగా చేయూతనందించి ఆదుకుంటే మరింత మంది విద్యార్థులకు నేర్పించే వీలుకలుగుతుంది'' అన్నారు ఈ క్లబ్ గౌరవకార్యదర్శి గులామ్ ఖాదర్‌ఖాన్.

ఆర్థికవనరుల కోసం మొదట్లో 'జింఖానా రేసులు' నిర్వహించేవారు. ఐతే ఔత్సాహికులు మాత్రమే పాల్గొనే జింఖానా రేసులు, సీజనల్ రేసులంటే మోజుపడేవారిని ఆకర్షించలేకపోవటంవలన ఎ.పి.రైడింగ్ క్లబ్‌కు వెసులుబాటు కలగటంలేదు. నిర్వహణ ఖర్చులుకూడా గిట్టుబాటు కాకపోవటంవలన జింఖానా రేసులు ఆపేయాల్సివచ్చింది.

మనదేశంలో రెండవసారి, దక్షిణ భారతంలో మొట్టమొదటిసారీ గత సంవత్సరంలో అంతర్జాతీయస్థాయిలో అశ్వక్రీడల్ని నిర్వహించింది ఎ.పి.రైడింగ్ క్లబ్. డ్రెసాజ్, షోజంపింగ్ వంటి ఒలింపిక్ క్రీడల పోటీలు నిర్వహించారు. ఈ ఈక్వెస్ట్రియన్ క్రీడా నిర్వహణలమూలంగా భారత అశ్వక్రీడల్లో హైదరాబాద్‌కు సమున్నతస్థానం లభించింది. రఘుబీర్‌సింగ్, అహ్లూవాలియా వంటి ప్రఖ్యాత క్రీడాకారుల్ని ఆకర్షించింది. ఈ పోటీలను చార్మినార్ కంపెనీవారు స్పాన్సర్ చేశారు. అశ్వక్రీడలకు సమున్నతస్థానం కల్పించాలనీ, క్రీడాకారులను ప్రోత్సహించాలనీ, అంతర్జాతీయ రంగంలో మనదేశానికీ స్థానం కల్పించాలని వీరి ఆశయం.

గుర్రాల నిర్వహణ మాటలతో జరిగే పనికాదు. ఒక గుర్రానికి సగటున నెలకు రూ. 800 ఖర్చుచేయాల్సి వుంటుంది. ట్రెయినర్లూ, ఇతర సిబ్బంది జీతభత్యాలూ, క్లబ్ నిర్వహణ, గుర్రాల ఆరోగ్యమూ వంటి అనేక అంశాలతోపాటు అవసరమైన స్థలం సమకూర్చుకోవలసిన సమస్య మరొకటి. ఒక గుర్రాన్ని రోజుకు రెండు సవారీలకన్నా ఎక్కువగా వినియోగించరు. ఒకసారి స్వారీకి ఒక సభ్యుడు చెల్లించే మొత్తం ఎనిమిది రూపాయలు మాత్రమే. ప్రతి సోమవారమూ సెలవుపోగా 26 రోజులలో ఒక గుర్రం రూ. 416 కన్నా ఎక్కువ సంపాదించలేదు. అదనంగా గుర్రాలు కొనాలంటే గుర్రం ఖరీదు 15 వేల రూపాయల వరకూ వుంది. ఇంతకుముందు హైదరాబాద్ పబ్లిక్‌స్కూల్ విద్యార్థులు ఎక్కువగా నేర్చుకునేవారు. వారు కూడా ఆపివేయటం వలన నిర్వహణ అసాధ్యంగా పరిణమించింది. ఇకపై నెలకు కనీసం 50 మంది విద్యార్థుల్ని పంపించటాని కి పబ్లిక్‌స్కూల్‌వారు నిర్ణయించుకున్నారు. ఐతే ఎన్ని అవరోధాలున్నా ఈ క్లబ్‌వారు ఎంతో ఉత్సాహంగా విద్యార్థులను ప్రోత్సహిస్తుంటారు. నెలలో రెండుసార్లు గోల్కొండ, కుతుబ్‌షాహీ టూంబ్స్ వంటిచోట్లకు విద్యార్థుల్ని తీసుకువెళ్ళి, రోడ్లపై స్వారీచేసే సావకాశం కల్పిస్తూంటారు. అశ్వక్రీడను నిలబెట్టవలసిన బాధ్యత ప్రభుత్వంపైనా, క్రీడాభిమానులపైనా వున్నది. అశ్వక్రీడారంగంలో మనదేశం పందెపు గుర్రంలాగా సాగిపోవాలని కోరుకోవటం అసమంజసమేమీ కాదు.

—వినయ్






# వచ్చేనెలలో...

"అయినవారి ఆప్యాయతకూ, ఆదరణకు నోచుకోని వృద్ధులకు కొంత ఆసరా, ఆశ్రయం కల్పించడంకోసం ఓ చిన్న వృద్ధాశ్రమం ప్రారంభించాలనుకుంటున్నాను. సమాజసేవపట్ల ఆసక్తి అనుభవం ఉన్న మీలాంటివాళ్ల సహకారంతోనే ఈ ప్రయత్నం ఫలిస్తుందని నా నమ్మకం..." అంటూ ఆగింది యశోద.

"ఆహా... అలాగా? మీ ఓల్డేజ్ హోమ్‌కి ప్రభుత్వం ఏమాత్రం గ్రాంట్ ఇస్తుంది?" అందావిడ ఠీవిగా.

"ప్రభుత్వాన్ని గ్రాంట్స్ అడిగేటంత పెద్దగా ప్రారంభించాలని అనుకోవడం లేదు"

"చేయడం అంటూ మొదలుపెడితే పెద్దగానే చేయాలి. ఢిల్లీలో నేను చేస్తూండిన సోషల్‌వర్క్‌కి నాకొక ఫోన్, కారు, ఆనరేరియంగా రు. 500 ఇచ్చేవాళ్ళు. మీరు కూడా అలాంటి సౌకర్యాలు ఏర్పరిస్తే సోషల్‌వర్క్ చేయడానికి నాకేమీ అభ్యంతరం లేదు" అందావిడ.

ఆ మాటలతో యశోద మొహం వాడిపోయింది.

సమాజసేవ పేరుతో స్వంతసేవ చేసుకోవడం కాకుండా చిత్తశుద్ధితో ఒక మంచి పనిని తలపెట్టిన యశోద ప్రయత్నం ఏమయింది?

పిల్లల్ని ప్రేమతో ప్రాణసమానంగా పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు మునలితనంలో ఎదురవుతున్న అనుభవాలను హృద్యంగా వర్ణించి పాఠకుల మనసులను కదిలించే

**సరోజ నారాయణరావ్‌గారి నవల 'వానప్రస్థం'**

ఫిబ్రవరి **చతుర** లో చదవండి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd.No. H/HD 1402

# సితార

## సినిమా క్విజ్ గురించి మీకు తెలుసా?

నాగేశ్వరరావు, శ్రీదేవి జంటగా ఉన్న ఈ స్టిల్ 'ప్రేమకానుక' చిత్రంలోనిది.

ఇది ఏ సంవత్సరం విడుదలయింది?

(1) 1981 (2) 1982

(3) 1983 (4) 1984



సినిమాల గురించి ఎన్నెన్నో ప్రశ్నలతో
వారం వారం క్విజ్

చిత్రరంగంతో మీకున్న పరిచయం చాలు!

శీర్షికలో పాల్గొనటానికి, బహుమతులు
గెలుచుకొనటానికి!!









- ★ పన్నెండు వారాలపాటు వారంవారం బహుమతులు
- ★ ప్రతీవారం సితారలో విజేతల పేర్లు
- ★ ప్రతీవారం ఇద్దరు లక్కీరీడర్స్ ఎంపిక
- ★ హైదరాబాద్‌లో సెమీఫైనల్స్, ఫైనల్స్
- ★ దూరదర్శన్‌లో ఫైనల్స్ ప్రసారం

ఇది గతంలో ఏ పత్రికాచేయని అపూర్వ ప్రయోగం!
దూరదర్శన్ తెరమీద మీరు కనిపించగల అదృష్ట యోగం!!